మ. తనశృంగారవనంబులోన గిరిపాంతం జక్కఁగాదిద్ది తీ
ర్చిన పూఁదేనియయేటికాలువదరిం జెంగల్వపుష్పాళ్ల నిం
చిన చంద్రోపలవేదిపై సరసగోష్ఠిన్ బోటిరయుండాను న
వ్వనజాతాయతనేత్ర శౌరిగుణముల్ వాక్రుచ్చి వర్ణించుచున్.

చ. అలికుల రావముల్ కిసలయాకుల కోకిలకాకు కాకలీ
కలకలనాదము ల్సెలఁగఁ గమ్మన తమ్మికొలంకు తెమ్మర
ల్వొలయఁగఁ దొంటిచందమున బుద్ధికి నేమియు నింపుగామికిం
గలఁగుచు సత్య చెలిఁగన్గొని యించుక సంశయించుచున్.

ఉ. చందనచర్చలేల విలసద్ఘనసారలవంబు లేలకో
రొందును లేని చల్లఁదన మీక్షణరోచులఁ గల్గువాని నా
నందమెలర్ప సర్వభువనంబులునుం గుణసౌరభంబు పెం
పొందఁగఁ జేయువానిఁ గమలోదరుఁ దోకొని రావె చెచ్చెరీ!

చ. అకట! యదేమియో యెఱుఁగనయ్యెదఁ దొయ్యలి దక్షిణాంస చూ
చుక నయనప్రకంపగుణసూచన లేమియు వల్లగావు పా
రెకు మది జాలివొందె యొకరీతిఁదలంకెడుఁ బ్రాణనాథుఁడోం
డొకచపలాక్షిఁగూడి నను నొల్లనిచెయ్దము లేమి సేసెనో?

క. అనిసత్యభామ తనవిధ
మనుఁగుందొయ్యలికిఁ జెప్పనవసరమున...

# శ్రీ పుష్కరాష్టకము

సంపాదకులు హరి సుబ్బారావుగారు

శ్రీయాయుతం త్రిదేహతాపపాపరాశినాశకం
మునీంద్రసిద్ధసాధ్యదేవదాస వైరభిష్టుతమ్
తటే స్తియాజ్ఞపర్వతస్య ముక్తిదం సుఖాకరం
నమామి బ్రహ్మపుష్కరం సవైష్ణవం సశంకరమ్.

సదార్య్యమాన శుష్కపంచవాసరే వరాగతం
తదస్యదాంతరిక్షగం సుతంత్రభావనానుగమ్
సదాంబుపానమజ్జనం దృశాంసదామృతాకరం
నమామి బ్రహ్మపుష్కరం సవైష్ణవం సశంకరమ్.

త్రిపుష్కరస్త్రి పుష్కరేతి సంస్మరే
త్సుదూరదేశగోపి యస్తదంగ పాపనాశనమ్
ప్రపన్నదుఃఖభంజనం సురంజనం సుధాకరం
నమామి బ్రహ్మపుష్కరం సవైష్ణవం సశంకరమ్.

మృకండు మంకణౌ పులస్త్య కణ్వసర్వతాసితా
అగస్త్యభార్గవౌ దధీచి నారదౌ శుకాదయః
సపద్మతీర్థ పాపనాశదృష్టయో దయాకరం
నమామి బ్రహ్మపుష్కరం సవైష్ణవం సశంకరమ్.

సదాపితా మహేక్షితం వరాహా విష్ణుసేక్షితం
తదామరేశ్వరీక్షితం సురాసురై సమీక్షితం
ఇహైవభక్తి ముక్తిదం ప్రజాకరం ధనాకరం
నమామి బ్రహ్మపుష్కరం సవైష్ణవం సశంకరమ్.

త్రిదంశి బ్రహ్మచారితాపసై సుసేవితం
పదార్థ చంద్రప్రాప్తదేవ నందికేశ్వరాభిదైః
సవైద్యనాధ నీలకంఠసేవితం సుధాకరం
నమామి బ్రహ్మపుష్కరం సవైష్ణవం సశంకరమ్.




# గోదావరమ్మా!

"తటరూఢకుటవారచటులాళిపటలాఖ్యనటజాలగాన ముత్కటముగాఁగ
కమనీయవిమలాబ్జగమనాఢ్యలమహంసరమణీవిరావ ముత్క్రమముగాఁగ
లహరీచరహితాప్తిసహసోద్ధబహుచక్రమహిళానినాద మాగ్రహముగాఁగ
నిరతోదకరతాగ్రసరరామతరుణప్లవరవ్రపపంచ ముత్తరముగాఁగ
జలికె చూచుచు నినుకవిన్నెలఁ జరించు
మానిమాణవులొవ్వ విశ్వైవదాని
గౌతమీనదిగాంచితె కమలనేత్ర!" —శిష్టు కృష్ణమూర్తి శాస్త్రి.

తల్లీ! నీపుట్టుక మహారాష్ట్రదేశమున. నీవలని పూర్తిలాభమునుమాత్రము ఆంధ్రులమగు మేమనుభవించుచున్నాము. మాపాలకులగు ఆంగ్లేయుల స్వదేశమంతటి విస్తీర్ణము గల భూప్రదేశమునుండి మాకొఱకు జలమును సంగ్రహించుకొని వచ్చుచున్నావు. నీయందలి ప్రతియంబుకణమును మాకమృతోపమానము. ముక్కారుసుపండు కేదారములు, కోనసీమలు, బంగారుతీగెలు, రసదాళీలు నీప్రసాదమే. దీపముపెట్టి నీకు నమస్కరింపవలయును. మొగముకడుగుకొని నీకు మ్రొక్కవలయును.

నీవు మాకొఱకు కీకారణ్యములగుండ ప్రవహించి వచ్చుచున్నావు. నాగరికుడనబడు మానవునిచే నింతవఱకు త్రొక్కబడని సాంద్రారణ్యములను చీల్చుకొనివచ్చి మాదేశమును నాగరికమొనర్చుచున్నావు. నీతీరమున ప్రయాణమునలిపి అచ్చటి ప్రకృతిరామణీయకమునకు అప్రతిభులై దొరలు నిన్ను The Rhine of India అని కీర్తించియున్నారు. నీవు నామమాత్రముననే ఆకర్షించుదానవు. నీతీరమున ప్రభుత్వకళాశాల సంస్థాపించిన ఆచార్యుడు మెట్కాపుదొరను తొలుత తపతీతీరమునఉద్యోగముకావలెనా గోదావరీతీరమున ఉద్యోగముకావలెనా అనిఅడుగగా 'గోదావరిఅనునామము ఉత్తేజకరముగనున్నది. నాకు ఆనదీతీరముననే ఉద్యోగముకావలెను' అనెనట. ఇది నీనామమాహాత్మ్యము. నీతీర

మున పలుసంవత్సరములు నివసించిన కూల్డ్రిదొర నిన్ను వారినదియగు థేమ్సుతోఁపోల్చి పొగడి పలికియున్నాఁడు. లాతివారే ఇట్లు నిన్ను కీర్తించుచుండ నీవలన నిత్యము అనేకోప యోగములను పొందుచున్న మేమెట్లు కీర్తింపకుందుము?

లోకపూజ్యులగు సీతారాములపాదధూళి తెలుగుదేశమునకు కోరుకునట్లు చేసినది నీవు. తెలుగువారి అతిథిసేవకు భద్రాచలమునందలి రామునిఉనికి యొకఅమోఘనిదర్శన ముగ నుండుచున్నది. కోకిలకంఠస్వరమును మామిడిచిగురు మధురించునట్లే వేదబ్రాహ్మణుల కంఠస్వరమును నీపావనోదకము బాగుచేయుటలో రసాయనముగ నుండునని పెద్దలందురు. గోదావరిబ్రాహ్మణుడు వేదమును సుస్పష్టముగ చదువుటలో లోకప్రఖ్యాతిగాంచియున్నాడు. వేదభూమియగు భారతదేశమున అపస్వరములేనివేదమును వినదలచువారు గోదావరిబ్రాహ్మణుని చెంతకు పోవలయునని మోక్షముల్లరు, భండార్కరుమహాశయులు చాటుచున్నారు. ఒక్కవేదపాండిత్యమేనా? వేదపాండిత్యమును పెంపొందించు నీజలమే కవిత్వ పటుత్వమునుగూడ కలిగించుచున్నది. ఉత్తరరామచరిత్ర రచియించిన భవభూతి నీమధుర జలములు గ్రోలినవాడు. రసగంగాధరకర్త పండితరాయలు నీదురసముతో పెరిగినవాడే. నన్నయ, శ్రీనాథాదులు నీతీరపు తెలుగుకవులన్న చాలు. విశేషించి బృహత్కథ నీతీరమున పుట్టినది. సప్తశాఖలతో సాగరమునుసంగమించిన మహోదారవు నీప్రాపునగాక ఆకథాసరిత్సాగరమెట్లు కల్పింపబడగలదు? ఆంధ్రమునఉన్న కొద్దిపాటి భక్తికవితకు నీతీరమేపాదు. రామదాసు, తూము నరసింహదాసు, నిష్కల ప్రకాశదాసు, యడ్ల రామదాసు మున్నగు ఆంధ్ర భక్తశిఖామణులకు నీవేప్రాపు. నిన్ను గ్రుంకియే ఆంధ్రభక్తకవిగ్రామణి పోతరాజు కైవల్య పదముచేరుటకు భాగవతము రచియించెను. భారతదేశములో దాదాపు మూడుభాగము లొకప్పుడు పరిపాలించిన ఆంధ్రశాతవాహనుల రాజధానీనగరములలో నొకటియైన ప్రతిష్ఠానమునకు నీవు ప్రాకారమవై యుంటివన్నచో చాలును తరువాతికాలమున చాళుక్యులకు, రెడ్డిరాజులకు నీతీరపట్టణమే రాజధానియైయున్నదని చెప్పనక్కఱలేదు.

ఇవి నాటికబుర్లు. నేడును నీవు ఆంధ్రుని అంతశ్శక్తులను లేవదీసి వానిని తోడిరాష్ట్రీయులలో తలయెత్తుకొని తిరుగసమర్థునిగ చేయుచున్నావు. మాకు నీవొకవిద్యాసాగరుని ప్రసాదించితివి. ఆంధ్రసంఘసంస్కర్తయై మాదేశమున అధునికయుగప్రవర్తకుడైన వీరేశలింగముపంతులుగారి కార్యక్షేత్రము నీతీరమే. భారతదేశమునగల రెండువందలపై చిల్లరమండలములలో కాంగ్రెసుకుఅనుబంధముగ ప్రథమమున మండలరాజకీయసభలను జరిపినది నీపేర వెలయుమండలమే. గోదావరీమండలరాజకీయసభలనుచూచియితరమండలమువారును ఈపద్ధతి నవలంబించిరి. చెప్పునదేమున ఆదర్శజ్యోతినీదిఅని. తెలుగువారిలో నొకపెద్దకళాశాలకు ప్రథమమున అధ్యక్షపదవినలంకరించిన మహనీయుడు నీవుపెంచగా పెరిగినవాడు. జగమెఱిగిన ఆఆచార్యునినామము ప్రత్యేకించిపేర్కొననేల? ఆంధ్రచిత్రకళయందు నూత్నమర్యాదను

గొనివచ్చి దానికొకవ్యక్తిత్వమునుకల్పించిన సిద్ధహస్తుడు దామెర్ల రామారావు నీఅడ్డాలలో పెరిగినాడు. వ్యావహారికభాషను వాదస్థితినుండి తప్పించి అనుశాసనస్థితికి గొనివచ్చిన ఆంధ్రభాషానుశాసనకర్త—మల్లాది సూర్యనారాయణకవి నీనెయ్యంపుబిడ్డ. సకలమైన ఉద్యమములకు జనిస్థానము ఆంధ్రదేశమున నీవేయనుట అతిశయోక్తిగాదు. నీవు ఆంధ్రులపాలిటిగంగవు. నీయందలి ప్రతినీటిబొట్టును మాకురొక్కము. నీతీరమునందలి ప్రతిఅంగుళస్థలములను మాకుతీర్థము. నీవు క్షణములో ముక్తినీయగలవు. నీయందలి ఒక్కస్నానము కోటిఫలము నీయగలదు. గంగకుఅగ్రజవు. తపశ్శాలి గౌతముడు నిన్ను మాకొఱకు తెచ్చినాడు. ఎంజనీరు కాటన్‌దొర నిన్ను మాకొఱకు కట్టినాడు. మాకు వారిరువురును ఆరాధ్యులు. చిరస్మరణీయులు. నీతోబాటు అమహనీయులనుగూడ మేముకొలుచుచుందుము.

గౌతముడు, కాటన్ మొదలగు మృతజీవులనుస్మరించుట తోడనే జ్ఞప్తికివచ్చినది. నీ కిప్పుడు పుష్కరయోగముకదా! సమస్తనదులను, సమస్తతీర్థములను, సమస్తనిధులను రప్పించి సార్ధత్రికోటితీర్థములతో పుష్కరునిగొనివచ్చి పుణ్యమార్జించుకొనుటకు మాకు చక్కనియవకాశమును గల్పించినావు. ముప్పదిమూడుకోట్లదేవతలయు, ముప్పదిమూడుకోట్ల భారతీయులయు దృష్టులిపుడు నీపై లగ్నమైయున్నవి. దిక్కులు నీప్రశంసతో ముఖరితము లగుచున్నవి. భారతదేశమునందలి వివిధప్రాంతములనుండి విశేషజనమునాకర్షించి వారికి తెలుగుదేశముతో పరిచయముకల్పింపజేయగల తీర్థములలో నీపుష్కరతీర్థమే తొలుత పేర్కొనదగినది. ఇట్టితీర్థము తెలుగువారికి మఱియొక్కటిలేదు. తెలుగువారినిగూర్చి ఇతర భారతీయులకు తెలియచెప్పుటకు నిశ్చయముగ నిది సాటిలేనిఉపన్యాసకురాలు. ఈఉపన్యాసకురాలు మాదేశమునకు పండ్రెండువత్సరములకొకసారి నీమూలమున వచ్చుచున్నది. గడచినసారి ఈఉపన్యాసకురాలు వచ్చినప్పటికంటె ఇపుడుమేమొకక్రొత్తసంస్థను సంపాదించుకొని యున్నాము. ప్రత్యేకవిశ్వవిద్యాలయమును పొందితిమి. నీనామముతో మఱియొకజిల్లా ఏర్పడినది. రాష్ట్రసమస్య చర్చలలోనున్నది. ఈసారి పుష్కరములువచ్చునరికి మాకు ప్రత్యేక రాష్ట్రమువచ్చునట్లు వరదానమునపుట్టిన నీవనుగ్రహింపగలవని నమ్ముచున్నాము. మా దేశక్రమాభివృద్ధిని నిరూపించుకొనుటకు ఈపుష్కరములను మేమొకహద్దుగపెట్టుకొన్నాము. ఈహద్దునకు అధిష్ఠానదేవతవునీవు. కావున పూజాస్వాగతము లందుకొనుము.

> "విచ్చేయవమ్మ! శ్రీవృషభవాహనధర సామజకటమదాసారధార!
> పయనంబుగావమ్మ! భగ్నజటాటవీకుటజ శాఖాశిఖాకోరకంబ!
> రావమ్మ! యాదిమబ్రహ్మదోఃపల్లవస్థితకమండలు పుణ్యతీరజలమ!
> లేవమ్మ! విశ్వంభరావధూటీకంఠ తారమౌక్తికహారధామకంబ!
>
> తెరలతో వీచికలతోఁ దరులతోడ
> విమలడిండీరఖండమండలములతోడ
> మురుపు శీవియు నామోదమును జవంబు
> పడువునొప్పంగ గంగమ్మ! పాడువవమ్మ!"

—శ్రీనాథమహాకవి.

# శారదలేఖలు

సౌభాగ్యవతియగు కల్పలతకు—

నెచ్చెలీ! ఏదివ్యతరంగిణీసలిలసేచనముచే భూపురంధ్రి సస్యపులకితగాత్రయై రాజిల్లునో, ఏపావననదీజలావగాహనము సమస్తదురితాపహారమో, ఏమహనీయసరిత్తటమున వనవాసక్లేశులగు సీతారాములు పర్ణశాలను నిర్మించుకొనివసించిరో, కవులు యేదేవినివర్ణింతురో, గాయకులు యేదేవినికీర్తింతురో, చిత్రకారులేదేవినిచిత్రింతురో, కర్షకు లేదేవి యాగమనమునకై హర్షసముత్సుకులై యెదురుజూతురో అట్టిఆంధ్రదేశభాగ్యలక్ష్మి తన నిరంతరజీవనదానముచే నిఖిలప్రాణిచయమునకు జీవనదానముచేయుచున్న మహానదీమతల్లి శ్రీగౌతమీదేవి పుష్కరోత్సవమనిన యెవరిహృదయము ఆనందతరంగితముగాదు? ఎవ రామహోత్సవమునకేగ వేడుకపడరు? నిత్యోత్సవముచేయదగిన యామహావాహినికి పదిరెండేండ్లకొకమాఱు పుష్కరోత్సవముజరుపు టొకగొప్పయా? మేలు, మేలు. ఆదివ్యోత్సవమునకు వెళ్లవలసినదే. ఆదక్షిణగంగకు నమస్సులిడవలసినదే. ఆదివ్యాపగలో క్రుంకవలసినదే. ఆమహానది తీరమున దేవపితృపూజలు జరుపవలసినదే. లేకున్న భారతీయులు కృతఘ్నులనిపించుకొనరా!

కల్పలతా! జ్ఞాపకమున్నదా కడచినపుష్కరములవృత్తాంతము? మనమప్పుడు రాజమహేంద్రవరములో మనబంధుగృహమున విడిసితిమి. గోదావరిలో స్నానములుచేయుచుంటిమి. ఊరిలో విశేషములనరయుచుంటిమి. క్రొత్తవారినెందఱనోకలసికొని పరిచయము గల్గించుకొంటిమి. ప్రాతవారినెందఱనోచూచి భాషించితిమి. అంతయు ఆనందమయముగా నుండెను. అనేదినములలో నొకనాడు మఱచితివో ఏమోకాని లోకమాన్యబాలగంగాధరతిలక్ మహాశయుడు "యదాయదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత అభ్యుత్థాన మధర్మస్య తదాత్మా నంసృజామ్యహమ్. కర్మణ్యే వాధికారస్తే మాఫలేషు కదాచిన" అను గీతామంత్రము జపించుచు దివంగతుడైనట్లు, ఆమహామహుని చందనకాష్ఠములతో దహించినట్లును ఆర్ద్రహృదయములతో అశ్రుపూర్ణలోచనములతో గద్గదికకంఠముతో ఆంధ్రపత్రికలో చదువుకొంటిమి. నేను చదువలేక సంకటపడితిని, నీవు వినలేక విలపించితివి. ఆప్రచండమార్తాండుని అస్తమయానంతరము భారతీయహృదయాకాశమున సాంద్రమైవ్యాపించిన కటికిచీకటులవెలార్చుచు శాంతిసుధాకరు డుదయించి తనశీతలవాక్యచంద్రికలచే భారతీయదుఃఖతమంబెడిపినదియు నప్పుడేకంటిమి. నాటికి నేడు పదిరెండేండ్లు. చూడు మిప్పుడు భారతజగత్తు!

దైవజ్ఞులప్పుడుగూడ నిప్పటివలనే భిన్నాభిప్రాయులై ద్వాదశదినముల పుష్కరములను అష్టాదశదినములకీడ్చిరి. ఇందువలన కశ్మలమధికమై వసతులుతక్కువై చాల మందిని ఆసుపత్రులకీడ్వవలసివచ్చుటేగాక కొంతమందిని కాటికిగూడ యీడ్వవలసివచ్చెను. ఎప్పుడైనను అధికజనసమూహముతోగూడిన నిట్టిఉత్సవములెంత ముక్తసరుగా జరిగిన నంత హాయి. కాని మనసిద్ధాంతుల బహువిధసిద్ధాంతములజూచినచో హరినందఱను సమాధాన పెట్టవలయునన్నచో ఈపుష్కరములకు దాదాపు రెండుమాసములుజరిపినను చాలవేమో

అనిపించుచున్నది. ఈమహాద్రైవజ్ఞశిఖామణులకు, జ్యోతిశ్శాస్త్రపారంగతులకు మనము విన్న పముసేయజాలిన సమర్థులముకాముగాని, గతపుష్కరములో జనులకుగల్గిన మహాకష్టము లను గుర్తించియైన వీరు అంగీరసనామసంవత్సరపంచాంగము ప్రకటితముకాకమునుపు ఇప్పు డూరూరజరుపుచున్న యీశాస్త్రసభలను అప్పుడేజరిపి ఒకనిర్ణయమునకువచ్చి ప్రకటించిన నెంతయు సమంజసముగానుండెడిదిగదా! చేయికాలినవెనుక ఆకులకు వెదకినట్లు రేపోమాపో మొదలుపెట్టబోవుచున్న గోదావరిపుష్కరమునుగూర్చి చర్చలుసేయుటకంటె రాగల కృష్ణా పుష్కరములనుగూర్చి విచారించుట మంచిది. భారతభూమి కర్మభూమి. భారతీయులు కర్మిష్ఠులు. తాముచేసెడి స్నానదానదేవపూజ పితృతర్పణాదులు సరియగుపర్వసమయములో చేసినగాని వారికి తృప్తిలేదు. అట్టిచో ఈశాస్త్రవేత్తలు తలయొకదినము పుష్కరారంభ దినముగా నిర్ణయించినచో వారిననుసరించు యీప్రజలగతియేమి? సరే ఎవరెన్నితిథులునిర్ణ యించినను ఏసిద్ధాంతులరాద్ధాంతము లెట్లున్నను కిమ్మనక పుష్కరములను ప్రారంభింపను న్నది యింగ్లీషునెల జూలై యొకటి.

భిన్నాభిప్రాయములచేత పుష్కరము లెన్నిదినములుసాగినను యాత్రికులైన యిం చుక మెలకువతోనడచుకొనినచో నెట్టికష్టములులేక సుఖముగా గృహోన్ముఖులుకాగలరు. యాత్రాస్థలములలో ముఖ్యముగా పాటింపదగిననియమములుమూడు. మూడుదినములకంటె నధికముగానుండకుండుటొకటి, పచ్చిపిండ్లు నిలువపండ్లుతినకుండుటొకటి, పుణ్యమనుభ్రాంతితో గోదావరిలోని పచ్చినీరుత్రాగకుండుటొకటి. ఈమూడునియమములను నియతితో పాలించినచో పుష్కరము లెన్నిదినములుజరిగినను భయములేదు. కాని యాత్రికులుబయలుదేరినచో మన వారు ఉల్లంఘించునవే ఇవి. నైష్ఠికులైనవారు యాత్రాస్థలములో రాత్రులు భుజింపరాదను నియమమొకటి, ఏదియో తిరిగితిరిగివచ్చినపిదప చేసికొనజాలని విసుగొకటి, గౌతమీతీరము మహాపుణ్యమను భ్రాంతియొకటి. ఈమూడుపిచ్చలలోబడి మనవా రిచ్చవచ్చినట్లువర్తించి కుత్తుకమీదికి తెచ్చుకొందురు.

ఈపుష్కరములతోబాటు రాజమహేంద్రవరమున ప్రారంభమగుచున్న దొకదివ్యోత్సవము. అదియే స్వదేశీప్రదర్శనము. భారతీయులకు గౌతమీమహానదీస్నానము మోక్ష ప్రదమగుచో అనంతమోక్షద మీస్వదేశీదీక్ష. ఆర్థికవిపత్తిచే గొట్టుకాడుచున్న తమదేశము సౌభాగ్యవంతముకావలయునని వాంఛించువారికి స్వదేశీదీక్షబూనుట కింతకంటె పర్వదినమ యము వేరొండులేదు. గౌతమీగంగలోస్నానమాడి పవిత్రులై స్వదేశీప్రదర్శనమునిలకించి పునీతులై స్వదేశీదీక్షబూని ధన్యులగుటయే కర్తవ్యము. ప్రపంచములో మెచ్చుటచూచినను యేదేశమువా రాదేశపువస్తువులనేకొనవలయునని అఖండప్రబోధముసేయుచున్న దినములివి. స్వతంత్రములును, మహాభాగ్యవంతములును, వివిధపరిశ్రమాకుశలములునగు దేశములే స్వదేశీ దీక్ష నింతగాబూనుచుండ పరాధీనతచే క్రుగ్గుచు, రాజకీయకల్లోలముచే క్రుక్కుచు, ఆర్థిక

విపత్తిచే అల్లకల్లోలబడుచున్న మనభారతదేశీయుల కీస్వదేశీదీక్ష యెంతఅవసరమో వేరుగ చెప్పవలయునా? నాణెముతగ్గుగాక, వెలహెచ్చుగాక, లేమియేవచ్చుగాక ఈసమయములో భారతీయులెల్లరు స్వదేశీవ్రతము నవలంబింపరేని 'కలుగనేటికితల్లుల కడుపుచేటు?'.

యాత్రకేగినవారెల్ల వస్తువో, వస్త్రమో, బొమ్మయో, ఏదియోయొకటితెచ్చుట మనవారికలవాటు. ఆఅభ్యాసము ఉత్కృష్టమైనదనుటకు సందియములేదు. అయితే యీమారు గౌతమీపుష్కరయాత్రకేగిన మహాజనులెల్లరు తాము యిండ్లకుకొనితెచ్చుకొనిన వెల్ల స్వదేశమునందు తయారుచేయబడినవిగనేయుండునట్లు జాగ్రత్తవహింపవలయును. ఏలనందువా? గోదావరీపుష్కరములవలెనే తత్సందర్భమునజరిపెడి స్వదేశీప్రదర్శనోత్సవము గూడ సర్వకాలము జ్ఞాపకముననుంచుకొనదగినదిసుమా! కల్పలతా! సెలవు. గౌతమీపుష్కరములకేగు భాగ్యమొదవెనేని యచ్చట నేచూచిన విశేషములెల్ల నవిస్తరముగా నీకు జాబువ్రాయుదును. లేదా లేదు.

—మిత్రురాలు, శారద.

## గోదావరీధ్యానశ్లోకములు

గంగాగంగేతియోబ్రూయాద్యోజనానాంశతైరపి
ముచ్యతేసర్వపాపేభ్యోవిష్ణులోకంసగచ్ఛతి.
అంబతద్దర్శనాన్ముక్తిర్నజానేఫలం
స్వర్గారోహణసోపానాంమహాపుణ్యతరంగిణీ.
అతిక్రూరమహాకాయ కల్పాంతదహనోపమ
భైరవాయనమస్తుభ్యం అనుజ్ఞాం దాతుమర్హసి.
పుష్యార్కేజన్మనక్షత్రే వ్యతీపాతే దినత్రయే
సకృద్గోదావరీస్నానం కులకోటిసముద్ధరేత్.
రేవాతీరేతపఃకుర్యాన్మరణంజాహ్నవీతటే
దానం దద్యాత్కురుక్షేత్రే గౌతమ్యాస్త్రితయంవరం.
వరంగోదావరీతీరేనిరేణోదరపూరితం
అన్యత్రశర్కరాపూపం పాయసాన్నం పరిత్యజేత్.
ఇహజన్మనియత్పాతం యత్పాపం పూర్వజన్మని
తత్సర్వంనాశమాప్నోతి గోదావరినమోస్తుతే.
సార్థత్రికోటితీర్థైశ్చసంయుతాంవృద్ధగౌతమీం
ధ్యాయామి తీర్థరాజేనయుతాం గోదావరీంశుభం.
మందాకినినమస్తేస్తు నమస్తేసురపూజితే
గోదావరినమస్తుభ్యం మహాదేవినమోస్తుతే.

# పుష్కర గౌతమి

## పుష్కరసామాన్యప్రశంస

అహల్యాజారుడై శరీరము ఆపాదమస్తకము అసహ్యముగ నగునట్లుశప్తుడైన ఇంద్రుని పాపములు తొలగించుటకు బ్రహ్మచే నిర్మింపబడిన తీర్థరాజు పుష్కరుడు. అతడు సమస్తతీర్థములకును అధ్యక్షుడై ఎల్లవేళల స్వర్గలోకమునందలి మందాకినినదియందు వసించియుండునట్లు బ్రహ్మదేవుని ఆదేశము. అయినను పుష్కరుడు భూలోకమునుకూడ పునీతముచేయు ఉద్దేశముతో కొన్ని నియమితకాలములందు ఇచ్చటి నదులయందును ప్రవేశించి కొన్ని దినములుండుచుండును. తాను ఎల్లవేళల నివసించియుండు దేవలోకమునకంతటికిని గురువగు బృహస్పతి మేషాదిద్వాదశరాసులయందు ప్రవేశించుకాలమున పుష్కరుడు తాను భూలోకమునకువచ్చు ముహూర్తముగ ఏర్పఱచుకొనెను. బృహస్పతి సంవత్సరమునకు ఒక్కొక్కరాశియందు ప్రవేశించుచుండును. అట్లు బృహస్పతి ఆయారాసులయందు ప్రవేశించిన తొలిపండ్రెండు దినములందును దేవలోకమునుండి పుష్కరుడువచ్చి భారతదేశమునందలి ఆయాపుణ్యనదులయందు నిలుచును. పుష్కరుడు తీర్థములకు రాజుగదా! కావున అతడు ఏనదియందు ప్రవేశించునో అచ్చటికి మూడుకోట్ల ఏబదిలక్షల తీర్థములు; సమస్తసముద్రములు; సర్వనదులు; అఖిలనిధులు; అరణ్యములు; ఋషులు; దిక్పాలకులు; దేవతలు; వాణి, లక్ష్మి, గౌరి; బ్రహ్మ, విష్ణువు, మహేశ్వరుడును వత్తురు. పుష్కరుడు పండ్రెండుదినములుండి తిరిగి దివ్యలోకమునకు పోవును. మిగిలిన వారెల్లరు సంవత్సరపర్యంతము అచ్చటనుందురు. భారతదేశమున గంగ, నర్మద, సరస్వతి, యమున, గోదావరి, కృష్ణ, కావేరి, భీమ, రథ్య, భద్ర, సింధు, ప్రణీతఅను పండ్రెండునదులు క్రమముగా గురుడు మేషము, వృషభము, మిథునము, కర్కాటకము, సింహము, కన్య, తుల, వృశ్చికము, ధనుస్సు, మకరము, కుంభము, మీనము అను రాసులయందు ప్రవేశమునొందినయట్టి ఆయాకాలములందు పుష్కరయోగమునంది పుణ్యప్రదములగుచున్నవి. ఈ పుష్కరయోగము అతిపవిత్రమైనది, పుణ్యప్రదమైనది. పుష్కరయోగముగల నదులయందు స్నానమొనరించి శుచిరై దానాదికర్మలాచరించుటవలన పాపములుపోవును, శుభములుకలుగును. పుష్కరయోగకాలమున సమస్తతీర్థములును ఆయానదులయందు సన్నివేశమైయుండును గావున అప్పటి ఆనదియందలి స్నానము సర్వతీర్థస్నానమగును; ఒక్కచోచేరిన సమస్తదేవతలను ఒక్కసారిగ సేవించినట్లగును. పుష్కరయోగపుణ్యకాలమున గావింపబడు దానముల ఫలములు కోటిగుణితములుగానుండును. ఈపర్వకాలమున తీర్థవిధులు పెట్టుటచేతను, పిండప్రదానములు చేయుటచేతను పితృదేవతలను తృప్తులచేయవచ్చును. ఇచ్చటి పిండదానములనంది పితృదేవతలు తృప్తులై ఉత్తమలోకములకు పోవుదురు.

## గోదావరీపుష్కరయోగము సర్వోత్తమము

ఇట్టి ఈవివిధనదుల పుష్కరయోగము లన్నిటికంటెను గోదావరీపుష్కరయోగము ప్రశస్తతమమును, పరమోత్కృష్టమునైయున్నది. ఇందుకు కారణములు చూపబడును. భారతదేశమున గంగానది అత్యంతపూజ్యభావముతో ఆరాధింపబడుచున్నది. అట్టి పావనగంగాస్రవంతికి గోదావరి అక్కగారని భారతీయులు పలుకుదురు. ఈపలుకు ఉట్టిపుక్కిటిగాథకాదని భూగర్భశాస్త్రవేత్తలును, భూగోళశాస్త్రవేత్తలును తమ తీవ్రపరిశోధనలచేతను, దీర్ఘపరిశ్రమచేతను నిరూపింపగలిగియున్నారు. చిరకాలమునకు పూర్వము ఇపుడు మనము ఉత్తరహిందూస్థానమని పిలుచు ప్రదేశమంతయు సముద్రమైయుండెను. అనగా ఆకాలమున సముద్రపుటలలు హిమాలయపర్వతమును తాకుచుండిన వన్నమాట. వింధ్య

పర్వతమునకు దక్షిణముననున్న ప్రదేశము—దక్కను పీఠభూమియని మనమిప్పుడు వ్యవహరించునది–ఒక ద్వీపముగా సముద్రము నడుమనుండెను. అందు గోదావరి ప్రవహించుచుండెను. అనంతరము క్రమముగా ఉత్తరహిందూస్థానము ఏర్పడుటయు గంగాదినదులు పుట్టుటయు జరిగెను. అగుటచే గంగానదికంటె గోదావరి ప్రాచీనతరమైనది. తీర్థమాహాత్మ్యమునకు ప్రాచీనత యొకముఖ్యకారణము గదా! మిక్కిలి ప్రాచీనకాలమువదైన ఈనది పుష్కరయోగమున ఇతర నదులకంటెను పుణ్యప్రదమగుచున్నది. గంగకంటె ముందుపుట్టినదగుటయేగాక గోదావరి దానికంటె ఉత్తమజన్మకలదియని కూడ మనపురాణములు ఘోషించుచున్నవి. బ్రహ్మకమండలువునందును, విష్ణుపాదములందును, మహేశ్వరునిజటయందును ఉపవసించి త్రైపవిత్ర్యమైన గంగాతీర్థము భూమికి బ్రాహ్మణుడగు గౌతమునిచే గొనిరాబడి గోదావరి యను పేరను, క్షత్రియుడగు భగీరథునిచే గొనిరాబడి గంగ యను పేరను బరగెను. బ్రహ్మక్షత్రియులని పురాణము లందున్నదిగావున బ్రాహ్మణునిచేగొనిరాబడినదానికి హెచ్చుగౌరవము ఉండుట పౌరాణికధర్మము. ఇట్లు కాలముచేత గంగకంటె ప్రాచీనమును, జన్మముచేత దానికంటె ఉత్తమమును అయిన గోదావరినది ఈ పుష్కరయోగమున మరియు ఉత్కృష్టమైనదగుచున్నది. కొన్నికొన్ని తీర్థములందు కొన్నికొన్ని కర్మలు నిషేధములు. గయయందును, గోదావరియందును ఎట్టినిషేధములును లేవు. ఊనమాసములు, మలమాసములు మొదలగు ఇతర తీర్థములందు నిషేధింపబడిన సర్వకర్మలును గయయందువలె గోదావరియందును నిరభ్యంతరముగ జరుపవచ్చునని పురాణములు ప్రమాణీకరించుచున్నవి. గోదావరీపుష్కరము సర్వోత్తమమనుటకు ఇదియు ఒక కారణము. ఇక చెప్పబోవునది వీనికంటెను ముఖ్యమైనది. తీర్థములరాజగు పుష్కరుడు ఆయానదులయందు గురుడు ఆయారాసులయందు ప్రవేశించిన తొలిపండ్రెండుదినములు మాత్రమే యుండును. గోదావరియందు తుది పండ్రెండు దినములుగూడనుండును. ఇదియొకవిశేషము. గురుడు సింహరాశియందు ప్రవేశించినపుడు పుష్కరుడు గోదావరియందు సార్ధత్రికోటితీర్థసహితుడై ప్రవేశించి పండ్రెండుదినము లుండునని చెప్పబడియున్నదిగదా! గురుడు సింహరాశిని విడుచుటకుముందును పండ్రెండు దినములు పుష్కరుడు గోదావరియందుండును. అనగా మొత్తము ఇరువదినాలుగు దినములుండునన్నమాట. ఈ గౌరవము మిగిలిన పదునొకండునదులలో దేనికిని లేదు. ఈవిషయము గోదావరీపుష్కరము సర్వోత్తమమగుటను నిర్ధారణచేయుచున్నది. గోదావరీపుష్కరమున పుష్కరుడు గోదావరీనదియందు ప్రవేశించియున్న తొలిపండ్రెండుదినములను ఆదిగోదావరీపుష్కరమని యును, తుదిపండ్రెండుదినములును అంత్యగోదావరీ పుష్కరమనియును పురాణములందు ప్రసిద్ధములైయున్నవి. ఆదిగోదావరీపుష్కరమువలెనే అంత్యపుష్కరమును స్నానదానాదిసత్కర్మములకును ఉత్తమమై శ్లాఘ్యమైయుండును.

## టాజమహల్

బొడ్డు బాపిరాజుగారు

ఎనలేనట్టివిశేషశిల్పభరితం బీమందిరంబంతయున్
గన సీకన్నులురెండుజాలవని యాగంతుల్ మహానందభా
జనమంచున్ గనుమెచ్చ హూణుల ప్రశంసాపత్రముల్ గొన్న యీ
ఘనమౌటాజమహల్ గనుంగొనెడిభాగ్యంబబ్బునేడాగరాన్
దేశదేశాలలో పేరుమోసి; శిల్పకళకుకాణాచియై తనఖ్యాతిరీతి
చలువరాకట్టడంబు టాజమహాలుమన భారతావనినుంట గర్వపడదగును.

# గౌతమి

శిరోమణి వారణాశి గంగాధరశాస్త్రిగారు

౧

నిన్న మొన్నటిదాక ప్రసన్నవృత్తి
నున్న నీవేలఁ గలుషత నొందితిపుడు
గౌతమీ! యాశ్రితులటంచు గానకుండఁ
గూలఁద్రోయుదే! యిట్లనుకూలతరుల.

౨

ధీవరులెల్లవేళ నవధీరితసాధ్వసచిత్తవృత్తి బాం
థావళి ప్రేమపూర్వముగఁ ద్రావెడు శుభ్రజలంబునెల్లఁ బం
కావళమౌనటుల్ గలఁచి, యాంతరసుప్తుల నాత్మజన్ములన్
జీవముతో గ్రహించిరనుచింత, రుషాకులవై తెలి గౌతమీ!

౩

సలిలసమృద్ధియందు, రుచిసంపదయందును, నాత్మవిస్తృతిన్
దలఁపగ నల్పయయ్యుఁ ద్వరితంబున నేగెడు కృష్ణ, భర్తకా
గిలిగవియంగనంచు విజిగీషతఁ దొందర నేగుదెంచెడే
కలుషితచిత్తవై యిటులు, కాంతుఁడుగాంచఁడె మిమ్ము గౌతమీ!

౪

కలుషతఁబూనితేనిఁ గడుకాతరభావముచెంది లోకమో
పులిననితంబినీ! కతకపుంజము గంధము తీసిపూసి య
త్యలఘుప్రయత్నముల్ సలుపు నప్పటికిని సహజప్రసాదతన్
జెలఁగ వగ స్వమాని చనుదెంచి నినున్ బ్రతిమాలకుండినన్.

౫

తనకమండలమొకయెత్తు తానొకెత్తు
నగుటనాతఁడు రయమునసరుగలేఁడు
స్వాతివానకు శుక్తికచందమునను
జనములాతనిరాకకై వనరుచుండ్రు.

# ప్రస్తుత స్త్రీ జీవితము

## కొల్లిపర వేంకటసుబ్బారావుగారు

౧

సాధారణముగా చాలగృహములందదేమి పాపమో గాని యాడుబిడ్డపుట్టినంతనే కొడుకుపుట్టునను ఆశయంతయు ఒకసారిగ భగ్నమైపోవును. అదియే ఆకారణమైన మనోవేదనకు ప్రారంభము. ప్రపంచమంతయు విరుచుకొని మీదపడినట్లుండును. అతల్లిదండ్రులకు దుఃదృష్టదేవతయే యారూపమున నవతరించినదని ఇంటివారందరూ చింతింతురు.

—ఇది జన్మయందు.

౨

ఊయెలయందు బాలిక ఏడ్చుచుండుటగని తల్లి గృహకృత్యాలువదలి పాలిచ్చుట తండ్రిచూచి "ఆఫీసువేళయైనది, వంటా కాలేదు మన్నూ కాలేదు,—యీ పిల్లకోసము ఏవో రెండుడబ్బులుసంపాదించి ఆనాడు వచ్చుగండము (వరశుల్కము) తప్పించుకోవాలి, మరి" యని గదుమును. —ఇది బాల్యావస్థయందు.

౩

అంతలో బాలిక కొంచము పెద్దదియగును. ఇంటియందు అందరూ బాగుగా భోజనము చేయుచుమా పాపమాయాడుబిడ్డకు యుక్తవయస్సు త్వరలో వచ్చునను భీతితో తగినయాహారము యివ్వకుందురు. దీనికి కారణము శారదాచట్టమందు అసమ్మతియే. ఆబాల అన్నయో తమ్ముడో చదువుకొనుచుండుట చూచి తానుగూడ ఏదియో ఒక పుస్తకము చదువబోవ తల్లిదండ్రులు చూచి 'దీని ఖర్మంకాల, చదువులెందుకో, వుద్యోగము చేస్తుందో, వూళ్ళేలుతుందో" యని కఠినముగా నందురు. దీనిచే చదువునందు బాలికకుగలఉత్సాహము నశించును. —ఇది కౌమారావస్థయందు.

౪

తండ్రి కష్టపడి భూముల తెగనమ్ముకొని వరశుల్కము చెల్లించి యేజోడిగముగా నాబాలకు వివాహము చేయును. కొంతకాలమున కత్తవారింటికేగును. అక్కడ సర్వసామాన్యమైనసంఘటనము— అత్తగారిపోరు ఎదుర్కొనవలసివచ్చును. మగడు మంచివాడైనసరి: లేకపోయిన యాస్త్రీ అగచాట్లకు మేరయేలేదు. —ఇది వైవాహికావస్థయందు.

౫

కొంతకాలమునకు మగడు దివికేగును. వెంటనే సర్వభోగములకు ఈమె దూరమగును. పెనిమిటి గంగాప్రవేశం: భార్య వంటగదిప్రవేశం అన్న లోకోక్తి సార్థకమగును. అత్తింటియందందరికిని లోకువ యీమెయే. ఈమెనుపోషించుట పెద్దరోతిని తలమీదనుంచుకొన్నంత కష్టమనిపించును. ముఖ్యముగా పాపమావ్యక్తి అశుభసూచకమగును. ఇదియే యీమె హైన్యస్థితిని సూచించును. ఆమెకుగల హృదయవేదనకు అంతలేదు. —ఇది వైధవ్యావస్థయందు.

౬

కాలప్రయాణ మతివేగము. అంతట వృద్ధురాలై పోవును. దేహపటుత్వము క్షీణించును. రుజాపీడితయగుట సంభవించును. అనివార్యమైనచావునకు బద్ధురాలగును. —ఇది వృద్ధావస్థయందు.

ఈవిధముగా నెంతమంది స్త్రీలజీవితములు మన భారతదేశమందు వ్యర్థములగుచున్నవో చూచుచుంటిమి. పుట్టినదిమొదలూ జన్మాంతమువరకూ ఎన్నియో కష్టములకు పాల్పడుచున్నది పాపమామె. మానవకోటియందు పురుషునకెంత ప్రాముఖ్యతగలదో స్త్రీకిగూడ నంతియే. అట్టిపక్షములో స్త్రీమాత్రము యిట్లుండుటకు కారణము మనసంఘదురాచారము. పాశ్చాత్యదేశములందలి స్త్రీలజీవితమునకునూ, మనదేశమందలి స్త్రీలజీవితమునకునూ చాలా తారతమ్యముగలదు. ఇట్లనుటలో వారిననుసరించవలెననుటగాదు. మంచిగ్రహించుట అవసరము.

# గోదావరీనది

టేకుమళ్ల రాజగోపాలరావుగారు, బి. ఏ;

ఇది మిక్కిలి ప్రాచీనకాలమునాఁటి పవిత్ర నది. గోదాయఁగా ఆవులనిచ్చునదనియు, నీనదీతీరభూములలో మంచి పాడియావు లుండుటచే దీనికీ పేరువచ్చినదనియు కొందఱు భావింతురు. గోయనునది పవిత్రతను సూచించుననియు, గంగ తరువాత గంగయంతటి పవిత్రత నిచ్చునదగుటచే దీని కీపేరు వచ్చెననియు మఱికొందఱు తలంతురు. గోహత్యాపాతకమును నివారించుకొనుటకై గౌతముఁ డీనదిని నిచ్చటకుఁ దెచ్చినందున దీనికి పేరువచ్చినదని యింకొక కొందఱందురు. ఈ నది సముద్రమున కనతిదూరమున చాలమేర ప్రవహించెననియు దీనికూలమునందిప్పుడున్న పట్టణములు పూర్వము లేవనియు, ఈగోదావరీనది మాటిమాటికి తనగతులను మార్చుకొని సముద్రమునఁ బడుచువచ్చెననియు కొందఱు చెప్పుచున్నారు. ఏదియెట్లున్నను భూమిని బంగారముగా మార్చివైచి బంగారు పంటలను జనులకొసఁగిన దీగోదావరీనదియే. ఇది యీ క్షేత్రమున వెలసిన దేవతాకన్య. పశ్చిమసముద్రమున కేఁబది మైళ్ళకీవలనున్న త్ర్యంబకమహాక్షేత్రమునందలి పడమటితట్టు కొండమీఁది తటాకము ప్రక్కనుండు శివవిగ్రహము నోటనుండి జననమంది, యాతటాకామృతపుష్టిచేఁ గ్రమముగా ప్రాఁకుచు నడయాడనేర్చి, యాఱునూటతొంబది సోపానములుగల యాకొండ నొకనాఁ డధిరోహించి యాగ్నేయముఖముగా సంచారమునుసేయుచు, బాలప్రాయమునుదాఁటి యౌవనప్రాదుర్భావయై తనయందలిగంగుమీలు నేత్రములుగా, కమలములు కండ్లుగా, పద్మప్రభాభాసమానములగు శైవాలములు పూలజడగా, విజయశంఖములు గళముగా, బిసతంతువులు హస్తములుగా, కచ్ఛపములు పిఱుదులుగా, కన్యాత్వము సిద్ధింపఁబడినదోయనఁ బద్మినీత్వమునంది విరాజిల్లుచు, మనుధర్మప్రకారముగా భర్త్రన్వేషణాపరాయణయై తొమ్మన్నూటతొంబది మైళ్ల దూరము నధిగమించి తనవరమువలన పవిత్రీభూతములై సమృద్ధసస్యములైన యొకలక్షయుఁబదునైదువేల మైళ్ల నేలలో నింగినుండి పడెడు వర్షామృతప్రవాహాస్వాదనమువలన దివ్యతనుగాంచి కళాస్ఫూర్తిచే మెఱసి, తనయందలి రసమునంతను శృంగారరసము గావించి మించుచు, పెయినుగంగా వెయినుగంగా సంగమజనితయైన ప్రాణహితానది తనకుఁ బ్రాణహితయగు చెలికత్తెగా, మహాభోగయగువరదయు, బంగారపు టిసుకలలో నాట్యమాడెడు కిన్నరసానియు దేవతాంగనయగు నింద్రావతియు, శ్రీరామునిచే సహితము తనయెంగిలిని దినిపించిన శబరియు, కళింగాంగనయగు శిలేఱును తన్ను మెచ్చి యాశ్రయించిన సఖమణులుగా హాయులు మెఱయ యౌవనోద్రేకముతో భర్తృచింతాపరాయణయై పోయి పోయి, గట్టులనక పుట్టలనక మహారణ్యములనక యన్నింటి నధిగమించుచు, శరవేగముతో కొండలపై నుండి క్రిందికి దిగఁజాఱుచు, నడుమ నడుమ నొక్కొకచోట నిజమధ్యమును జూపనోయన సన్నగిల్లి గంభీరధ్వనులుచేయుచు, వచ్చివచ్చి పాపికొండలకడఁ దనమోహనా

కారమునుగాంచి భ్రమించి తన్ను వెంబడించిన భైరవదైత్యుని వంచింపనోయన తటాకరూపమునుదాల్చి నిజశృంగారప్రభావమును గప్పిపుచ్చి, యటనుండి తక్కుచు తాఱుచు దొంగచూపులజూచుచు, పొదలఁ దూఱి కొండలసాచ్చి యడవులడాఁగి యెట్లనో బయటఁబడి యఖండమహిమతో ధవుని దూరమునఁ బొడఁగాంచి, ఆసమయమున నచ్చో తన్ను సాలంకృతనుగాఁజేసి కన్యాప్రదాన మీావేచియున్న నిజజనకుఁడు శ్రీశంకరుఁడు తన్ను కోటివిధముల మన్ననలుసేయ, తుల్యాత్రిగౌతమవసిష్ఠభరద్వాజజమదగ్ని విశ్వామిత్రమహర్షులాశ్రితపురోహితులై తనకల్యాణమహోత్సవమునకు మంత్రములను బఠింప నుబ్బున గంతులిడుచు సప్తముఖముల గోదావరీకన్య తనలోని వజ్రములను ఇసుకవంటి బంగారుపొడిని నుపాయనములిచ్చి యతిగంభీరుని రత్నాకరుని పరిణయమయ్యె.

## "గౌతమి నేకనుగొంటిని"

భక్తశిఖామణి శ్రీ నిట్టల ప్రకాశదాసు కీర్తన

గౌతమి నే కనుగొంటిని కన్నులపండువుగాను
రాతినాతిగచేసిన సీతారాముల కరుణారసమున. గా.
ఎట్టితపముచేసితినో ఎట్టినిజముపల్కితినో
ఎట్టిభక్తవరుల పాదమట్టి ముట్టిపుట్టితినో
ఇట్టి దివ్యక్షేత్రములను ఇపుడు జూడగలిగెనాకు. గా.
రాజరాజనరేంద్రవిరాజితమయిన పురవరమున
రాజసఖులతోడగూడి రమ్యమగుచును
రాజరాజవనుచు మమరాజులంతొసన్నుతింప
రాజరత్నమయిన సీతారాముని కరుణారసమున. గా.
ఏమిచిత్రమో యిచటను ఏమిభద్రమో అచటను
స్వామినిగన్నట్టు నాకుప్రేమ బుట్టుచుండెనో
రామరామరామయనుచు రాజసమునపొందుచూను
కామితార్థములనుపొగడి కాపురముచేతనొంది. గా.
అంగజారి శిరముపయిని ఆడుచునుండేటిగంగ
పొంగితరంగముల భూమినింపుచూ అంగలింగభంగవరుల
సంగమునచెలంగి కోటిలింగములనుబొంది సారంగధరునితోడనున్న. గా.
కరుణతోడనిట్టల ప్రకాశయశకవివరేణ్య సరసిబ్రోవుమనుచు
భద్రగిరివిహారుని చరణములను స్మరణచేసి పరవశమున
మేనుమరచి గురుకటాక్షమున పెద్దాపురమువదలి పరముగోరి. గా.

# సతీత్వము: డెస్డిమోనా

విద్యాభూషణ కవిరత్న నరసింహశర్మగారు

"అనపహార్యంబు తేజోమయంబు సర్వ
గుణములకు నలంకారంబు గురుతరంబు
భామలకుఁ బతిభక్తియు పరమమైన
భూషణం బిట్టివే పెఱభూషణములు?"

—భారతము.

నిజనాథునననవరతముఁబూజించితరించిన యుత్తమసతీమణిజన్మమే ధన్యము. అట్టివారిమనుగడ యొక్క నాఁటిదిరైన కల్పాంతముదాక చిరస్థాయిగానిలిచియుండును. సతీత్వ మనంతప్రభావసమన్వితమైనది. వెయ్యేల! యముని సైతము గెలువఁజాలినది. సీత–సావిత్రి–అనసూయ–సుకన్య మొదలుగాఁగల సతీమతల్లికలు నేఁటికిని చిరంజీవులని పేరుపడియుండుట వారిసతీత్వమహిమచేత నే. "స్మరేన్నిత్యం మహాపాతక నాశనమ్". అనుటలో సందియమేమున్నది?

సతీమతల్లిక యొక్క పతిభక్తి వర్ణనాతీతము. ఆమెయానందమంతయు నాత్మనాథుని సేవాచరణమునందే మగ్నమైయుండును. ప్రణయదేవునారాధించుటయం దామెకు మరణముసంభవించినను సంతోషించును. జన్మజన్మాంతరములయందు నాతనినే పతిగాఁగోరును. ఆహా! అలనాఁడు హరిశ్చంద్రుఁడు విధిచైదమునకులోనై ధర్మనిర్వహణార్థ మాత్మసతియగు చంద్రమతిని ఖండింప సంసిద్ధుఁడుగా నాపతివ్రత యేమనిధ్యానించు చున్నదో చూడుఁడు!

"నిఖిలలోకైకవంద్య! యోనీరజాప!
నాకుఁగృపతోడ జన్మజన్మములయందు
సత్యసంశీలుఁడగు హరిశ్చంద్రనృపతిఁ
బ్రాణనాయకుగా నొసర్పంగవలయు."

—శంకరకవి హరిశ్చంద్ర.

మరణమునకైనను సహించి పతిదేవుని ప్రణయవరమునుగోరి సేవించు సతీమతల్లికలే మనకాదర్శప్రాయులు. అట్టివారిచరిత్రములతోడనే మనపౌరాణిక సాహిత్యము నిండియున్నది. లాఁతిసాహిత్యములయందు నిట్టిరచన లొకటిరెండు లేకపోలేదు. ఆంగ్లసాహిత్యమున హూణమహాకవియగు షేక్స్పియర్ 'డెస్డిమోనా' చరిత్రి మును రచించియున్నాఁడు. ఏమి! ఆసతీమణిదివ్యాదర్శము. పతిప్రేమ! ఆత్మనాథుఁ డక్రమముగా నామె గొంతుకనొక్కి చంపినను సంతసించి యాతనిప్రణయపరమున కాశించుచున్నది. ఇట్టిసతిచరిత్రమును స్వర్ణాక్షరములతో లిఖింపవలసియున్నది.

ఈమె 'వెన్నిసు'నగరమునందలి 'బ్రొబాన్షియో' అను పేరుగల శిష్టసంఘసభ్యుని (Senator) కుమార్తె. చిన్ననాఁటినుండియు వల్లారుముద్దుగా పెరిగినది. విద్యాబుద్ధులువడసినది. యౌవనవతియైనది.

అదియేనగరమున 'ఒథెల్లో' అను ప్రఖ్యాతిఁ జెందిన రాజకీయసేనాపతి యొకఁడుండెను. అతఁడప్పు డప్పుడు బ్రొబాన్షియో ఆహ్వానముపై నాతని ఇంటికరిగి నిజజీవితచరిత్రమువంతయుఁ జెప్పుచుండెడివాడు.

తానెట్లువిదేశములఁ బలుకష్టములకోర్చి శత్రువులతోఁ బోరినదియు—విజయలక్ష్మిని చేఁబట్టినదియు—నెట్లు నేకపర్యాయములు మృత్యుముఖమునుండి వెలువడినదియు- మొదలుగాఁగల పెక్కు అద్భుతవిషయముల నాతఁడు వివరించుచుండ డెస్డిమోనాకూడ తండ్రితోఁబాటు యత్యాతురతతో వినుచుండెడిది. ఆవీరపురుషునిజీవిత చరిత్రము డెస్డిమోనాకు మోహనమంత్రముగాఁబరిణమించి యామెమానసమును సంపూర్ణముగా నాకర్షించివైచి నది. ఒథెల్లోను పరిణయమాడ నిశ్చయించినది. కుట్టకుడకు తండ్రికిసైతము దెలుపక ఆవీరునితో నిలువెడలి ఆతనిని పరిణయమాడినది. ఆహా! ఎంతటి విశుద్ధప్రణయము! నాఁటిఈమె-తండ్రియభిమతమును తిరస్కరించి పృథ్వీరాజును వరియించిన సంయుక్తను—శ్రీకృష్ణుని వరించిన రుక్మిణిని—తలపించుచున్నది.

కాని యీపరిణయము బ్రొబాన్షియోకు కొంతవఱకు నచ్చనిదె. ఇదేసమయముగా ఒథెల్లో విరోధులు 'రొడారిగో' మొదలగువా రావృత్తాంతమును బ్రొబాన్షియోతో తెల్పిరి. అతఁడు న్యాయమునకై ప్రభువుతో మొఱపెట్టుకొనుచున్నాఁడు. విచారణప్రారంభమైనది. ఒథెల్లో బలవంతముగా నామెను గొనిపోయినటుల తేలెనా యాతఁడు శిక్షార్హుఁడగును. కాక ఆమెయేవరించినటులు తేలెనా సంతోషమే! ఈసందర్భమున డెస్డిమోనా న్యాయస్థానమునకుఁ గొనితేఁబడినది. బ్రొబాన్షియో యిట్లు ప్రశ్నించుచున్నాఁడు. "Do you perceive in all this noble company where you owe most your obedience-ఈశిష్టసభ్యులలో నెవరి యెడ్ల నీయెక్కువ వినయవిధేయతలు కలిగియుండవలయునో తెలియుచున్నదా?"—ఒకవంక తండ్రి. ఒకవంక ఆత్మనాథుని వరీక్ష. ఏమిసేయవలయును? ఇప్పటి ఈమె ధర్మయుక్తమైన ప్రత్యుత్తరము మఱవఁదగనిది. ఆదర్శకప్రాయమైనది. మాడుఁడు!

"My noble Father,
I do perceive here a divided duty.
To you I am bound for life and education,
My life and education both do learn me
How to respect you; you are the lord of my duty,
*I am hitherto your daughter: but here's my husband.*
And so much duty as my mother showed
To you, preferring you before her father,
*So much I challenge that I may profess*
*Due to the Moor my lord.*"

"పూజ్యుఁడవగు ఓతండ్రీ! ఇప్పటి నావిధ్యుక్తధర్మము ద్వయసమాశ్రయము. ఇన్నిదినములు నన్ను పెంచి విద్యాబుద్ధులు కరపినందులకు నీకు కృతజ్ఞురాలను. నిన్నెట్లు సత్కరింపవలయునో దెఱుంగుదును. కాని ఇంతవఱకు నీకుమార్తెను. ఇప్పుడన్ననో నాపతికి నేపత్నిని. నాతల్లి తనతండ్రికన్నను నిన్నే యెక్కువగా గౌరవించెడిది. ఆమెఁబోలి నాకును నాభర్తపట్ల అంతటి గౌరవముకలదని నొక్కివక్కాణించు చున్నాను."

ఎవ్వ రిట్టి ప్రత్యుత్తరము నివ్వఁగలరు? ఇట్టి ప్రణయమేకదా పరిశుద్ధమైనది!

ఇప్పటికి తండ్రియనుమతి లభించినది. ఒథెల్లోడెస్డిమోనాలు పరిశుద్ధప్రణయులవారిఁ దేలియాడు చున్నారు. వీరి యీమధురజీవనము—మునుపామెను వరించి తిరస్కరింపఁబడిన—రొడారిగో వంటిఖలులకు భరింపరానిదయ్యెను. వాఁడు 'ఇయాగో' తోకుతంత్రమును పన్నుచున్నాఁడు. ఇయాగోకు తుల్యుఁడు భారత వాఙ్మయమున నొక్క శకునిమాత్రము కావచ్చునేమో! ఇయాగో నిష్కారణముగా వారి పవిత్రజీవనమును పాడుచేయ సంకల్పించుచున్నాఁడు. ఒథెల్లోను సర్వగతుల నిజచాతుర్యముచేఁ—'బూఁతమెఱుంగులచే' మెప్పించి యాతని సంపూర్ణవిశ్వాసమును పొందుచున్నాడు. ఇఁక 'నమ్మినవాని గొంతుకోయుట యెంతపని?'

'క్యాషియో' అనువానితో డెస్డిమోనా సంబంధమును గలిగియున్నదని ఇయాగో ఒథెల్లోకు తెల్పుచున్నాఁడు. ఒథెల్లో సంపూర్ణముగా విశ్వసించి తుట్టతుదకు తనభార్యను చేతులారచంపినగాని శాంతిలేదని నిర్ధారణసేసెను. వీతిహోత్రున కాజ్యధారవోలె 'ఇయాగో' యింతటితో మానక తనభార్యయగు 'ఎమీలియా' కకస్మాత్తుగా దొరకిన—ఒథెల్లో డెస్డిమోనాకు ప్రణయచిహ్నముగా నొసంగియుండిన—చేతిగుడ్డను తానట్లో సంగ్రహించి క్యాషియో మందిరమునఁ బడవైచి—దానిని ఒథెల్లోకు డెస్డిమోనా దుర్ణయమునకు నిదర్శనముగాఁ జూపుచున్నాఁడు. ఇకఁ వాలస్యమేమి? కొంతకాలములోనే డెస్డిమోనా ప్రాణానిలములఁ గోల్పోవలసియున్నది.

అది ప్రశాంతమయమగు రాత్రికాలము. శయనాగారము నొక్కదివ్వెమాత్రము జ్వలించుచున్నది. పరిశుద్ధహృదయయగు ప్రణయదేవి డెస్డిమోనా రానున్నవిపత్తునెఱుంగక హాయిగా నిదురించుచున్నది. ఇట్టి తరుణమున హంతకునిరూపముతో ఒథెల్లో ప్రవేశించి పరిపరివిధంబులఁ దనలోఁదాను వితర్కించుకొని—ఆదేవిని ముద్దాడి—తుదకెటులయినను జంపుటకుద్యుక్తుఁడగుచున్నాఁడు. ఆమె కొంత మెలకువకలిగినది. నిజనాథునిఁ గాంచినది. "Will you come to bed My lord" 'నాథా! శయనించెదరా?' అని అల్లారు ముద్దుగాఁ బ్రశ్నించినది. కాని అతఁడు 'That handkerchief, ఆచేతిగుడ్డ—'అని అరచుచున్నాఁడు. తనకు తెలియదన్నను వినక—ఈర్ష్యచేఁ గన్నుఁగానక—ప్రార్థనకు సైతము వ్యవధినివ్వక—ఆయుత్తమసతీమణి కుత్తుకను నొక్కుచున్నాఁడు. అకటా! లేఖిని సైతము సంచలించుచున్నది. ఇఁక నొండురెండు నిమిషములలో నాసతీమణి మరణించితీరును. ఈసందర్భమున ఇయాగోపత్నియగు ఎమీలియా ప్రవేశించుచున్నది. డెస్డిమోనా రుద్ధకంఠధ్వని నాలకించుచున్నది. 'ఏమి! ఈఅక్రమమైనహత్య. దేవీ! పల్కుము—'అనుచున్నది. ఇప్పుడు డెస్డిమోనా యేమనుచున్నదో పాఠకమహాశయా! ఆలకింపుము ఇవియే కడపటివాక్యములు. "నేను పరిశుద్ధమైనమరణము ననుభవించుచున్నాను." మఱల ఎమీలియా 'ఎవరీకార్యమొనరించినది?' యని ప్రశ్నించుచున్నది.

"Nobody; I myself, Farewell;
*Commend me to my kind lord; o, farewell"*

"ఎవరునుకాదు. నేనే. నేసెలవుపుచ్చుకొనెదను. కరుణామయుఁడగు నాభర్తకు నన్ను మఱువవలదని తెలుపుము. ఇంతియే. సెలవుపుచ్చుకొనెదను."—ఆహా! ఇంకను కరుణామయుఁడని యనుచున్నదే. గొంతుకనొక్కి చంపినంతటి పాషండుఁడైనను—ఆసతికి నిజభర్త కరుణామయుఁడేగదా! చూలింతయగు తన్ను కావలడించినను సీతామాత శ్రీరామచంద్రుని కరుణామయుఁడనియేకదా నుడివినది. సతీమణియగు నదంతకంటె వేఱేమియనునుడువదు. ఆమె కదియే బ్రహ్మానందము. ఇట్టి యీడెస్డిమోనా ఉత్తమభారత నారీమణులకు సైతము నీతిపాఠము నేర్పఁగలదియై యున్నది. ఆమె సతీత్వమే సతీత్వము! ఆమె పాతివ్రత్యమే పాతివ్రత్యము! మనమామె గుణముల నేమని అభినుతింపఁగలము? ఎమీలియాతోఁబాటు మనమును "O! the more Angel she" "ఆమె దివ్యాంగనయే" అనిన చాలును. నాస్తి సంశయము.

"తల్లీ! నీవు మహాపతివ్రతవు...నీసౌశీల్య మిల్లాండ్రకెల్ల న్మేల్బంతి"

—ఉత్తరరామాయణము.

ఇట్టి ఉత్తమసతీమణిచరిత్ర మాంగ్లసాహిత్యమునం దొక్క అసమానరత్నమనుటకు సందియములేదు. ఇట్టివి యింకను ఎన్నియేని యాసాహిత్యమునఁ గానవచ్చును. కాన మాసోదరీమణు లెల్లరు సీత, సావిత్రి మొదలగువారిచరిత్రములఁబోలి యిట్టివారి చరిత్రలనుకూడ చదువుదురని కోరుచున్నాను.

# చాటింపు

## శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారు

పూర్వమొక రాజు తనపట్టణములో రాత్రులందు గస్తుతిరుగుటకు నొకతలారిని నియమించెను. ఆతలారి కేదో కార్యాంతరనిర్బంధముండినందున యూరిప్రక్క పొలములో నిద్రపోవుచున్న జడభరతుని యెవరో యనుకొని తీసుకువచ్చి తనకార్యమున కాతని నియమించగా నతడు:-

౧-వ జామున

ఆశచే బద్ధమయిపోయె నఖిలజగము
వింతగా కర్మలన్ బహుచింతలొదవు
తరుగుదినము-నాయుక్షీణమెరుగరిహహా!!
కాన జాగ్రత్త! జాగ్రత్త!! కాచుకొనుడు.

౨-వ జామున

క్షణముచిత్తమ్ము విత్తమ్ము క్షణమెసుమ్ము
క్షణము జీవితమ్మెల్లను క్షణము నటన
ఎరుక తెలియుడు యమునకు కరుణలేదు
కాన జాగ్రత్త! జాగ్రత్త!! కాచుకొనుడు.

3-వజామున

లేరు తల్లిదండ్రులు లేదు-లేదు-బంధు
వర్గము సహోదరులు లేరు వసతిలేదు
తలప నియ్యెడ సుంతైన ధనములేదు
కాన జాగ్రత్త! జాగ్రత్త!! కాచుకొనుడు.

౪-వ జామున

జ్ఞానరత్నమ్ము హరియింపమేనియందు
కామక్రోధలోభతస్కరులు సతము
లేచియుందురు మూలల వివిధగతుల
కాన జాగ్రత్త! జాగ్రత్త!! కాచుకొనుడు.

# భోజనవిధివిజ్ఞానము

కోడాలి లక్ష్మీనారాయణ గారు

శరీరమున కాకలిదప్పికలు సర్వస్వాభావికములు; ప్రాణధారులకందఱకి నన్నము జీవనము. అన్నము లేక యెవరును జీవింపఁజాలరు. అందఱును నిత్యమును భుజించుచున్నారు; కాని యాయుర్వేదశాస్త్రమందు భోజనవిషయమై యేయే గుణదోషములు వర్ణింపఁబడియున్నవో, వానినిగూర్చి బహుకొలఁదిజనులుమాత్రము తెలిసికొనుచున్నారు. దీని కిదియే దారుణమైయున్నది; ఏలనన వర్తమానకాలమందు మానవసమాజములో రోగము లధికముగ వ్యాప్తినొందియున్నవి. భోజనసంబంధముగుజ్ఞానము ప్రతిపురుషునికిని, స్త్రీకినుండుట యుచితమని మాయభిప్రాయమైయున్నది; ఎందుచేతననఁగా శాస్త్రసంబంధముగ గుణదోషములను గుర్తెఱిఁగి చేసినభోజన మమృతతుల్యమైయుండును; దీనికి వ్యతిరేకమైనచో నిదివిషమై ప్రాణములనుబోఁగొట్టుచున్నది. అజీర్ణము, విషూచి మున్నగు ననేకవిధములైన రోగములు భోజనదోషములవలననే యుత్పన్నములగుచున్నవి. బాలబాలికలకుఁ బాఠశాలలయందుఁ బాఠములను నేర్పుటతోఁబాటు భోజనవిజ్ఞానమునుగూడ నేర్పుట ప్రబలావశ్యకతగలిగియున్నది. పురుషసమాజమునకంటె నారీసమాజమునం దీజ్ఞానముయొక్క యావశ్యకత యధికమైయున్నది; ఏలనన భోజనముయొక్క పనియంతయును స్త్రీల చేతులయందేయున్నది. వారియొక్క యజ్ఞానముచేత నప్పుడప్పుడు గొప్పదోషములుకలుగుచున్నవి. ఇదియునుంగాక నారీరత్నములే సృష్టికి ఉత్పత్తి కారిణులగుచున్నారు; శిశుపోషణమంతయు వారి చేతులయందే యున్నది. ప్రాచీనశాస్త్రకారులయొక్క యుద్దేశ్యము భోజనమే మనుష్యజీవనమును నిర్మాణముచేయు మహాసాధనమని. దీనికి కారణమేమనఁగా నే మనుష్యుఁడెట్లు భుజించుచున్నాఁడో యతనియొక్క జీవనము, విచారము, నాచరణము నటులనే యగుచున్నవి; ఉదాహరణమున కావశ్యకత యవసరములేదు. ప్రపంచమునందు భిన్నభిన్న దేశములయొక్క, భిన్నభిన్న జాతులయొక్క దశలయొక్క జీవనములపైనను దృష్టిని బఱపినచో మనుష్యునికి భోజనము, దేవతల నుండి రాక్షసులను, రాక్షసులనుండి దేవతలను చేయగల్గియుండిరని స్పష్టముగా తెలియవచ్చుచున్నది. ఏభోజనము ప్రాణధారికి జీవమైయున్నదో, దేనిలోపల మనుష్యనిర్మాణమునకును జీవనుంచుటకు శక్తి యున్నదో, దానియొక్క జ్ఞాన మెంతయావశ్యకమో యెంతయుపయోగకరమో యోచింపుడు!

ఈయుద్దేశ్యము నెదుటనుంచుకొని పాఠకబృందమునకు సంక్షేపముగా గొంచెము వ్రాయుటకు సాహసించుచున్నాను.

## భోజనవిషయమునందు జ్ఞాపకముంచుకొనవలసిన విషయములు

ఏమనుష్యునికైన నెప్పుడైన, భోజనముచేయుట కిచ్ఛగలిగినచో దాని నెప్పుడు నణచుట యుచితముకాదు. ఏలనన నాకలి ప్రకృతిసంబంధమైన గతియైయున్నది. దీనిని నిరోధించుటచే శరీరమందలి సర్వాంగములును కృశించును; అరుచి, భ్రమ, మాంద్యము, నేత్రములందు దుర్బలత మున్నగురోగములు గల్గుచున్నవి. ఆకలిదప్పికలకు ఘనమైన సంబంధముకలదు. ఈకారణమువలన దప్పిక నాపుటచేగూడ క్రింద వ్రాయబోవు రోగము లుత్పన్నములగుచున్నవి. కంఠము, ముఖముఎండిపోవును. చెవులయందు ధ్వని వినఁబడదు. హృదయకుహరమునందుపోటును, మూర్ఛయు, మోహమును, ప్రాణనాశనముగూడఁ గల్గుచుండును. దీనికి కారణమేమన, భోజనము కొంతకాలమువఱకుఁ జూడనిచో మనుష్యుఁడు జీవింపగలుగుచున్నాఁడు; కాని నీరు దొరకనిచో ముఖము వాడిపోయి మూర్ఛగలుగును. మూర్ఛనుండి ప్రాణనాశము గలుగు

చున్నది. ఇందుచే బుద్ధిమంతు లెవ్వరును పైనజెప్పఁబడిన యుద్రేకముల నెన్నఁడు నిరోధింపరాదు. ఈవిష యము బాలకులకుకూడ వారి యారోగ్యము చెడకుండుటకై చెప్పవలయును.

ఒకమనుష్యుని కాకలియైనపు డతఁడాహారము గ్రహింపనిచో నతని జఠరాగ్ని మందగించుచున్నది. అప్పుడప్పుడు భోజన మేమియు లభింపనపు డీయగ్ని ప్రభావమధికమై శరీరములోని వాతపిత్తకఫదోషముల నదిజ్వలించుచున్నది. ఎప్పుడాదోషములు జ్వలింపఁబడునో నప్పుడచట ప్రబలమైయున్న జఠరాగ్ని ధాతువులు (రసము, రక్తము, మాంసము, క్రొవ్వు, ఎముక, మజ్జ, శుక్రములేక ఆర్తవము) భస్మమైపోవుచున్నవి. ఆధాతువులు దహింపఁబడుటతోడనే వచ్చట మఱలనొక ప్రబలాగ్ని గలిగి మనుష్యప్రాణనాశమూల మగుచున్నది.

## దేశకాలానుసరణీయమగుభోజనము

భోజనము మానవజీవన కాధారమును, పోషకమునైయున్నది. అదిలేనిచో నెవరును జీవింపఁజాలరు. ప్రతిమనుష్యుఁడును మధ్యాహ్నమును, సాయంకాలమును రెండుమారులు మాత్రమే భుజింపవలెనని శాస్త్ర విధానమైయున్నది. ప్రాతఃకాలమునందే భుజించుటచేత రసనుత్పత్తియగుచున్నది. అందుచే నారోగ్యమునకు హానిగలుగుచున్నది. మధ్యాహ్నమనగా 11 గంటలనుండి 1 గంటవఱకు పిత్తముత్పత్తియగు కాలమైయున్నది. ఆసమయమున భుజించినచో బాగుగా జీర్ణమగును. ఈవేళతప్పి భుజించినచో జీర్ణముసరిగా కాఁజాలదు. ఇక్కారణముచే జీర్ణశక్తి చెడిపోవుచున్నది. అందుచే ననేకరోగములును, దుర్బలతయుఁ గలుగుచున్నవి. సాయంకాలపుభోజన మారుగంటలు మొదలు తొమ్మిదిగంటలవఱకు చేయనగును. రాత్రి చాలప్రొద్దుపోయి భుజించి నిద్రించినచో భోజనము సరిగా జీర్ణముకాదు. ఆరాత్రియందు నిద్రలో దుస్స్వప్నములువచ్చును. క్రమముగా జీర్ణశక్తి క్షీణించిపోవును. కాన రెండుమారులుచేయుభోజన మాయానిర్ణీతకాలములందే చేయవలయును. ఒక్కొక్క భోజనమున కారేడుగంటల యంతరముండవలయును.

రసకోపమును, మలమునుఎపుడు సిద్ధమైపోవునో యప్పుడు మనుష్యునికాకలి యగుచున్నది. ఇవి సిద్ధమైనవనుట కిది చిహ్నమైయున్నది. ఎప్పుడు త్రేపులువచ్చునో యప్పుడు శరీరమునందుత్సాహము కలుఁగుచున్నది. మలవిసర్జనమైనపుడు శరీరము తేలిక యగుచున్నది. ఆకలిదప్పికలైనపుడు భోజనము జీర్ణించిన దనియు, భుజించుటకు మఱల నావశ్యకత కలిగినదనియు, గ్రహింపవలెను. ఎవరికేని జ్వరమువచ్చి విడిచి పోయినచో నతనికి భోజనము చేయించినచో సాయంకాలమందే చేయింపవలెను అప్పుడు కఫముయొక్క యుద్రేకము తగ్గుచుండును. వేడి హెచ్చుచుండును. ఉష్ణోద్రేకసమయమునందు జఠరాగ్ని జాగ్రతమై పోవును. ఆభోజనమును జీర్ణింపఁజేయును. భుజించుట కేకాంతమును, పరిశుద్ధమునైన స్థల మవసరము. శుద్ధమైనస్థలములేనపుడును మలినపదార్థములను జూచినను అప్పుడప్పుడు మనోవ్యధకలిగి వమనములు గలుగుచుండును. ఏకాంతముగా లేనిచో మనసుచలించి భోజనముయొక్క రుచిని గ్రహింపఁజాలరు. నోటిలోపల శ్వాసమునకును, భోజనమునకును ప్రత్యేకముగా రెండుమార్గములున్నవి. శ్వాసమార్గముయొక్క రంధ్రము మొదటను, ఆహారనాళము వెనుకవైపున శ్వాసమార్గమునకు పైగానున్నది. ఏదేనివస్తువును తినినచో నది యాహారనాళమునందుఁబడుచున్నది. ఈకారణముచే మనుష్యులుగూర్చుండి సంభాషించుచు భుజించినచోఁ దిన్న యాహారపదార్థము శ్వాసనాళికయందుఁబడినచో ననేకరోగములు, నప్పుడప్పుడు ప్రాణముపోవుటయుఁ గూడ సంభవించుచుండును. భోజనసమయమునందు సంభాషించినను లేక నవ్వినను అప్పుడపుడు పొలమారఁ దగ్గువచ్చి దుర్భరస్థితి కలుగుచున్నవి. దీనుల, హీనుల, మలినుల, క్షుధాపీడితుల, పాపాత్ముల, పాషండుల,

వ్యాధిపీడితులయొక్క, కోడి, కుక్క మొదలగువానియొక్క దృష్టిని భోజనముపైఁబడనీయఁగూడదు. జననీ జనకులు, మిత్రుఁడు, వైద్యుఁడు, వంటవాఁడు, హంస, మయూరము, సారసము, చకోరాదిపక్షులుచూచిన భోజనము తినుట లాభదాయకమైయున్నది.

## భోజనపాత్రలయొక్క గుణములు

అపక్వమైన యాహారమును దీసికొని యనేకవిధములైన పాత్రలయందుంచి వానిని వండుచున్నారు. దానిని చిన్న, చిన్నపాత్రలయందు వడ్డించి భుజించుచున్నారు. రాజు మొదలు దరిద్రునివఱకు స్వర్ణపాత్రల నుండి యినుపకము పాత్రలలో వండితినుట యాచారమైయున్నది. ఏయేవిధములైన పాత్రలయందు భుజించుట హానికరమో, లాభదాయకమో క్రిందవ్రాయుచున్నాము.

(1) బంగారుపాత్రయందు భుజించుటచేత సర్వదోషములును నాశనమగుచున్నవి. బంగారుపాత్ర యన్నిటికంటెను సర్వోత్కృష్టమైనదియు, నారోగ్యమునకు లాభదాయకమును, సముచితమునుగాఁబరిగణింపఁ బడుచున్నది.

(2) వెండిపాత్రయందుంచి భుజించుటచే నేత్రములకు లాభముకలుగుచున్నది. పిత్తరోగములందు కూడ లాభముకలుఁగుచున్నది. కాని వాయుసంబంధమైన, కఫసంబంధమైన వ్యాధులలో హానికరమగుచున్నది. ఏలనన వెండి చల్లనిదగుటచే కఫము, వాయువు వృద్ధియగుచున్నవి.

(3) కంచుపాత్రయందుంచి భుజించుటచే బుద్ధి తీక్ష్ణతగలుగుచున్నది. భోజనముయొక్క రుచి యధిక మగుచున్నది. రక్తపిత్తజనకరోగములు నిర్మూలములగుచున్నవి. మనస్సుప్రసన్నమగుచున్నది.

(4) ఇత్తడిపాత్రయందుంచి భుజించినచో గాలి వృద్ధియగుచున్నది. ఏలనన ఇది ధాతురూక్షము, నుష్ణమునైయున్నది. కాని క్రిమిరోగములు, కఫసంబంధమగు రోగములకు నిదిలాభదాయకమైయున్నది.

(5) లోహపు ఉక్కుపాత్రలయందుంచి భుజించుటచే రక్తవృద్ధియగుచున్నది. హృదయకోశమునకు బలముగల్గి సర్వవిధములుగా శుద్ధియగుచున్నది. ఏలనన రక్తమే మనుష్యునియొక్క జీవనమైయున్నది. వాపు, పాండువు, కామలా (పిత్తవికారముచేత కలుగురోగము) మున్నగు వ్యాధులందు లాభముకలుగును. బలము వృద్ధియగును.

(6) మట్టి రాతిపాత్రలయందు భుజించుటచే శీతోష్ణగుణములను గలుగవు. వీనిని సామాన్యముగా వాడుచుందురు.

(7) కొయ్యపాత్రలయందుంచి భుజించుటచే భోజనము మీఁదిరుచి యధికమగుచున్నది. కాని కఫరోగ ములను వృద్ధిచేయుచున్నది.

(8) ఆకులతోఁజేయఁబడిన దొన్నెలయందు భుజించినచో రుచియధికమగుచున్నది. అగ్నిదీప్తియగు చున్నది. విషనాశమగుచున్నది.

(9) త్రాగుజలమును బంగారు, వెండిపాత్రలయందుంచినచో మిగులనుత్తమము. కాని ఇవి సర్వ సాధారణముగా నందఱికి లభించుటయసంభవము. ఈకారణముచే నీటిని రాగిపాత్రయందుంచిన మంచిది. ఇందులో నుంచుటచే నీరు పరిశుద్ధమగుచున్నది. ఇదికూడ లభించనిచో మట్టిపాత్రయందు నీటిని పోసియుం చుట మంచిది.

(10) వజ్రవైడూర్యమణులచేఁ జేయఁబడిన పాత్రలుకూడ సుందరమును, చల్లదనమునిచ్చునవియై యున్నవి. వానియందు భుజించుటకూడ లాభదాయకమును, స్వాస్థ్యకారియునైయున్నది.

## భోజనక్రమము

భోజనము వడ్డించుటతోడనే ప్రసన్నతాపూర్వకముగా సర్వవిధములైన విచారములనువదలి పవిత్రతతో క్రిందవ్రాయఁబడిన విధముగా భుజించవలయును. భోజనప్రారంభమునందల్లమును, సైంధవలవణమును, సదాభుజించుట మందులకు నుచితమైనది. వీనిని సేవించుటచే నగ్నిదీప్తిగలుగును. జిహ్వయందలి, కంఠమునందలి మలినముపోయి యాహారనాళికశుద్ధమగుచున్నది.

అన్నము మనుష్యులకు బ్రహ్మసమానముగా నుత్పన్నమగుచున్నది. విష్ణుసమానముగాఁ బోషించుచున్నది. ఆహారము చెడినను, నధికముగాభుజించినను, యనుచితపద్ధతులలోఁ గైకొన్నను మహాదేవునివలె సంహారము చేయుచున్నది. ఏమనుష్యుఁడు ఈవిషయమును మనస్సునందుంచుకొని హితకరము, నుచితము నగు భోజనము సకాలమునందొకవిధముగా మితముతప్పక భుజించునో భోజనసంబంధములగు వ్యాధులతనికిఁ గలుగవు. భుజించునపుడు మనముభుజించు నాహారము తృప్తమును, పుష్టిదాయకమును, అమృతసమానమునగు గుణముల నిచ్చునదనియు; వాంఛనేయునివలె బలమునిచ్చునదనియు మనస్సున దలంచవలయును. ఇట్లు తలపోసి యన్నిటికంటె ముందుగా మధురరససేవనమున కారంభించుము. మధ్యను ఉప్పును, పులుపు, రసములను తినుము. వానిపిమ్మట కారమును, వగరును గలిగినపదార్థములను భుజించుము. భోజనముతోఁబాటు నారింజ, కమలను, కొబ్బరి మున్నగు కాయలను భుజించవలసివచ్చినచో నన్నము గ్రహించుటకుముందే గైకొనుము. కాని యరటి, దోస మున్నగువానిని భోజనానంతరము గ్రహించుము. ఇవిగాక క్రిందవ్రాయఁబడిన పదార్థములను, ఫలములను ప్రాతఃకాలమున నేమియుఁదినకుండ తినవలెను. ఫాలసాఫలము, రేగుపండు, అత్తిపండు, చింతపండు, తాటిపండు, నారింజ, నారికేళము, మామిడికాయ, పండినయరటి, ఉసిరికకాయలు.

ఆకలిమిక్కుటముగానుండి భోజనములభించినచో మితముప్పతో చేయఁబడిన గురుత్వమగుభోజనమును, మితముగుండలను మిగులకొద్దిగాఁదినికొనుము. కాని భోజనానంతర మీవస్తువులనెన్నడు గైకొనవలదు. భుజించునపు డీవిషయముపై నత్యంతధ్యానముంచుము. తినుచున్న పదార్థము గట్టిగనున్నచో దానిని నేతితో కలిపి మొదట భుజింపుము. మధ్యను మృదుకోమలమగు వస్తువులను గ్రహించుము. చిట్టచివరకు లఘుపదార్థములను గైకొనుము. ఇవ్విధముగా నియమపూర్వకముగా భుజించుటచే శరీరమున కెవ్విధమైన హానియు గలుగదు. బలవృద్ధియగును. ఆరోగ్యము బాగుగానుండును. సుస్వాదమగు భోజనమునే గ్రహించవలయునని జ్ఞప్తియుంచుకొనుము. రుచిగలభోజనమును గైకొనుటచే భుజించుటకు మిక్కుటమగు నిచ్ఛగలుగుచుండును. రుచిగలభోజనము శీఘ్రముగా జీర్ణమైపోవుచున్నది. అందుచే మనమున కాహ్లాదముగలుగుచున్నది. జిహ్వకు సుఖముగలుగుచున్నది. బలము, బుద్ధి, ఉత్సాహమును వృద్ధియగుచున్నవి. రుచికరభోజనము చేయుటచే కడుపునందు భారముపోవుచున్నది. మిగుల వేడివేడి భోజనము చేయుట హానికరము. ఇందుచే బలనాశముగలుగుచున్నది. మిగులచల్లారియుండి గట్టిదైనభోజనము జీర్ణశక్తిని క్షీణింపఁజేయును. అది శరీరములో జీర్ణము కాదు. ఏభోజనము హల్వావలె ముద్దయైపోవునో దానిని జూచుటకు అసహ్యము వేయును. అట్టిదేనదుకూడ జీర్ణముకాదు. మాడిపోయిన భోజనము చేయుటచే నష్టముకలుగుచున్నది. అపక్వమగుభోజనము జీర్ణముకాక పోవుటచే నజీర్ణవ్యాధిని కలిగించును. కనుక సరిగా బాగుగా వండినట్టియు, సాధారణమగు వేడిని గలిగినట్టియు, పరిశుభ్రమైనట్టియు, షడ్రసోపేతమగు భోజనము కాలానుసరణముగాఁ గైకొనవలెను.

మధురమగు భోజనమునుచేయుటచే శరీరమందు రక్తవృద్ధియగును. పులుపురసముచేత మజ్జవృద్ధియగును. లవణసంబంధమైన రసములచేత నెముకలువృద్ధియగును. కారము సంబంధమైనరసముచే క్రొవ్వువృద్ధియగును. చేదు సంబంధమైనరసముచే మాంసవృద్ధియగును. ఒగరు సంబంధమైనరసముచేత శరీరమునందలి రసములు వృద్ధి

యగును. సర్వవిధములైన యన్నభోజనములచే వీర్యవృద్ధియగుచున్నది. ఇవ్విధముగా షడ్రసోపేతమగుభోజనమును జేయుటచే సప్తధాతువులు వృద్ధిబొంది మనుష్యునికి జీవము గలిగించుచుఁబోషించుచుండును.

భోజనమునకుఁ గూర్చున్నచో నతిశీఘ్రముగా భుజించుటతగదు. ఇందుచే ననేకములైన యనర్థకములు గలుగుచున్నవి. తినుభోజన మాత్రగ్గిపోవుచున్నది. రుచియైనా బాగుగా తెలియదు. నోటిలోపల లాలాజలములల్పకాలములో సరిగా నూరుటలేదు. శీఘ్రంభోజనము చేయుటచే నన్నము బాగుగా నమలఁబడుటలేదు. అందుచే నాభోజనము జీర్ణకోశములోనికిఁ బోయినచో దానిని పిండిచేయుటలో మిగుల పరిశ్రమచేయవలసి వచ్చుచున్నది. అందుచే జీర్ణకోశము క్రమక్రమముగా దుర్బలమైపోవును. మనుష్యునియొక్క జీర్ణశక్తియును నానాటికి క్షీణించిపోవును. చాలసేపుకూర్చుండి భుజించుటకూడ తగనిపనియే. పళ్ళెములోనుంచిన భోజనము చాలకాలముదనుకనుండుటచే బైటగాలిచేత చల్లారిపోవుచున్నది. అందుచే నది నాలస్యముగా జీర్ణమగుచున్నది. అజీర్ణమున్నను వ్యాధులకుత్పత్తికారణమగుచున్నది. అందుచే బుద్ధిమంతులగు మనుష్యులు మిగుల కాలవిలంబనముగాకుండగను మిగుల వేగిరపడకుండగను సాధారణమగు కాలమునందే భుజించుట యుచితమగు పద్ధతి. ఎవరికి మందాగ్నియను రోగమున్నదో నతడు నిత్యమును కొలఁదిమాత్రముగా భుజించవలయును. అధికతమమగు భోజనమును గైకొన్నచో నజీర్ణవ్యాధికలుగుట కవకాశమేర్పడును. గురుత్వము గలిగించు పదార్థములు రెండువిధములు. మినుములు, పెరుగు మొదలగునవి స్వభావముచేతనే గురుత్వము గలిగించుచున్నవి. ఇవి మొదటిరకము. కొన్ని పదార్థములు సహజముగా లఘువుగా నేయున్నవి. కాని నేయి, పంచదారమున్నగు వానితో మిళితమగుటచేత గురుత్వములగుచున్నవి. ఇవి రెండవరకము. పెసలు తేలికయైనవే కాని వానిపప్పులయందు నేయి, పంచదారయునుకలిపి హల్వాచేసినచో గురుత్వమైపోవును. మినుములు మున్నగు పుష్టికారకమగు పదార్థముల నాకలియైనప్పుడధికముగా భుజించినచో మిగుల హానికారకములగుచున్నవి. కాని పెసలుమున్నగు తేలికపదార్థములు నితరవస్తువులతో కలుపకపోయినను నధికముగా భుజించినచో నవికూడ హానికారకములేయగుచున్నవి.

ఆహారమారువిధములుగానున్నది. చోష్యము, పేయము (పానీయము), లేహ్యము, భోజ్యము, భక్ష్యము, చర్వ్యము (భక్షణము). వీనిలోఁ గ్రమముగా నొకటి రెండవదానికంటె గురుత్వము కలిగించునవై యున్నవి. ఏపదార్థములు స్వభావముచేత గురుత్వములైయున్నవో లేక నేయి, పంచదారమున్నగు వానిచే సంస్కారమును బొంది గురుత్వమును బొందుచున్నవో వానిని నర్ధాకలిని మిగిల్చిమాత్రమే భుజించవలయును. ఏపదార్థములు ప్రకృతిచే తేలికయైయున్నవో వానినిగూడ పొట్టనిండుగా తినుట హానికారకమేయగును. పాతికవంతుగాని, అరవవంతుగాని యాకలిని మిగిల్చియే వానినికూడ భుజించుట యుచితమగుకార్యము. తేలికయైన పదార్థములనుగాని, గురుత్వమును గలిగించు పదార్థములనుగాని యధికముగా గ్రహించుట హానికారకము. సన్నవస్తువులతోబాటు తేలికైన, యెండినపదార్థములగు తిన్నచో నవి హానికారకములుగావు. ఎండిన, సన్నని వస్తువుల మిశ్రణముచేత నతిశీఘ్రముగా జీర్ణమగును. మినుములతోఁజేయబడిన గారెలు, పకోడీలున్నగునవి నధికముగా సేవించుటచే దాహజనకరోగముత్పన్నమగును. ఎండిపోయిన గట్టివస్తువుల నధికముగా సేవించుటచే మలబద్ధకము కలుగుచున్నది. ఒకభోజనముతోఁబాటు విపరీతగుణములనిచ్చు మరియొకభోజనమును మిశ్రమముచేసి తినుటచే జఠరాగ్నిసంబంధమైనవ్యాధు (మందాగ్ని, తీక్ష్ణాగ్ని, భస్మకాగ్ని, విషమాగ్ని) లుత్పన్నములగుచున్నవి.

ఆషాఢమాసమునందు పేలపిండిపండుగవచ్చుచున్నది. అప్పుడు జనులు పేలపిండికొట్టుకొని తినుచుందురు. అది గ్రీష్మఋతువగుటచేత శరీరము తాపముగల్గి యుష్ణాధిక్యమునఁబొందుచుండును. పేలపిండి వల్ల

దనమునిచ్చు వస్తువు. జలమును, నేయియుకలిపి తినుచుందురు. అందుచే వారికి చల్లదనము కలుగుచుండును. దీనినికూడ నధికముగాభుజించుట హానికారకము.

(4) భోజనసమయమునకాక మిగిలినవేళలయందేదేని కొలఁదిగాగాని గొప్పగాగాని భుజించినచో జఠరాగ్ని విషమైపోవును. ఇందుచే శరీరమునందు భారమును, కడుపులోనిండుదనమును మందమును, గుడగుడమనురోగము ఉత్పన్నములై స్వాస్థ్యము చెడును.

(2) ఆకలియధికముగానుండి సంకోచవశముగాగాని, యేదియేనికారణాంతరముచేత గాని యల్పభోజనముచేసినచో శరీరమందుత్పన్నమగు యగ్ని యల్పభోజనముతోఁ దృప్తిఁజెందఁజాలకపోవును. అందుచే బలనాశమై శరీరము దుర్బలమైపోవును.

(3) కడుపునిండ భుజించుచున్నచో నదిబాగుగా జీర్ణముగానిచో నజీర్ణమున్నగు వ్యాధులుగలుగును.

(4) బాగుగా నాకలియైనచో నప్పుడు భుజించనిచో లోపలగాలి వృద్ధిబొంది యగ్నిని నష్టముజేయును. అప్పుడు మరల భుజించినచో నాకలిగలుగదు. కాని యాభోజనము సరిగా జీర్ణముకాదు.

(5) ఆకలియైనపుడు అజీర్ణవ్యాధియున్నగునవి గలుగకుండునట్లుగా కొంచెముతక్కువగానే భుజించుము. గర్భకోశమును నాల్గుభాగములుగా విభజించవచ్చును. రెండుభాగములందు భోజనము, ఒకభాగమునందునీరు, ఒకభాగమునందుగాలి యుండును. భోజనము నోటిలో మొదలుబెట్టియే జీర్ణమైపోవుచుండును.

భుజించునపుడు ప్రథమమున రసమును తినుము. వానికి తర్వాత కొంచెముజలమును త్రాగుము. మరల రెండవరసమును గ్రహించుము. భుజించునపుడిట్టినియమముల ననుసరించుచుండుము. ఈప్రకార మనుసరించుచుండుటచే నగ్నిదీప్తిగలుగును. భోజనముయొక్కరుచి బాగుగాఁదెలియఁగలదు. భోజనముతోగూడ నధిక జలమును గ్రహించుట హానికారకము. ఇందుచే గొంచెము కొంచెము జలమును పానముజేయవలెను. ఒక మారుగాక మాటిమాటికిని స్వల్పముగా పుచ్చుకొనుచుండవలయును.

భోజనముచేయుటకంటె ముందుగాజలమును గ్రహించుటచే దుర్బలతగలుగును. మందాగ్నిరోగము గలుగును. భుజించినతర్వాత జలమును గ్రహించుటచే కఫవృద్ధియగుటయును, శరీరము స్థూలమైపోవుటయుఁ గలుగును. భుజించుసమయములమధ్య నీరుత్రాగుటచే నగ్ని వృద్ధిబొందును. శరీరము ప్రకృతిసమానముగా నుండును, బలవృద్ధికూడయగుచుండును. ఆకలియైనపుడు జలమును గ్రహించుట హానికరము. కడుపునిండు నని మనము భావించుటయేగాని దీనివలన జలోదరమనురోగము గలుగును. ఇటులనే దాహమైన సమయము నందు భుజించినచో గుల్మరోగముగలుగును. కనుక నిదియును హానికరమే.

భుజించినపిమ్మట నాచమనము (శుద్ధికొఱకు నోటిలో నీరుపోసికొనుట) జేసికొనుము. నోటిలో నన్నపు మెతుకులతికియున్నచో వానిని శుభ్రముగా తీసివేయుము. అప్పుడపుడు దంతములయందుఁగొన్ని మలినపదార్థములు మిగిలియుండుట సంభవించును. వానిని సరిగాశుద్ధిచేయకపోయినచో నవి దంతమూలములందిరుకుకొని పోయి కొలఁదికాలములో మనమిపుడుజూచు పలువిధములైన దంతరోగములు గలుగుచుండును. ఆరోగ్య శాస్త్రము తెలియకపోవుటచే జను లీమాటలపై ధ్యానముంచుటలేదు. తామే యిట్లజాగరూకతగలవారై యుండగా దమబాలకులకట్టిశిక్ష నివ్వగలరు? ఇక్కారణముచేతనే ప్రస్తుతకాలమునందు దంతరోగములు విరివిగావ్యాపించుచున్నవి. దంతములు శరీరములో ముఖ్యమైనభాగములలో నొకటి. ఇందుచే మనము వీని రక్షణముపై బూర్ణధ్యానముంచవలెను. ఆచమనము తరువాత రెండుచేతుల నొకదానితో నొకటి పరిశుభ్రముగాఁగడుగుకొని రెండుకండ్లపై ననేకమార్లు తుడువవలయును. ఇటులచేయుటచే నేత్రములకుఁ జలువదన మేర్పడును. నేత్రసంబంధములగు తిమిర మున్నగురోగములు నాశమొందును.

ఇంతయేల! భుజించినతర్వాత నేదైన నధికముగు పరిశ్రమములనగా పరుగెత్తిచేయుపని, వేగముగా నడచుట, చింతించుట మున్నగునవి చేయరాదు. ఇందుచే శరీరమునకు విశ్రాంతిలభించదు. విశ్రాంతిలభించక పోవుటచే భోజనముసరిగా జీర్ణముకాదు. అజీర్ణాదిరోగములు గలుగును. ఇందుచే భోజనానంతరము బాగుగా నొకటి రెండుగంటలు పండుకొనుము. భోజనమునకు పూర్వముగాని, భోజనానంతరముగాని తత్క్షణమే పాలు ద్రాగుట యతిహానికరము. కారణమేమనఁగా నెంతవఱకు భోజనము జీర్ణముకాదో యంతవఱకు పాలనెన్నడును ద్రాగరాదు. ఏలనన మనముతిను భోజనమునందనేక ప్రకారములైన తీపి, పులుపు, ఒగరు, కారమున్నగు రుచులుగల పదార్థములను తినుటచే వెంటనే పాలుత్రాగుటవలన నవియు నివియు మిళితమై విరుద్ధభోజనమగును. అప్పుడప్పుడాభోజనము లోపల విషప్రభావముగలిగినది కూడనైపోవచ్చును. అజీర్ణాదిరోగములు కూడ గలుగవచ్చును.

భోజనానంతరము తాంబూలమువేసికొను యాచారముమంచిది.

## తాంబూలసేవనవిధి

శరీరములోపల వాయుపిత్తకఫదోషములు భోజనముతో నివ్విధముగా సంబంధముగలిగియున్నవి. భుజించుటవేళనే శరీరమునందు కఫవృద్ధియగును. అన్నము జీర్ణమగుసమయమున పిత్తవృద్ధియగును. భోజనము జీర్ణమైపోయిన తర్వాత వాయువృద్ధియగును. భుజించినతర్వాత మనస్సున కాహ్లాదముకలుగును. భోజనము సుఖముగాజీర్ణమగుటకు తమలపాకులు, ఏలకులు, జాపత్రి, లవంగములు, పోకచెక్క మున్నగునవి వేసికొనుట యాచారమైయున్నది.

తమలపాకులగుణములు:—ఒగరు, వేడి, యరుచి, వాయు, క్రిమి, కఫము, దుర్గంధము మున్నగువానిని నశింపజేసి నోటికి శోభనుగలిగించును. కామశక్తిని వృద్ధిచేయును. రక్తపిత్తరోగమును పెంపొందచేయును. ఆలసటను బోగొట్టును. నోటికి రుచిగలిగించును. నోటిలోని పండ్లకాంతిని వృద్ధిచేయును. సుగంధము గలిగించును. దంతములయందలి, జిహ్వయందలి మలినపదార్థమును నాశముచేయును. నోటినుండి నీరుకారుట, గొంతురోగమున్నగు వానిని బోగొట్టును. ముఖకాంతివృద్ధిచేయును.

తమలపాకు లనేకవిధములుగానున్నవి. నవీనమయిన ఆకులు మధురము, కషాయము, కఫమునుత్పన్నము జేయును. బంగాళాదేశపుఆకులు పాచనశక్తిని, పిత్తమునుగలిగించును. ఉష్ణమును, కఫమును నాశముజేయును. ఇంకొకరకపాకులు రంగునందు కొంచెము గోధుమవర్ణముగానుండును. అవి మిగులవిశేషగుణమునిచ్చును.

పోకచెక్కగుణము:—గట్టి, బరువు, శీతలము, కఫపిత్తరోగనాశమును, కొన్నిరుచికారకములును, కొన్నివ్యాధుల నిర్మూలించునవియునైయున్నవి. కొన్ని త్రిదోషనాశకములు, కొన్ని యగ్నిని మందముజేయునవియైయున్నవి.

కాచుగుణము:—శీతలము, పండ్లకు హితకారకము, మలినము నాశముచేయును. నోటికి లాభము జేయును. పిత్తరోగములందు లాభముజేయును.

సున్నముగుణము:—కొంచెము వేడి, తీక్ష్ణము, నోటిని పొక్కజేయును. కఫము, వాయుసంబంధమైన రోగములను నాశముజేయును.

కాచు, సున్నము, పోకచెక్క వీనిని వేరువేరుగా సేవించుటచే పైఁజెప్పినగుణములు కలుగుచున్నవి. కాని వానిని కలిపిసేవించినచో త్రిదోషనాశకప్రభావముకలవియగును. తమలపాకులతోపాటు భుజించుటచే రుచినివృద్ధిజేయును. అన్నము జీర్ణముచేయును. మనస్సున కాహ్లాదమిచ్చును.

ఈకారణముచే ప్రాతఃకాలమున తాంబూలము సేవించునపుడు దానిలో పోకచెక్క నధికముగా వాడవలెను. అందుచే కఫమునకు శమనము గలుగును. మధ్యాహ్నసమయమునందు తాంబూలము వేసికొనునపుడు దానిలో కాచునధికముగా వేసి తినవలెను. ఆసమయము పిత్తవృద్ధికాలమగుటచే యాపిత్తము శమనమునొందును. రాత్రి సమయమున తాంబూలము వేసికొనునపుడు దానిలో సున్నము కొంచె మధికముగా వేసి తినవలెను. ఆకాలము వాయువృద్ధియగుకాలము; కాని యిందుచే నది యణఁగిపోవును.

తమలపాకునంతయు లోనికి గ్రహించరాదు. ఏలనన తమలపాకులో ముందటిభాగము, మధ్య కాడగా నుండును. అడియును, వెనుకనున్న కొనయును హానికారకములగుచున్నవి. వానితోబాటు తమలపాకును భుజించినచో రోగముత్పన్నమగును. ఈకారణముచే మొదటనున్న యీనెను, వెనుకనున్న కొనను త్రుంచి వైచి రెండుభాగములుగా చేసి వాడవలెను. రెండుభాగములు చేసి పైనకాచు, సున్నము, పోకచెక్క, ఏలకకాయ మున్నగు సుగంధితపదార్థములనుంచి తాంబూలమును గ్రహించవలెను.

తాంబూలము నమలినపుడు వచ్చురసమ్మి విషతుల్యమైయున్నది. అందుచే దానినెప్పుడును త్యజించుము. రెండవసారివచ్చురసమ్మికూడ ప్రమేహరోగమును గలిగించును. కనుక దీనినికూడ ఊచివైచుట యుత్తమము. కాని మూడవసారి యమృతసమానమును, రాసాయనికమునగుచున్నది. అందుచే దానినెప్పుడు నోటినుండి వెలుపలకు రానీయవద్దు. దానిని తప్పక మ్రింగవలెను. తాంబూలము సేవించుటకు యోగ్యమగుకాలము:— మందముగానున్నప్పుడును; జిహ్వ, దౌడ, దంతములు, కంఠము, నోరు యున్నగువాని సంబంధమగు రోగము లున్నప్పుడు; నజీర్ణము, కఫము వృద్ధియగురోగములున్నప్పుడును తాంబూలము సేవించుట లాభకరము.

తాంబూలమును సేవించుటకు నిషేధకాలము:—కండ్లకునొప్పి కలిగినపుడును, శరీరమందు గాయము తగిలినపుడును, దాహముగలిగినపుడును, క్షయ మదవికారములు గలిగినపుడును, మూర్ఛశ్వాసరోగములందును, విరేచనములగుచున్నప్పుడును, ఆకలిగొనినపుడు నధికముగా తాంబూలమును గ్రహించుటమంచిదికాదు. అప్పుడు ఎక్కువగా గ్రహించుటచే శరీరమునకుఁ గండ్లకు, పండ్లకు, చెవులకు, హానిగలుగును. శోషరోగము కూడ కలుగును. రక్తపిత్తరోగములు కలుగును. కండ్లదుర్బలతయందు, దంతరోగములందు తాంబూలము వేసికొనుట హానికరము.

భోజనానంతరము తాంబూలమును వేసికొని సుందరమగు శయ్యయందు కుడిప్రక్కయందు పండుకొని 16 శ్వాసలనుపీల్చుము. మరల తిన్నగా వెల్లికిలఁబండుకొని 8 శ్వాసలను గైకొనుము. మరల యెడమవైపున పండుకొని 32 సార్లు శ్వాసించుము. తరువాత యటులనే శయనించుము. అధికముగా యెడమవైపునచే పరుండుట లాభదాయకము. ఏలనన శరీరములోపల కుడివైపునసే భోజన మధికముగా జీర్ణమగును. ఈ కారణముచే దానికి విశ్రాంతినొసంగుటకుగాను కుడివైపునువదలి యెడమవైపునపరుండుట లాభదాయకము.

—అనువాదము.

## పారవశ్యము

శ్రీమతి బసవరాజు వేంకట రాజ్యలక్ష్మమ్మగారు

మాపెరటను పెరుగుచున్న
వేపనీడ యెండవేళ
చల్లదనము హాయినొసగు.
చల్లని వెన్నెలరాత్రుల

చేరి యచటనాథు చేత
తారమీట నే బాడుచు
తేలియాడ హాయిలోన
తెలియక రాతిరిగడచెను.

# అనపోతు

కు. శ్రీ వేంకటసుబ్బారావు దాదరిగారు

౧

విచ్చుకత్తినిబూని వీరపుత్రులగూడి కారెమపూడికి గదలునాడు
"పలగాము" బరిమార్తుమని పంతములనాడి సమరవిహారముల్ సలుపునాడు
మాంచాలమేడలో మరచినముద్రిక దెమ్మని సఖుడుబుత్తెంచునాడు
హాయమెక్కి నిర్ణీతమగు జడ్డిగములబావికి నాతురతతోడ వెడలునాడు
పగరజెండాడ నుత్సాహపడిన నిన్ను
బాలచంద్రుడు ద్రోహియై వాసిపోవ
ప్రాణముత్యజించినావెంత ధన్యమతివో
విమలతరశౌర్య! అనపోతువీరవర్య!

౨

భక్తిభావంబుట్టిపడగొల్చితివిగాని పరుషంబు నొకనాడు బలుకలేదు
ఉత్తమకులమున నుదయించితివిగాని పరకులంబని యీసుబడగలేదు
"బాలు" వీరునిజేయ భావించితివిగాని కుమతివై సానిని గూర్పలేదు
యుద్ధరంగంబున కురికితివేగాని భీరుండవై యింట దూరలేదు
కటకటా! ఇట్టినిన్ను నిష్కారణ బూని
బాలచంద్రుండు ద్రోహియై వాసిపోవ
ప్రాణముత్యజించినావెంత ధన్యమతివో
విమలతరశౌర్య! అనపోతువీరవర్య!

3

శిథిలమై ప్రాణావశిష్టమై కన్నీరుగార్చుచుండిన జడ్డిగములబావి
కనులారనీమృతి గనియెరుంగనియట్లు జపియించుచుండిన జమ్మిచెట్టు
బాల్యమిత్రులస్నేహబంధంబువిడెనని విలపించుచుండిన వెజ్జిబయలు
కలికుదనమ్ముగ కంఠరక్తముగ్రోలి కంటగిల్లుచునున్న ఖడ్గధార
అకలుషితమగు నీయమాయికపథంబు
చాటుచున్నవి నేటికి చావలేదు
దోషరహితుడవగు నీకు దుఃఖమేల?
విమలతరశౌర్య! అనపోతువీరవర్య!

౧

ప్రదేశము: అనార్య దేశమందలి యడవి
ప్రవేశము: ఖనా

ఖనా

విద్యాగంధములేని మనస్సువలె నీయరణ్య మెంత చీకటిగానున్నదో! సూర్యుడు ప్రకాశించుచున్న నేమిఫలము? ఆకులనడుమ సందెంతమాత్రము లేకుండ నున్నకతమున సూర్యకిరణాళి లోనికి చొరలేకుండ నున్నది.

ఎంతకాంతియో పైనున్న నేమిఫలము
కానసమునకు యోగంబుకలుగదాయె
గ్రహము లెంతయుచ్చనున్న కార్యమేమి
కాలసర్పయోగము చెడుకలుగజేయు.

ఈయడవి యెంతమనోరంజకముగనున్నది? ప్రకృతి తనతనివి తీరునట్లుగ నిట విహరించుచున్నది. నరుని రక్తస్పర్శలేనంత కాలము ప్రకృతి శోభమాయదుకదా! నరునిపాదముపడినచోటనంతయు నాశమే.

నరువిసపుటూర్పుగాలుల చెరిగిపోవు
నవకుసుమగంధభరితమౌ పవనుసొగసు
పాపవీక్షిత శుభయోగపటిమపగిది.

అబ్బ! చలిగాలి యెంతతీక్ష్ణముగ వీచుచున్నది? లోనియెముకలనుగూడ నూగించుచున్నది.

ఏచి వీచుకో చలిదేవ! ఏచికొనుము
నరుకృతఘ్నుతకెదురె? నీకరకుదనము
ఈవుకలిగించు బాధ యేదేనియైన
నలుపగాలేదు నరుమాయజాలమువలె.
అకట! యీలోకమంత మాయావృతంబు
స్నిగ్ధధర్మంబుసాపాటుచేటుకొఱకు
దేవసదృశమా ప్రేమబూదేనికొఱకు
కాని నిర్మలజీవాన కలదుసుఖము
నలిపిచేయము మమ్ము నీచలికరాల
మేలుమఱచెడు కుజనులపోలగలవె?
గలగలనునీరు గడ్డగానలుపగలవు
కాని మిత్రవంచకు పోలకలవె నీతు!

ఆహా! ఈవృక్ష మెంత నీడనిచ్చుచున్నది?

(పాట)

రండి! రండి! నరులార! నాయండజేర రం॥
ప్రేమతీగెలగొంతు వీణెమునకిచేసి
తీపికోయిలపాట తీరుదిద్దెడువారు రం॥
పడచురక్తము ఒంటప్రవహించుతరియందే
ముసలివానసప్రకృతి ముద్దుముద్దులుకోరి.

(లోపల)

నీవు ప్రేమించువానినే నేనువలతు
కాన నోకలకండ నిన్ కలిసికొనెద
ఆకుపచ్చని ఖద్దరుకోకదాల్చు
ధరణి, తారకస్నిటుల ముదియురాత్రి
కోతకాలములో చేను లేతభాను
కిరణములబంగరగుమంచు సరములలలు
నరునిరుధిరోష్ణతా రుచే నలిగిపోని
ప్రకృతివన్నెలచిన్నెల వలచువాడ.

మిహిరుడు

(ప్రవేశించి)

శ్లో. వక్రార్క్యార్క్యగురుభిస్సకలై స్త్రిభిశ్చ
స్వోచ్చేషుషోడశ
నృపాః కథితైః కలగ్నే ద్వ్యేకాశ్రితేషుచతు
రైకతమేవి
లగ్నే స్వక్షేత్రగేశశిని షోడశభూమి
పాస్స్యుః॥

ఈముప్పదిరెండు రాజయోగములన్నియు నన్ను వరించినను మీబోటి విద్యావతుల స్నేహముకన్న నెక్కువకాదని నాయభిప్రాయము.

ఖనా

ఆర్యా! తామెవరు?

మిహిరుడు

నే ననార్యుడను.

ఖనా

అట్లనుటన్యాయమా? తామార్యులు. తాముతండ్రిగారిచే విడువబడిరి. లెక్కతప్పుటచే మీకు బాలారిష్టమున్నదనుకొని మిమ్ము పెట్టెలోబెట్టి మీతండ్రి నదీప్రవాహమున విడిచిపోయెను. మీరొకయనార్యునకు దొరికితిరి. అతడు మిమ్ము పెంచి మీకు జ్యోతిషశాస్త్రము చెప్పెను. మీరాశాస్త్రమున మిక్కిలి ప్రవేశము సంపాదించితిరి. తమ ముఖమును జూచి గ్రహములకూడిక గ్రహించి యీరీతిగ చెప్పిన నన్ను మన్నింతురుగాక. మీవీపుపైగాల్చి మీనాయనగారొక కృత్రిమపుమచ్చగల్పించిరి. ఆమచ్చ యానవాలువలన మీరు మీనాయనగారిని కలిసికొనగలరు.

మిహిరుడు

ఆహా! చేతులెత్తి నమస్కరింపదగినంత పాండిత్యము సంపాదించినావు. స్త్రీలోకమంతకు విశేషఖ్యాతినీవలన కలుగగలదు. నీజ్యోతిషశాస్త్రము, గణితము, అపరిమితము, అసమానము. ఏవిద్యనైన స్త్రీయే యభ్యసించి పారముగాంచవలెను.

ఖనా

ఆర్యా! స్త్రీలయందు తమకున్న గౌరవమునకు కృతజ్ఞురాలను. మన్నింతురేని మనవిచేసికొనెదను. స్త్రీపురుషునికన్న సునిశితబుద్ధికలది. పైగ నామె బుద్ధి చిన్నవయస్సునందే పరిపక్వమునకువచ్చును. పురుషులతోబాటు స్త్రీలకుగూడ తల్లిదండ్రులు పాక్షికబుద్ధిలేక చదువు చెప్పింతురేని స్త్రీయే యెక్కువవిద్య నార్జింపగలదు.

మిహిరుడు

నిజమే. నీవు కవిత్వమునందుగూడ ప్రవేశము సంపాదించితివే.

ఖనా

(తలవంచుకొని) నాజ్యోతిషము నాకవిత్వము తమముందరేమి పనికివచ్చును?

మిహిరుడు

ఆహా! ఆడుదాని సహజమౌగ్ధ్యము! ఎంతవిద్యావతియైనను తన యాత్మగౌరవమునకు భంగము రాకుండ వర్తించునామెయే దేశాలంకారమగు యువతీలలామము. కోకిలకంఠాన వీరరక్తస్రావస్వని వినిపించునామెయే దేశాలంకారమగు యువతీలలామము. గచ్చకాయలతో బుజ్జల నెగురకొట్టునామెయే దేశాలంకారమగు యువతీలలామము. స్వర్గీయదేవతలనింట కట్టివైచునామెయే దేశాలంకారమగు యువతీలలామము. హిందూదేశము చేసికొన్న పూజచేనట్టి స్త్రీరత్నములు పుట్టుచున్నారు. పుట్టగలరు. హైందవసీమలో కథానాయికలే కాని కథానాయకులు తక్కువయని యనిపింపచేయు నారీమణులుద్భవింపగలరు.

ఖనా

(తలవంచి) ఆర్యా! అట్టిస్త్రీల భార్యలగాబడయగల్గు పురుషులదృష్టవంతులుకారా?

మిహిరుడు

అందులకు సందియమేమి? కాని యందఱికట్టి యదృష్టముపట్టునా?

ఖనా

తమజాతకమునందట్టి యోగమున్నదా?

మిహిరుడు

కన్యాలలామా! ఇన్ని చెప్పినదాన వాయంశమును గూర్చి మాత్రము చెప్పలేవా?

ఖనా

నేను కన్యనని మీజ్యోతిష్యప్రజ్ఞచేతనే కనిపట్టితిరా?

మిహిరుడు

నీప్రజ్ఞయందు నాదొకప్రజ్ఞయేనా?

ఖనా

మీకు విద్యావతియగు భార్యలభింపగలదు.

మిహిరుడు

ఎప్పుడు?

ఖనా

ఇప్పుడే.

మిహిరుడు

ఎట్లు?

ఖనా

ఇట్లే. (అతనిభుజముపై చేయివైచి) నావంటి యదృష్టవతి యీప్రపంచమున కలుగబోదు.

మిహిరుడు

ప్రేయసీ! అట్లుకాదు. నిన్నుబట్టి నేనదృష్టవంతుడను.

పురుషుదురదృష్టమెప్పుడు పురుషునియదె
వానికబ్బునదృష్టంబు భార్యవలన
ఖరకరునివెల్గు కొనుహిమకరునిపోలి.

ఖనా

నాథా! ఆయంశమునే మార్చికూడ చెప్పవచ్చును.

మిహిరుడు

ప్రేయసీ! మనము మనపెంపుడు తండ్రులయనుజ్ఞబడసి, పెండ్లిచేసికొని, ఆర్యదేశమందున్న విక్రమాదిత్యునియొద్ద మాతాయనగారగు వరాహుడు నవరత్నములలో నొక్కనిగనున్నారట—అచ్చటకుబోయి రాజాశ్రయము సంపాదించుకొందము.

ఖనా

నాథా!

పరుగెత్తునేరులోపలపుస్తకాలు
తలదాచతావిచ్చు తరులనాలుకలు
రాలలోకల్గు వేదాలబోధలను
చదువుచువినుచు నా చరణనుంచుచును
కాలంబుగడిపిన కలుగదెసుఖము?
ప్రభువులచిత్తముల్ బహుచంచలములు
ఈరాజుపై కీర్తి యేరోజునైన
నేలభగ్లునగొట్టు లీలవారలది
ఈరక్తబలిమితో నిట్లుండగానె
సర్వేశుకొల్చిన సర్వంబుకలదు.

మిహిరుడు

నీవన్నదబద్ధముకాదు. కాని విద్యయనునది ప్రభుపోషణమున రాణించును. అయినను మనమీయరణ్యమందు కృశించిపోయిన, లోకము మనవిద్యచే నేమి బాగుపడగలదు? ఒక్కమాట. వజ్రమెంత విలువకలదైనను రవంత మెఱుపుకాంతియైన దానిపై ప్రసరించినప్పుడుకదా దానితళుకు. లోననెంత విచిత్రమైన మందున్నను అంటించినగాని పైకిప్రాకి తారజువ్వ నానావిధములగు రంగు పూలవర్షింపగలదా? ఈవిక్రమాదిత్యుడుదారస్వభావుడు. అందఱ ప్రభువులవంటివాడుకాడు. నవరత్నముల తనపోషణమునంచి, యఖండయశస్సునార్జించుకొన్నాడు. అట్టివానికడ మనకగౌరవము జరుగదని నాయభిప్రాయము. మన యిరువురకోజులుకూడ బాగుగనున్నవి. లెమ్ము. ఇట్టి మహారాజమార్తాండుని యాస్థానమునగాని విద్యకు వన్నెరాదు.

ఖనా

మహాప్రసాదము.

—(తెర)

౨

ప్రదేశము: విక్రమాదిత్యునిపట్టణమున నొకగృహము

ప్రవేశము: ఖనా

ఖనా

అకటా! భారతదేశ మెంతదౌర్భాగ్యదశయందున్నది. ఇంకను రానురా నీదేశమునకు దీనస్థితియే. పరాధీనయై బహువిధముల క్లేశముపొందగును. దేశీయులకు బానిసరక్తము యథేచ్ఛముగ నాశములలో ప్రవ

హీంచును. కాంతల గౌరవ మెఱుగక, వారలకు తగు విద్య, స్వేచ్ఛ నీయక వారిబాష్పధారలచే గృహముల నపవిత్రము చేయు పురుషులున్నంత కాలమీ హైందవ దేశమున కౌన్నత్యము రాదు. ఏనాడు 'అబల' యని పిలువబడుచున్న స్త్రీ పురుషునితో ధర్మరంగమున యుద్ధము చేయకలుగునో, యానాడు దేశదాస్యము తొలగినదన్నమాట. స్త్రీలకు, దేశమున కట్టియున్నత దశ రావలెను. తండ్రీ! రమేశా! రావలెను.

(లోన) రాకమానునా? రాకమానునా?

—(మిహిరుడు తొందరగా ప్రవేశించును)

ఖనా

నాథా! ఏమా తొందర? మామగారేరీ?

మిహిరుడు

సఖీ! విద్యకు గౌరవము రాకపోవునా? ఆహా! దేవతలు పుష్పవృష్టి కురియదగిన యంశము ప్రభుడు నేడాచరించినాడు.

ఖనా

నాథా! ఏదది?

మిహిరుడు

దేవీ! మా నాయనగారు, నేనుకూడ చెప్పజాలని నక్షత్రసంఖ్య నీవు చెప్పినందులకు ప్రభుడు నిన్ను పదియవరత్నముగ తనయాస్థానమున నుంచినాడు.

ఖనా

భగవంతు డాతని రక్షించునుగాక! ప్రభువకిట్టి యనూనానుగ్రహము నాపై నెట్లుకలిగెను?

మిహిరుడు

దేవీ! అసమానపాండిత్యప్రతిభ నీకుండుటవలన— స్త్రీలోకమంతయు నొక్క మారెగిరి గంతువేయ దగిన సమయమిది కాదా? 'ఖనా' అనునొక స్త్రీ తన యపారప్రజ్ఞచే విక్రమాదిత్యుని యాస్థానమున పదవ రత్నమయ్యెనన్న కీర్తి దశదిశాస్థమై గాలినుక్కిరి బిక్కిరిచేయదా—అక్షరపూ వీయంశము నక్షత్రము లాకాశమున వెండియక్షరముల వ్రాయవా?

ఖనా

నాథా! స్త్రీలకు కీర్తి నీవంటి భర్తలున్నప్పుడే కదా!

సర్వలోకేశుడైన యీశ్వరునిముందు
లేని స్త్రీపురుష విభేద విూసరుల క
దేల? యేనాడు పురుషులు స్త్రీలు తమ్ము
తీసిపోరని యెంతురో తెలియలేము—

—తెర.

# ప్రవాసిని సీత

శ్రీమతి పి. రామసీతమ్మ గారు

౧

స్వామి! నీబిగ్గకౌగిలి బాసి యేల
ఘోరకాంతారముల జూడగోరినాను
కడలిదైన ముంచె నీవియోగమ్మునన్ను
చాలునక్కటా! ఈప్రవాసమ్ముభరము.

౨

ఎవరితో చెప్పుకొందు నాహృదయబాధ
నాథునై నేన వరియించినాను; ముందె
నాయభాగ్యమ్ము కనలేకపోయినాను
ఏల వినుబాయ కోర్కె నాయెదజనించె?

౩

"సీత! నాయంధకారంపు జీవితమున
సుప్రభాజ్యోతివీవె" యంచును మృదూక్తి
పల్కితివినాడు, నేడెట్లుస్వామి! నను
కానలకుద్రోసి భరియింప గలిగినావు?

౪

ఒక్కనిముసంబు మాటాడకుందు నేని
విశ్వమే శూన్యమనియెంచు ప్రేమమూర్తి!
ఎటులసైరించినావో నేనిట్టుప్రవాస
భూమి నేకాకినిగ దుఃఖమునకృశింప?

# రా జా

శ్రీమతి పాకల రత్నమాలగారు

రాజా పుట్టిననెలరోజులకే తల్లి ఇహలోకంవిడిచింది. అప్పటినుండీ రాజాని అతిగారాబముగా పెంచుతోంది నాయనమ్మ తల్లిలేని లోటులేకుండా. రాజాఅంటే చిన్నాయనకి చాలాప్రేమ. తనకికొడుకు లేకపోవటంవల్ల మరింత ప్రేమించేవారు.

అందరిచేతుల్లో అల్లారుముద్దుగా పెరుగుతున్నాడు రాజా. ఇల్లాగే మూడుసంవత్సరాలు గడిచేయి. నాలుగోసంవత్సరం పెట్టింది. ఓనాడు చిన్నాయన గదిలోకివెళ్ళి మంచంమీదయెక్కి ఆడుకుంటున్నాడు రాజా గంతులు వేస్తూ. మంచంమీద దుప్పటిజారి క్రిందపడిపోయింది. ఇంతట్లో రాజాపిన్నమ్మ గదిలోకివచ్చి చూచింది. ఏమిటిలా గంతులువేయటం, దుప్పటిపడిపోయింది, పరుపుమాసిపోదూ, నువ్వు అల్లరిబాజావవుతున్నావు, ఇకనుండి నామంచంఎక్కు నీపనిచెబుతానన్నది కోపస్వరముతో. రాజా చిన్నబోయాడు. ఒక్కనిముషంలో మంచందిగి నాయనమ్మదగ్గిరకి పారిపోయేడు. ఆరోజునుంచి పిన్నమ్మ గదిలోకి వెళ్ళటం మానివేసాడు.

ఆనాడు ఆదివారం. చిన్నాయన తీరికగాగదిలో మంచంమీద కూర్చున్నారు. రాజా గబగబావచ్చి మంచంయెక్కి చిన్నాయనవీపుమీదపడి ఆడుకొంటున్నాడు. పిన్నమ్మచూచింది. నెలదినములుగా తనగదిలోనికిరాని రాజా నేడు హఠాత్తుగారావటం ఆశ్చర్యమనిపించింది. రాజా ఇవ్వాళ ఎందుకువచ్చావ్ ఇక్కడికి అన్నాది నవ్వుతూ. పిన్నమ్మమాట పూర్తిగాకముందే "మాచిన్నాయన ఉన్నారుగా"అన్నాడు రాజా ధాటీగా. ఏమిటీకథ అన్నారు చిన్నాయన. జరిగిన సంగతంతాచెప్పింది పిన్నమ్మ. చిన్నాయన రాజాకిగల పౌరుషానికి చాలా సంతోషించేరు. వెంటనే కొడుకునెత్తుకుని తల్లిదగ్గరకి తీసుకువెళ్ళి జరిగినదంతా చెప్పేరు నవ్వుతూ. "నాయనా! నీవు పేరుకుతగినవాడవు. పిన్నమ్మకు బాగా బుద్ధిచెప్పావు" అన్నారు. కొడుకుచేసేముద్దుచేష్టలు పలికేముద్దుపల్కులు వినటానికి తల్లిలేకపోయినదని కంటతడిపెట్టింది నాయనమ్మ. తాను రాజాని కోపపడినందుకు సిగ్గుపడింది పిన్నమ్మ. తరువాత అందరూ రాజాకు ముద్దులు బహుమతీచేసేరు.

# "పాపం, అమాయకురాలు!"

కె. కుటుంబరావుగారు

మా పున్నయ్యమామను చూస్తే నాకు చాలా అపేక్ష! కాని ఆయన ఆమాటన్నప్పుడల్లా నాకు ఒళ్ళు మండుకొచ్చేది. ఇంకా ఆయనమాటలంతా నమ్ముతున్నారనే ఆయనధైర్యం! అందరికళ్ళల్లో తాను కారం చల్లుతున్నాడనే ఆయననమ్మకం! పదిహేనుసంవత్సరాలకింద మా కామమ్మత్త — "కామ్మత్త" అనే వాళ్ళం మేం; "గయ్యాళికామమ్మ" అనేవారు ఊళ్ళోవారు! — ఆమె కాపరానికివచ్చిన కొత్తలో భర్తమీద సవారి చెయ్యటం ప్రారంభించినప్పుడు, నాబోటిగాడెవడో పక్కనుండి "ఇదేమిటి, మామా?" అంటే, ఆయన చాలా నిర్లక్ష్యంగా "పోనీరా! దానితోనేమిటి? అమాయకురాలు!" అని ఏమన్నాడో మేమేమన్నామో, అదంతా జరిగిపోయింది. పదిహేనుసంవత్సరాలు జరిగిపోయింది. ఇప్పుడింకా మమ్మల్ని ఆవిధంగా మోసపుచ్చాలనుకోటం ఏమిటి? తెలీకడుగుతాను! మమ్మల్ని వెధవలుచెయ్యాలని ఉద్దేశమా? మామామను ఈ ముక్కలు మూదూస్పష్టంగా అడిగాను.

"కాకే, మామా! నువ్వేమో నిన్న ఆఫీసుకు అన్నంతినకుండాపోతివి. రాత్రిఏడుగంటలకు కాని తిండి లేకపోయె. అదిదేమన్నా చింతించినన్నా చింతించిందా? ఇన్నిసంవత్సరాలువచ్చి నిన్నామె సవతికొడుకును చూసినట్టు చూడటం ఏమిటి? నీఅసమర్థతకాదూ? ఎవరైనా వింటే నవ్విపోతారు. నిష్కారణంగా ఆమెను చెడగొట్టావు!"

మామామకు అమితఓర్పు. ఆయనతో మాట్లాడుతున్నప్పుడు, నాఓర్పుకూడా తీసుకుంటున్నాడా అనిపించేది నాకు. ఆయనఓర్పుచూస్తే నాఓర్పంతానశించి ఒళ్ళు కంపరంఎత్తేది.

"చూడు, రాముడూ! నిజంగా అది పాపం, ఉత్తఅమాయకురాలురా! —"

"చాల్లే! నువ్వుఅమాయకుడివి! ఎవడైనాఒక్కడు కాదంటే తలగొరిగించుకుని గాడిదమీద ఊరేగుతావు. నిజంచెబుతున్నాను. ఆవిడనోటికిజడిచి, మాకిపిచ్చిసమాధానాలు చెబుతావు. నేను కనుక్కోలేని మాత్రం?"

"పోనీ, అదేఅనుకో!" అనేవాడు మాపున్నయ్య మామనవ్వుతూ. అటువంటిమనిషితో ఏమిటిచెయ్యడం? పైగా ఆయనేదో చెప్పబోతుండగా నేను అడ్డంవచ్చాను. అదేదో తెలుసుకునే అవకాశంలేదిప్పుడు.

"మరయితేనిజమైన కారణంచెప్పు!" అన్నాను ఆయన్ను బయటికి లాగటానికి.

"నువ్వుచెప్పిందేనిజం!" అన్నాడాయన చలించకుండా.

"నేనుచెప్పిందబద్ధమైతే నువ్వు నిజంచెప్పు."

"నువ్వుచెప్పిందబద్ధంకాదు."

"అవునని లోపల అనుకుంటూ కాదంటే ఏంప్రయోజనం?"

"నువ్వు నామాట నమ్మకపోతే ఏంచెయ్యను?"

"ఏమిటి? చెప్పనీమాట!"

"అంటేవిని అబద్ధంఅంటావు."

"అన్నా!"

"నిజంగా పాపం దానికి తెలీదు, దానిచర్యవల్ల నేను కష్టపడుతున్నానని. నాకు కోపంవస్తే అది గడగడలాడుతుంది. అందుచేత నేను శాంతం అవలంబించవలసివచ్చింది."

నేను బిగ్గరగా నవ్వాను. మామామకు కోపంరాలేదు!

"నువ్వుసాయంత్రందాకా తిండిలేకుండాఉంటే నీకు కష్టమని ఆవిడకు తెలీదు కాదూ?" అన్నాను ఎగతాళిగా.

"నేను కష్టంలేనట్టు నటిస్తాను."

"ఎందుకో?"

"దానిమనస్సు శాంతిగాఉండటానికి."

"తిరిగి ఇంకోసారి ఆటువంటిపని నిరభ్యంతరంగా చెయ్యటానికి! నీకు కోపంవస్తే ఆవిడభయపడ్డం! నేనుచూడ్డం! ఇంతసరికెప్పుడన్నా వచ్చిందాకోపం?"

"ఆ! ఒకటిరెండుసార్లు!" అన్నాడు మామామ గడ్డంనిమురుకుంటూ.

"నేనెన్నడూ చూడలేదు."

"చూసినా నువ్వు కనుక్కోలేవు!" అన్నాడాయన నవ్వుతూ.

ఆయనఎదట నేను ఓడినట్టు ఒక్కసారైనా కనపడటం నాకిష్టంలేదు. కాని ఆయన చెప్పినమాటలు ఒకటిరెండుయథార్థమే. మొదటివిషయం మా"కామ్మత్త" గయ్యాళికాకపోతే చాలామంచిదే. కాని ఆఒక్కకళంకమే ఆమెను గ్రహణం పట్టినట్టుపట్టి ఆమె ఇతరగుణాలు బయటికిరాకుండాచేసింది. ఆవిడకు మాట తొందరపడి అనటం, నోటిదురుసుజాస్తి. ఏమాత్రం లోకజ్ఞానంలేదు. ఇంకొకరివిషయం విచారించటం మొదలేలేదు. అందరూ తన్ను ఎదటనే గయ్యాళికామమ్మని పిలుస్తుంటే అదేమో పెద్దబిరుదనుకుని సంతోషించేది. నలుగురమ్మలక్కలు ఆవిడచేత అడ్డమైనచాకిరీ చేయించుకోడానికి ఆమెను అభినందించేవారు మొగుణ్ణిఏడిపిస్తున్నందుకు. ఆవిడామాటలన్నీ నమ్మేది!

ఆవిణ్ణంతా మగవాడికిందనే చూసేవారు. ఆడవాళ్ళతో మాట్లాడ్డానికి బిడియంఉన్న వారుకూడా ఆమెతో స్వేచ్ఛగామాట్లాడేవారు. ఆవిడకు పిల్లలుపుట్టకపోవటం ఎవ్వరికీ ఆశ్చర్యకరంగా తోచలేదనుకుంటాను. నాకు తోచలేదు! ఎటొచ్చీమామామ ఒక్కడే ఆవిణ్ణిపువ్వుల్లోపెట్టి పూజించినవాడు!

ప్రస్తుతం మనసంఘంలో స్త్రీకి విద్యాభ్యాసానికి ఎక్కువఅవకాశంలేదు, భర్తదగ్గరకి వచ్చేసరికి కాస్త అటూఇటూగా మృగంవతుగా ఉంటుంది! ఆదంతా నేనెరుగుదును. అది అట్లాఉంచండి. కాని కొంతకాలం కాపరంచేసినతరవాతనన్నా మనిషి మానవప్రపంచంలో పడకపోతే ఆతప్పుభర్తదే! లక్షచెప్పండి! మాఅత్త అంత నగుబాట్లమారిగాఉండటం మామదేతప్పు!

మామామ అన్నివిషయాల్లో చాలా తెలివిగలవాడు. ఈఒక్కవిషయంలో అజ్ఞానపడ్డాడని నమ్మాను. సామాన్యంగా ఏమనిషినైనా తీసుకోండి, విడిగాచూసి భార్యదగ్గిర ఎట్లాఉండేదీ కనుక్కోలేం. ఎటువంటి వాడూ భార్యదగ్గిరమారిపోతాడు. లేకపోతే ఎన్నడైనా మామామ అట్లా ప్రగల్భాలుపలికే ఎరుగునా? తనకు కోపంవస్తేట మాఅత్తయ్య భయపడిపోతుందిట! ఆకోపం నేను కనుక్కోలేనుట! ఎవరూ నోటితోనవ్వడు!

నాచదువు పూర్తిఅయినప్పటినించీ నేను సంవత్సరానికి తొమ్మిదినెల్లు మామామదగ్గిరే ఉండేవాణ్ణి. మాఅత్తఎటువంటి ఛాందసంమనిషంటే, ప్రతివాడిమీదా ఒంటికాలితో లేచేమనిషి. నానోరూ మంచిదికాకపోవటంవల్ల నాతో చాలామంచిగాఉండేది. అదే ఇటువంటిమనుష్యులతత్వం. వారిని లొంగదీయాలంటే నోటిదురుసు చాలాఅవసరం. నన్నుచూస్తే ఆవిడకు చాలాఇష్టంకూడాను!

ఇట్లాఉంటుండగా అయిదారునెల్లకిందట మామామయ్యకు పెంచుకుందామాఅని ఆలోచనకలిగింది.

ఈపెంపకంవిషయంలో ఆయనఅభిప్రాయాలు నేను ఆదర్శంగాతీసుకున్నాను. ఆయనఅభిప్రాయా లేమిటంటే — పెంపకం వంశం నాశనంకాకుండాఉంటుందనేఅభిప్రాయంతో చేసుకోరాదు. పెంపుడు

కొడుకు వెయ్యిపుత్రాలువేసినా స్వంతకొడుకుకాడు! మనం ప్రాణంతో సమానంగా చూడగల పిల్లవాడు దొరికితే నే తెచ్చి పెంచుకోవాలి. ఆపిల్లవాడికి మనమీద ఆపేక్షఉండటం అవశ్యకం. మగపిల్లవాడే కావాలని నియమంలేదు.

మా అత్తఅభిప్రాయాలు వీటికిసరిగా విరుద్ధంఅనుకోండి!

మామామ ఉన్న ఇంటికి కొద్దిదూరంలో ఒక రోగిష్టిబ్రాహ్మడుండేవాడు. ఆయన కొడుకొకడుండేవాట్ట. వాడు తండ్రిసంపాదించిన ఆస్తంతాపాడుచేసి తండ్రికి మందుపెట్టి దేశాలమీద లేచిపోయినాడు. ఆయనకు పన్నెండేళ్ళపిల్ల ఉండేది. చక్కనిచుక్క. ఎంతో బుద్ధిమంతురాలు. ఆపిల్ల ఒకరోజు మామామ దగ్గిరికివచ్చి వండుకోటానికి కాసినిబియ్యం పెట్టమనిఅడిగింది. ఆబ్రాహ్మడూ ఆపిల్లా ఆఊరురావటం అదే కొత్త. నేనక్కడేఉన్నాను. మామామ ఆపిల్లనుచూసి ముచ్చటకలిగి ప్రశ్నలువెయ్యటం మొదలుపెట్టాడు. ఆచరిత్రంతా ఆపిల్లనోట వింటుంటే నాకు గుండెనీరయింది. మామామ ఆపిల్లకు శేరుబియ్యం, ఉప్పు, పెరప కాయలూ మొదలైనసామగ్రి, కొంచెం చిల్లరడబ్బూ ఇచ్చి మళ్ళీరమ్మన్నాడు మర్నాడు.

కొద్దికాలానికి ఆబ్రాహ్మడుపోయినాడు. నేనూ మామామా వెళ్ళి తగినసహాయం చేశాం. మామామ ఏడుస్తున్న ఆపిల్లనుచూపించి, "చూడరా, రాముడూ, అటువంటిపిల్లను దగ్గిరికితీసి సంరక్షించేభాగ్యం అందరికీలభిస్తుందా?" అన్నాడు. నేను మాట్లాడలేదు.

ఆరాత్రే మామయ్య ఆపిల్లను తన ఇంటికితెచ్చాడు. ఆపిల్లపేరు నీలవేణి. మామామనూ, ఆపిల్లనూ చూసినప్పుడల్లా నేను వారిద్దరూ ఏజన్మలోనో తండ్రీకూతుళ్ళనుకునేవాణ్ణి.

నీలవేణిని మా అత్త అదివరకు ఎరుగును. మామామ ఆపిల్లను మా అత్తకుచూపి, "ఇప్పటినించీ ఈఅమ్మాయి మనింట్లోనే ఉంటుంది," అన్నాడు.

"ఏ-మి-టీ?" అన్నది గయ్యాళికామమ్మగారు కళ్ళుపెద్దవిచేసి.

మామామయ్య నవ్వుతూ, "నీకు వినపడ్డది!" అన్నాడు.

"అవును. వినపడ్డది. అర్థంకాలేదు," అన్నది మా అత్త. అప్పటికామెకు బాగాపూనింది!

మామామ తొణకలేదు. ఆయన ఎన్నడూ తొణికి ఎరగడు. "కావచ్చును. ఇకముందర్థమౌతుంది," అన్నాడు.

ఏముంది? మామూలుసంభాషణే. అంతా అయినతరవాత మామామభార్య మనస్సునొచ్చిపోతుందేమోనని నీలవేణిని భగవంతుడిమీద పారేసి ఇంటికొస్తాడు. నాకు ముందే తెలుసును!

"ఆపిల్లకు మైల. తాక్కండి! ఏంపన్లు?" అన్నది మా అత్తమొహం కండలుకొడ బిరుక్కుంటూ.

మామామ-ఇంకా నవ్వుతూనే ఉన్నాడు!—నీలవేణిని దగ్గిరికితీసుకుని తలనిమురుతూ, "మైలా లేదు గీలా లేదు. నేనీపిల్లను పెంచుకున్నాను. చాలారోజులైంది." అన్నాడు. నీలవేణి దూరంగాఉన్న నావంక ఒక్కసారిచూచి తలవంచుకున్నది.

మా అత్త ఆమాటవినగానే మండిపడి "మీరుపెంచుకుంటే నేను పెంచుకోలేదు. నేనీబిచ్చగత్తెకు ఒక్కపూటవండిపెట్టను. కావాలంటే మీరేపెట్టుకోండి, చేసుకోండి." అని మా అత్తయ్య ఆగ్రహంతో వణుకుతూ వెనక్కుతిరిగింది.

మామామయ్య ఇంకానవ్వుతూనే, "పోనీ నీకుఇష్టమై మాఇద్దరికీ భోజనంపెట్టేవరకూ నిన్ను బాధించం... (నీలవేణితో) ఏమమ్మా! అంతేకాదూ?" ఆపిల్ల వంచినతల ఎత్తితేనట్టు!

ఆరాత్రి మామామయ్య పెంపుడుకుమార్తెతోసహా హోటల్లో భోంచేసివచ్చాడు. నేనామాటచెప్పినప్పుడు మాఅత్తయ్య రౌద్రమూర్తిఅయిపోయి "ఏమున్నా ఏడుచుకోనీ!" అన్నది.

మర్నాడు మామామ భార్యతో మామూలుగానే మాట్లాడుతూవచ్చాడు. ఇంకా ఆవిడే ఆయనతో మాట్లాడలేదు. కాని భోజనంవేళకు తిరిగి ఇద్దరూ హోటలుకుపోయివారు. మాఅత్త మామామకొక్కడికీ వియ్యంపోసింది. కనిపెట్టుక్కూర్చున్నది. నేను మళ్లీ చెప్పేను హోటలుకువెళ్లారని.

"నిజమేనా?" అన్నదామె.

"నిజం! నీతోడు!"

"బెదిరిస్తారా?" ఆమె మాట్లాడకుండాభోంచేసింది.

ఇక ఆమర్నాడు ఆమెలో గొప్పమార్పువచ్చింది. బయటికి కనిపించినవిశేషం ఏమిటంటే ఆరోజామె మొహం పాలిపోయిఉంది. అతివాగుడు తగ్గింది. అసలు వాక్కేపడిపోయిందని చెప్పవచ్చు. ఆరోజు ఆమె వండిన అన్నం చూస్తే పిల్లకూ్కూడా పోసినట్టు కనపడ్డది. మామామ భార్యతో మామూలుగా మాట్లాడటం మానలేదు. భోజనానికిమాత్రం హోటలుకువెళ్ళాడు. ఆయన స్నానంచెయ్యకపూర్వం మాఅత్తవచ్చి తొంగిచూసింది. స్నానంచెయ్య మనటానికేమో? కాని ఆయన అప్పుడేలేస్తున్నాడు స్నానానికి. అదీ చూసి ఆమె పీటవేసి విభూతీ, సంధ్యవార్చుకునేపళ్లెం అవీ సిద్ధంచేసింది. మామామమాత్రం సరాసరి హోటలుకువెళ్ళాడు.

అమర్నాడల్లా ఆమె ఏడుస్తున్నట్టు నాకు స్పష్టం అయింది. ఆమెను చూస్తే నాకు చాలా జాలికలిగింది. నేను ఒక్కటేఅనుకున్నాను. అంతవరకూ ఆమె తనభర్తయొక్కస్వరూపం సాంతంగా చూడాలని ప్రయత్నించలేదు. కాపరానికివచ్చిన కొంతకాలానికి ఆయనలో ఆమెకు నూతనశక్తి కనిపించింది. అంతదాకావస్తే నాకూఅంతే. ఆయన్నుచూస్తే నాకే భయంవేసింది. ఆయన భార్యసంగతి గమనించినట్టు కనపడలేదు.

ఆరాత్రి నేను ఆయన దగ్గిరకూర్చున్నాను.

"రామునీ నీలవేణిని నువ్వుచేసుకోరా, ఇస్తాను!" అన్నాడాయన సరదాగా. ఆపిల్ల ఆయన ఒళ్ళోనేకూర్చుంది.

"సరే కాని, మామా! పాపం ఎందుక త్తయ్యను ఏడిపిస్తావు? పోయి సముదాయించు. నేను చూడలేకుండా ఉన్నాను." అన్నాను.

ఆయన చివాలునలేచి "పాపం! నాకు తెలీదునుమా!" అని లోపలికి పరిగత్తాడు.

ఆటువంటి మనిషితో ఏమిటిచెయ్యటం?

## గోష్పదీశ్వరా!

శ్రీమతి కో. ప్రో. లు వెంకటరంగమ్మ గారు

(శ్రీగంగాలలితాసమేతగోష్పదీశ్వరస్వామి స్తవము)

ఉ. శ్రీమహనీయ సృష్టిస్థితిలయకేళిసురక్షణదక్ష సత్కృపా
ధామ నికామ దోషపరిభూత నితాంతతపోవిలాస వి
ద్యామయ గౌతమీవిమలవారినివాస ప్రశాంతిగోరి ని
న్నీమెయి వేడుచుంటి రజనీశకలాధర! గోష్పదీశ్వరా.

## ప్రార్థన

శ్రీమతి తిరుపీధుల అనసూయాదేవిగారు

దేవా? అవాఙ్మానసుఁడవగు నిన్ను దర్శించుటకు నిద్రాహారములు లేక యనేక మహాత్ములు పరితపించుచున్నారు. కొందరు నీయనంతదివ్యనామములను త్రికరణశుద్ధిగా నిరంతరము జపించుచు విశేషభక్తితో పూజించి యిహలోకసుఖములనెల్ల నిర్మూలనముజేసి క్షుత్పిపాసాదులకు సహించి నానావిధకష్టములచే నిన్ను వెదకి వేసారి గానక శ్రమపడుచున్నారు. మరికొందరు నీలీలావినోదముఁ తలఁచి పరమానందముతోఁబాడి దానివలన తమ మనస్సు కరగి పరవశత్వముబొంది సర్వదా నటనముజేయుచు దమమనస్సు నీకే యర్పణ జేసి సకలమును మరచి పరమభక్తులను గౌరవించి వారలకు గావలసిన పదార్థములను సమర్పించి వారలకు సేవజేయుచున్నారు. ఇంక గొందరు గృహస్థాశ్రమమున నుండినయెడల మనశ్శుద్ధియు భక్తియుఁ గలుగుట మిక్కిలిదుర్లభమని నిశ్చయించి సకలభోగములను విడిచి విరక్తులై నీదివ్యనామములను స్మరించి ముక్తిబొందుచున్నారు. వేరుకొందరు లోకవ్యాపారములను బొత్తిగావిడిచి మునివేషముధరించి అడవియందు నివసించుచు కందమూలములను భుజించి సకలేంద్రియములను జయించి తపస్సుజేయుచున్నారు. కొందరు యోగబలముచే నాభియందుండు కుండలిశక్తిని పైకిలేపి యోగాగ్నినిం గలుగఁజేసి డెబ్బదిరెండు వేల నాడులయందును సంచరించుచుండెడి ప్రాణవాయువును బిగబట్టి మరల నాభియందు పదునేనుచిక్కులను బంధించి బిందువును ప్రణవమునందుఁ జేర్చి నిలిపి గురిచెదరకయుండి యంతరంగమున ఆపోజ్యోతిని ప్రకాశింపఁజేసి చిదాకాశమునందుఁ గలిసి యానందముబొంది యున్నారు. ఇట్టి మహాయోగులకు మహత్తమమగు నీదర్శనము ప్రసాదింపవుగదా? పరమేశ్వరా! ఇచ్ఛామాత్రమున సకలప్రపంచములను సృష్టించి రక్షించువాఁడవు నీవేకదా? నీమహామహిమ నీకుగాని తదితరులకు తెలియరాదుగదా? అంతట పరిపూర్ణుఁడవై నిండియున్నావు. నిన్ను మించినది వేరొకటిలేదు. "ఏకమేవాద్వితీయం." దేవుడేగాని యితర పదార్థమేదియును సృష్టియందు లేదు. నీవు సర్వవ్యాపకుఁడవు; సర్వభూతములకు సాక్షిగానుండు నట్టివాడవు; పరమపవిత్రుఁడవు; పరంధాముఁడవు; అఖిలపాపవిమోచనుఁడవు; ఆదిమధ్యాంతరహితుండవు; నిర్మలుఁడవు; నిత్యకల్యాణుఁడవు; సచ్చిదానందుఁడవు; నీమహామహిమ వర్ణింప నెవరికి తరమగును? ప్రతియుగమున ధర్మమును పరిపాలనజేసి సాధుసజ్జనులను రక్షించుటకుగాను బ్రహ్మనందమగు నవతారములనెత్తి పరమాశ్చర్యములగు వినోదములను జేయుచు వచ్చుచున్నావు. తండ్రీ! భవదీయసంపూర్ణకరుణకు పాత్రులగు మహనీయులు దుఃఖసంక్షుభితహృదయులై దుర్భరవేదనాదహ్యమగు వైవాహికాదికష్టకార్యపరంపరలయందు పాల్గొనుట నవసరమేగదా? కమలలోచనా! నీయమృతవాత్సల్యనేత్రములవిప్పి భక్తులపై నీక్రీగంటిచూడ్కులు ప్రసరింపజేసిన దుఃఖమయమగు సంసారతాపత్రయాంధకారము నశించి భస్మమైపోవునుగదా? భక్తవత్సలా! భవబంధవిమోచనా! అప్రమేయా!

ఆనందనిలయా! మిక్కిలి జాలిగొలుపుచున్నట్టి అతిదీనమగు నాప్రార్థన విన్నమాత్రమున నీమనసుకరిగి ద్రవీభూతమైపోవదా? దీనరక్షకా! ఈనిష్కల్మషహృదయయగు నీపుత్రికను రక్షించకతప్పదు. వైకుంఠవాసా! వేణుగానలోలా! నాప్రార్థనాలకించు. అవిరళాశ్రుగళితములగు నిమీలితలోచనములతో, వినమ్రచిత్తనై హస్తములు ముకుళించి పరమభక్తితో ప్రార్థించు నాప్రార్థనలన్నియు "మహాబధిరశంఖారావములవలె" నిష్ఫలములై పోతున్నవా? యేమి కృపాజలనిధీ! వినవా? నాప్రార్థనాలకించవా? ఆలకించకపోయిన విడిచెదననుకొంటివా? విడువను. ఇదిగో నిన్ను విడువను. నీవు యెక్కడదాగినను కనుగొందును. నాహృత్పద్మమున నీవు లేకపోలేదు. నిన్నుచూడ నాజ్ఞాననేత్రము విప్పెదను. పరమాత్మా! అరిషడ్వర్గముల పారద్రోలెద. బాహ్యప్రపంచావలోకనముమానెద. పరబ్రహ్మాక్షరమగు ఓంకారనాదదశవిధవాద్యాలాపముల వినియెద. దేవాదిదేవా! మహానుభావా! నిరయమును, నిష్కళంకమును, నిర్గుణమును, నిర్మోహమును, నిస్తులమును, నిశ్చలమును, సచ్చిదానందమును, అనంతకోటిసూర్యప్రభాభాసమానసమానదీధితిని తేజరిల్లునట్టియు నీ మహాస్వప్రకాశమును దర్శించెద. ఆసచ్చిదానందపరబ్రహ్మములో నే లీనమయ్యెదగాక!

## గాజులవర్తకులు

అధికార్ల సూర్యనారాయణరావుగారు బి.ఏ;బి.యల్.

(శ్రీమతి సరోజినీదేవిగారిపాటనుండి అనువాదము.)

వన్నెలగాజుల వర్తకులమేము
దేవళపుసంతకే తీసికెలతాము;
ఇంద్రధనుస్సులే యీకెంపుగాజు
లెవరైనకొంటారె? పెట్టుకుంటారె?
సిరులున్ననారికే చిహ్నంబులివ్వి
కూతుళ్లకును క్రొత్తకోడళ్లకును!
వెన్నెలవంటివి చిన్నపిల్లలకు
అద్దాలవంటివి పెద్దవారలకు.
ఆబాలగోపాల మరయరారండు
ఈముద్దుగాజుల శృంగారమెల్ల!
పెళ్లిలో సారెలో పెద్దపండగలో
శుభములన్నింటిలో శోభలివియిచ్చు!
సంతానమియ్యంగ, సంపదియ్యంగ,
ఆపదలుకావంగ, ఆయువియ్యంగ,
మగనివలపించంగ, మంచికూర్చంగ,
నీగాజులను పోల దేవస్థులైన!
గాజులాయివి? కావు, కల్పవృక్షాలు!
కనబుద్ధిపుట్టుటే గతజన్మఫలము!
క్లింగుమనుచుండేటి పొంగుచుండేటి
నిర్మలంబైనట్టి నెనరుగలయట్టి
వయసులో నున్నట్టి వనితనవ్వోలె
మెఱుపులు మెఱపించు సరకులున్నాయి,
చూచితేప్రాణాలు లేచివస్తాయి!
ధరియించితే తిండిమరచిపోతారు!
భోజనముమానేసి పూజలంజేసి
కడుపుచల్లగ చిన్నకొడుకులంగాంచి
కష్టమేంలేకుండ కాపురముసేయు
కాంతలకునుగూడ గాజులున్నాయి;
ఆసవారలు మమ్ముఆదరించండి!
నగలు నాణెముసేయతగువారు మీరె.

## లోకల్‌బోర్డులు: స్త్రీలు

శ్రీమతి చిలుకూరి లక్ష్మీనరసమ్మగారు

మొన్న మొన్నటివరకును స్త్రీలకు మనదేశములో జాతీయజీవనమునందుగాని, స్థానికజీవనమునందుగాని పాల్గొనుటకు తగినన్ని అవకాశములు లేకుండెడివి. ఉన్నసందర్భములలో స్త్రీలు తమకు సహజమైన బిడియముచేతను, మగవారిసహాయప్రోత్సాహములు లేకపోవుటచేతను, తాము స్వతంత్రముగా బయటికి వచ్చుటకు ధైర్యము చాలకపోవుటచేతను, హిందూగృహమర్యాదల ననుసరించియు, తోడిస్త్రీల ఆక్షేపణలకు వెరచియు సాధారణముగ సామాన్యవిద్యగాని, లోకవ్యవహారజ్ఞానముగాని లేకుండుటచేతను, తమకుండిన కొంచెము హక్కులనైనను సరిగా కాపాడుకొనజాలకుండుటయేగాక, తాము దేశమునకును సంఘమునకును ఉపయోగపడజాలకుండిరి. ఇంగ్లీషువిద్యనభ్యసించినవారిలో కొలదిమందిమాత్రమే ఇట్టివిషయములలో ముందుకురాగలిగిరి. కాని, కడచిన కొలదిసంవత్సరములలో స్త్రీలయందు విద్యవ్యాపించినది. పెద్దపరీక్షలయందు కృతార్థులుకాకపోయినను, సామాన్యవిద్యనైనను సంపాదించి, వార్తాపత్రికలనుచదివి, బోధపఱచుకొని, లోకములో జరుగుచున్న విషయములను ఉత్సాహముతో గుర్తించుచున్న స్త్రీలసంఖ్య చాలవఱకు నధికమైనది. కేవలగృహవిషయములందే కాలముపుచ్చునట్టి స్త్రీలుకూడ తమ బాలబాలికలను బడులకుపంపి వారిచే వృత్తాంతపత్రికలను చదివించుకొనియు, ఇతరవిధములనుగూడ లోకజ్ఞానమును సంపాదించుకొనుచున్నారు. రాజకీయవాతావరణమున ముందుకు సాగిపోవుచున్న మనదేశపుస్థితిగతులను కొంచమైనను గుర్తించియుండనట్టిస్త్రీ మనదేశమున నేడులేదనియే చెప్పవచ్చును.

స్త్రీలయందుగలిగిన ఈమార్పును మగవారును, ప్రభుత్వమువారునుగూడ బాగుగగమనించి, వారుగూడ సంఘసేవయందు పాల్గొనిననే తప్ప దేశమునందు సంపూర్ణ జాతీయజీవనము తలచూపదని యూహించి, వారికి కొన్ని ప్రత్యేక సౌకర్యములను కల్పించియున్నారు. ప్రభుత్వనిర్మితములైన లోకల్‌బోర్డులు, మునిసిపాలిటీలు, శాసనసభలు మున్నగువానియందేకాక ప్రభుత్వేతరసంస్థలయందును స్త్రీలు సాహసధైర్యములను చూపి, మిక్కిలి తెలివితేటలతో పనిచేయుచు, ఆయాకార్యములను నిర్వహించుటయందు పురుషులతో తులతూగుచును, కొన్నిసమయములందు పురుషులు నిర్వహింపలేని కార్యములను తాము నిర్వహించుచును తమ కేర్పరుపబడిన సౌకర్యములను సద్వినియోగము చేయుచున్నారు.

స్త్రీలు సంఘజీవనమునకు లోకల్‌బోర్డులందుకూడ ఎక్కువగా తోడ్పడగలరను విశ్వాసముచేతనే మద్రాసులోకల్‌బోర్డుల 1931 సంవత్సరపు క్రొత్తచట్టమునందు వారికి కొన్ని అధికసౌకర్యములు కల్పింపబడినవి. పూర్వమువలె స్త్రీలకు వోటింగు అధికారము ఉండుటయేకాక ఈచట్టముప్రకారము వారు మెంబరుల ఎన్నికలకు నిలువబడవచ్చును. పూర్వకాలమున అధికారులు నియోగించుటవలన మాత్రమే స్త్రీలకు లోకల్‌బోర్డులయందు సభ్యత్వము చేకూరుచుండెడిది. అట్లు నియోగింపబడినస్త్రీ తనసభ్యత్వముతో మాత్రము సంతోషపడియు, ప్రభుత్వనియోజితురాలగుటవలన ప్రభుత్వసభ్యులకును ప్రజాపక్షసభ్యులకును భిన్నాభిప్రాయములు కలిగినప్పుడు ప్రభుత్వపక్షముననే చేయియెత్తవలెనను దురభిప్రాయముచేతను, సంఘమునకు సంపూర్ణముగా ఉపయోగపడజాలకుండెను. కాని, క్రొత్తచట్టమునందు లోకల్‌బోర్డులలో ప్రభుత్వనియోజితసభ్యులుండుటకు వీలులేదు. స్త్రీలును పురుషులవలెనే వోటరుల విశ్వాసమును సంపాదించిననే తప్ప సభ్యురాండ్రగుటకు వీలులేదు. కావున వారు లోకలుబోర్డులందు సభ్యురాండ్రుకాదలచినయెడల వోటరుల విశ్వాసమును సంపాదించుటకై ప్రజాహితజీవనమునందు పాల్గొనుచు, తామభ్యర్థించుచున్న సభ్యత్వమునకు తగియున్నట్లు రుజావుచేసికొనవలసియున్నది.

లోకల్ బోర్డులలో జిల్లాబోర్డులు, తాలూకాబోర్డులు, పంచాయితీలు అను మూడువిధములైన సంస్థలున్నవి. గ్రామపరిపాలనమును నిర్వహించునట్టిదానికి పంచాయితీయని పేరు. తాలూకావ్యవహారములను చూచుదానికి తాలూకాబోర్డుఅని పేరు. జిల్లావ్యవహారములు చూచుదానికి జిల్లాబోర్డు అని పేరు. ఈమూడుసంస్థలలో కూడ స్త్రీలకు పురుషులతోబాటు ఎన్నికలకు నిలుచబడుటకు హక్కుగలదు. ఇదిగాక స్వల్పసంఖ్యాకులైన మహమ్మదీయులు, ఇండియనుక్రైస్తవులు, ఆదిద్రావిడులు వీరితో స్త్రీలకుగూడ జిల్లాబోర్డులు, తాలూకాబోర్డులలో ప్రత్యేకస్థానములుగలవు. ఇందువలన స్త్రీలు పురుషులతోబాటు ఎన్నికలకు నిలువబడుటకు సందేహింతురేమో అను ఉద్దేశముతో వారికి ప్రత్యేకస్థానముల నేర్పాటుచేసినట్లు కనబడుచున్నది. ఈసందేహమునకు కారణములేకపోలేదు. పూర్వానుభవమువలన స్త్రీలు లోకలుబోర్డుల వ్యవహారములందు తగినంత శ్రద్ధను చూపియుండలేదు. అందువలన వారికిగూడ తగిన సౌకర్యముల నేర్పరిచి, ఆయాసంస్థల వ్యవహారములందు శ్రద్ధను కల్పించుట మిక్కిలి యావశ్యకమగుటచేతనే వారికి ప్రత్యేకసౌకర్యమేర్పరుపబడినది.

కావున స్త్రీలు తమకుచిక్కిన అవకాశములను సంపూర్ణముగా వినియోగించుకొనవలయును. తమకేర్పడిన ప్రత్యేకస్థానములకెట్లును నిలుచబడవచ్చును. ఇంతతో వారు సంతృప్తిచెందక, పురుషులతోబాటు మరికొన్ని స్థానములనుగూడ సంపాదించుటకు ప్రయత్నింపవలయును. ఈ ప్రయత్నమునందు స్త్రీవోటరులందరునుకలసి పనిచేసినయెడల ఆప్రయత్నము సఫలముకాకపోదు. ఈవిషయమున పురుషులు స్త్రీలప్రయత్నములకు విముఖులైయుందురనుటకు వీలులేదు. వారీసదుద్యమమునందు సహాయపడరని సందేహపడనక్కరలేదు. పురుషులు స్త్రీలయుద్యమములను ప్రతిఘటించెడికాలము పోయినది. కావలసినయెడల పురుషుడు తప్పుకొని స్త్రీలకే సామాన్యస్థానములకు నిలువబెట్ట పూనుకొనగలడు.

లోకలుబోర్డులయందు సభ్యులగుట కేవలగౌరవముకొఱకని సాధారణముగా నొకయభిప్రాయముకలదు. సామాన్యముగా చాలమంది అట్టిగౌరవముకొరకును, సభ్యత్వమువలన కలుగగల పలుకుబడికొరకును, సభ్యులగుటకు ప్రయత్నింతురని లోకములో నొకయపనిందకలదు. కేవలముభక్తాలకొఱకే సభ్యులగువారును ఉన్నారని లోకులయభిప్రాయము. ఈఅభిప్రాయమునందెంతవఱకు సత్యమున్నదో చెప్పలేముగాని, స్త్రీలు సభ్యురాండ్రగునప్పుడు మాత్రము అట్టి అనుమానములకు తావీయకుండ వ్యవహరింపవలయును. అప్పుడే వారితరులకు మార్గదర్శకురాండ్రుకాగలరు. అప్పుడే వారియందుంచబడిన విశ్వాసము సార్థకముకాగలదు. సంఘసేవయే పరమోద్దేశముగా మనసునందుంచుకొని లోకల్ బోర్డులందు సభ్యత్వమునుసంపాదించినస్త్రీ ఆసంస్థమూలమున లోకమున కుపకారము చేయగలదు.

అయినను సభ్యురాలగుటకు స్త్రీ తాను చేరిన సంస్థయొక్క స్వరూపమును, దానిప్రయోజనమును, దానిమూలమున నిర్వహింపవలసిన విషయములను, దాని నిబంధనములను, సభలయందు సంచరింపవలసిన విధానమును బాగుగ తెలిసికొనియుండవలయును. సభ్యత్వమునకుపూర్వమే ఆయావిషయములను తెలిసికొనియుండనియెడల తనకార్యముల నామె బాగుగా నిర్వహింపజాలదు. సభామర్యాదలను గుర్తించి తాను చేయబూనిన కార్యములను నెరవేర్చునట్టి సభ్యురాండ్రమూలముననే స్త్రీలగౌరవము వృద్ధికాగలదు.

క్రొత్త లోకల్ బోర్డుల చట్టముప్రకారము ఎన్నికలు అచిరకాలములో జరుగనున్నవి. స్త్రీలు తమ హక్కులను నిలువబెట్టుకొనుటకును, తమకు కల్పింపబడిన అవకాశములను క్రమమైనమార్గమున వినియోగపరచుకొనుటకును తగినసమయ మాసన్నమగుచున్నది. ఇట్టితరుణమును వదలికొనక స్త్రీలు సంఘసేవచేయు అవకాశమును విడిచిపెట్టుకొనకుందురుగాక! వోటరులు తమకర్తవ్యమును గుర్తించి తమమేలును మనసునందుంచుకొని శక్తిసామర్థ్యములుగల స్త్రీలనే ఆయాలోకలుబోర్డులకు ఎన్నుకొందురుగాక!

# మరణావస్థ

త్రిపురనేని గోపీచంద్ గారు

ఆమెకు జబ్బుగాఉన్నప్పుడు నేను మా అమ్మను చూడడానికి బయలుదేరి మాకష్టాలకు దేవుణ్ణి నోటికివచ్చినట్లు తిట్టాను. ఆరోజు ఆమెకు కొంచెంకులాసాగాఉన్నది. ఇకఆరోజు మొదలుకొని ఎప్పుడు ఆమెను చూట్టానికి బయలుదేరినా దేవుణ్ణి అమోఘంగా తిట్టి వేసేవాణ్ణి. అలా దేవుణ్ణితిడితే ఆమెకు తగ్గుతుందని నాఊహ! దేవుణ్ణి, "ఆమె బ్రతుకక పోతే ఏంచేస్తానోచూడు"అని బెదిరించేవాణ్ణి. "కఱ్ఱుకాల్చి వాతపెడతా"నని కూడా భయపెట్టాను. నాఆటలు సాగలేదు. దేవుడు నా మాటలకు భయపడలేదు. మాఅమ్మ బాధ పడుతూంటే నేను చూడలేక దూరంగా కూర్చుంటే "పెద్దబ్బాయిఎక్కడ" అని దగ్గరకుపిలిచింది. "తమ్ములున్నారు, బాబూ!" అని కంటతడితో చెప్పినప్పుడు నాహృదయం నీరయింది. "చెల్లెలకు ఎటువంటి సంబంధం తెస్తావో!" అన్నప్పుడు నాహృదయం బ్రద్దలయింది. ఆవురుమన్నాను. అమాంతంగా నాజీవితమొక వల్లకాడయింది. ఎడారి అయింది. శూన్యమయింది.

మాఅమ్మను క్రిందపెట్టారు. నేను తమ్ముణ్ణిప్రక్కలోపెట్టుకొని దూరంగా పండుకున్నాను. అందరూ గొల్లుమన్నారు. "ఎందుకు? అన్నయ్యా!" అని నాతమ్ముడు అడిగెను. "వాళ్ళకు పిచ్చిఎత్తింది. వాళ్ళు ఎప్పుడూ అంతే" అన్నాను. నారెండో తమ్ముడు ఆడుకుంటూవొచ్చాడు. "అమ్మ ఏదిరా?" అన్నాను. వాడు ఆకాశంవైపు చూపించాడు. అందులో నాకు వేదాంత కనుపించినది. ఆమె చచ్చిపోలేదు. చచ్చిపోయినది మనము. ఈప్రపంచమంతా చచ్చిపోయింది. ఈచచ్చిన ప్రపంచంలోనుంచి మాఅమ్మ బ్రతికినది.

గుంటూరులో రైలుదిగాను. నన్నెరిగినవారుగాని స్నేహితులుగాని కనబడి "మీ అమ్మకు ఎలాఉన్నది?" అని అడుగుతారేమోనని భయంవేసింది. "కూలీ, బాబూ!" "పెట్టెతీసుకోనిరా." "ఎక్కడకు? బాబూ!" "బ్రాడీపేట" "అణా బాబూ!" "బేడఇస్తాను. నాతోరా." నేను పెట్టె కూలివానిని తీసపెట్టి పరధ్యానంగా పోతున్నాను. వర్షం కురవడానికి ప్రయత్నిస్తూన్నది. సూర్యుడు నాశనమైన చీకట్లో నక్షత్రాలు మెరుస్తున్నాయి. నాకు ఏమీతోచక ఆ కుఱ్ఱవానితో సంభాషణ మొదలుపెట్టాను. "నీకు రోజుకి ఎంతవొస్తుందిరా" "అర్థణో, అణో వొస్తుందండీ" అన్నాడు. "ఏంచేస్తావు?" "కొనుక్కుతింటాను." "ఇంటివద్ద ఇవ్వవూ?" "నాకు అమ్మా, బాబూ లేరండీ. ఉంటే అట్లాగే ఇచ్చేవాణ్ణి." "మరి నీకు తిండి ఎలాగురాగడవటం?" "ఇక్కడ ఒకపోర్టరుదగ్గర ఉంటున్నాను. ఎప్పుడూ అతనిదగ్గర పనిచేస్తాను. అతను అన్నంపెడతాడు. రైలువచ్చినప్పుడు కూలీమోస్తాను. ఏఅణోవొస్తే కొనుక్కుతింటాను. రాత్రిపూట రైలుస్టేషన్‌లోనే పండుకుంటాను." అన్నాడు. "ఆహా! ఎంతహాయి బ్రతుకురా?" అనుకున్నాను.

## కానుకలు

తుమ్మలపల్లి వేంకటసీతారామారావుగారు

ధవళాంబరములోనుంచి తనూద్భవకాంతులు ప్రసరిస్తూఉన్నవి. ఆమె హస్తమందున్న పూజాపాత్ర స్వర్ణకాంతిని అతిశయిస్తూన్నది. ఉదయాద్రి నారోహించుతూయున్న ఆమెయానందము ప్రతినిమిషము హెచ్చుతూఉంది. తుదిని అస్తగిరిజేరింది. "దేవీ! ఈకానుకలు ఎవరికి" అని ప్రశ్నించాను. "ఇవన్నీ మీప్రేమకానుకలు. వియోగానలమునకు ఆహుతియైన మీప్రియతములకు అర్పిస్తా"నని ప్రత్యుత్తరమిచ్చినది. ఆమెదాక్షిణ్యమూ, పరోపకారదీక్షా నాకు ఆశ్చర్యముకలిగించినవి. నైరాశ్యహృదయానికి ఆశలు చిగుర్చినవి. భయసంభ్రమములతో ఆమె కృపాంగావలోకనమునకు ఎదురుచూశాను. ఆమె అంగీకారసూచకముగా ఒకమారు శిరస్సును వంకించినది. బాధాసంకలితమైన హృదయములోనుంచి కవోష్ణబాష్పమాల నొకదానినిగూర్చి మౌనముగ భూమిమీద జారవిడిచాను. ఆమె దాన్ని పరిగ్రహించి పళ్లెరములో వేసికొన్నది. పగటివెలుగున లీనమగుతారవలె ఆమె చంద్రమండలములో నిమిడిపోయింది.

## నైర్మల్యము

గొల్లకోట బుచ్చిరామశర్మగారు

అది వర్షకాలము. అప్పుడే చిన్నచిన్న చినుకులుపడుటవలన భూభాగమంతయు పరిశుభ్రముగనుండెను. గగనమంతయు నిర్మలముగానుండెను. బాలభానుడు తనలేతకిరణములను భూమిపై ప్రసరింపజేయుచుండెను. పక్షులు కిలకిలరవముతో నొకవృక్షమునుండి మరియొకవృక్షమున కెగురుచుండెను. వృక్షములు సైతమాచినుకలలో స్నానముచేసి నిర్మలమగు నాకుపచ్చరంగుతో మెరయుచుండెను. అచ్చటచ్చట నాకులపై నున్న జలబిందువులు దినకరుకిరణములయందు ముత్యములవలె మెరయుచుండెను. అట్టిప్రశాంతసమయమున నొక హైందవవనిత యానిర్మలోద్యానమును ప్రవేశించెను. భూదేవివలె నామె అప్పుడే స్నానమాచరించి వచ్చుచుండెను. ఆమె తనశిరోజములను దువ్వుకొనలేదు. ఆమె కేశభారము జానువులవరకు వ్రేలాడుచుండెను. ఆమె ముంగురులమధ్య నచ్చటచ్చటనున్న జలకణము లామె సౌందర్యమున కొకవింత శోభనుదెచ్చుచుండెను. ఆకుపచ్చని పట్టుచీర నామెధరించెను. ఆమెప్రక్కను సుమారారేండ్ల ప్రాయముగల యొక బాలిక నిలబడియుండెను. నిశ్చబ్దముగా వారిద్దరు నాప్రకృతిసౌందర్యమును తిలకించుచుండిరి. అంత నాబాలిక "అమ్మా! అమ్మా! ఆచెట్టుచూడవే! నీవలె నెంత యాకుపచ్చగను నిర్మలముగనున్నదో!" అనెను. ప్రతిబిడ్డయు నొకకవి యనుమాట నిక్కమేగదా!

# గోదావరీతీరక్షేత్రములు

## త్రియంబకము

గోదావరిపుట్టిన పావన క్షేత్రము. ఈభూమియందు గల ద్వాదశజ్యోతిర్లింగ క్షేత్రములలో నొక్కటి. ఇచ్చటి కుశావర్త తటాకము సుప్రసిద్ధమైనది. అందలి స్నానము పుణ్యప్రదమైనది. గంగ, యమున, సరస్వతి, నర్మద, కావేరి మొదలగు నదులు పాతాళము గుండా గోదావరిలోనికి ప్రవహించునని పురాణములు వాకొను. ఈదినములను మనము పుష్కరమనియు, త్రియంబకమువారు సింహస్థిఅనియు వ్యవహరింతురు. కుంభకోణమందు మహామాఘమువలెను, అలహాబాదునందు కుంభమేళవలెను ఈసింహస్థి విశేషమైనదిగ నెంచబడును.

## నాసిక

పవిత్రమైనది. గోదావరి నది యొడ్డుననున్నది. ఇచ్చట హిందువులు శ్రాద్ధకర్మలు మున్నగునవి ఆచరింతురు. పశ్చిమహిందూదేశపు కాశియని దీనికి ప్రసిద్ధి. గంగకు కాశిఎట్టిదో గోదావరికి నాశిక యట్టిది. నాసిక పట్టణము గోదావరికి ఉభయపార్శ్వములందును గలదు. గౌతముడు ఇచ్చటి గోదావరిమహత్తును రామునకు చెప్పినట్లు ఐతిహ్యముకలదు. నాసికయందు గోదావరి ఉభయపార్శ్వములును దేవాలయములతో, మఠములతో, ధర్మశాలలతో, పాషాణసోపానములతో దర్శనీయమైయుండును. నాశికయందు పంచవటిదేవాలయము ప్రసిద్ధమైనది. గోదావరితూర్పుగట్టున అయిదు వటవృక్షములనీడను ఈదేవాలయము కట్టబడినది. లక్ష్మణస్వామి శూర్పణఖముక్కును ఇచ్చట కోసి వేయుటచే దీనికి నాశికయని పేరు వచ్చినదందురు. నాశికలోని శివాలయము అతిప్రాచీనమైనది. బలరాముని దేవాలయము సుందరతమమైనది. పంచవటి చెంతగలకుండమునకు రామకుండమని పేరు. రాముడు తలుచు ఇందుస్నానము చేయుచుండుటచే దీనికీపేరు వచ్చినదని చెప్పుదురు.

## కాశేశ్వరము

ఇదియొక గొప్పశివక్షేత్రము. ఇట కాశేశ్వరుడను శివుడుగలడు. ఆదేవునివలన నీక్షేత్రమునకు కాశేశ్వరమను నామమువచ్చెను. ఇది గోదావరీతీరమున మంథనకు సమీపముననున్నది. ఆంధ్రదేశమునకు త్రిలింగదేశమనునామము దాక్షారామము, శ్రీశైలము, కాశేశ్వరములోని లింగములవలన నేవచ్చినది. పూర్వము మహావైభవమునొందిన దివ్యక్షేత్రము.

(నిజాంరాష్ట్రప్రశంస)

## ధర్మపురి

గోదావరీతీరమునందున్న గొప్పనృసింహక్షేత్రము. 'భూషణవికాస శ్రీధర్మపురనివాస'యను మకుటము గలిగి ఆంధ్రలోకవ్యాప్తమైన శతకము ఇచటి నృసింహునిగూర్చినది. పోతరాజు రచించినదని చెప్పబడు నారాయణశతకములో ధర్మపురి లక్ష్మీనాథుఁ డీ గ్రామదైవమె. పాముపాటలో చెప్పబడు ధర్మపురి యిదె. (నిజాంరాష్ట్రప్రశంస)

## మంత్రకూటము

దీనిని మంథనయందురు. ఇది గోదావరీతీరమునందున్న పుణ్యభూమి. యాత్రాస్థలము.

## పర్ణశాల

భద్రాచలమునకు ఉత్తరము 22 మైళ్ళదూరమున గలదు. పర్ణశాలచెంత నదియందలి ఒకరాతిపై స్నానము చేయుచు సీత కూర్చుండిన గుర్తులు చూపుదురు. రాతిమీద అడుగు ఆనవాళ్ళుమాత్రము స్పష్టముగ గలవు. ప్రక్కను రాళ్ళపై పచ్చని రంగుగలదు. అది సీత ఆరవేసిన బట్టరంగు అని కొందరును, ఒంటికి రాచుకొన పెట్టిన పసుపు ఆనవాళ్ళు అని కొందరును చెప్పుదురు. రాముని కాశిధట్టి ఆరవేయుటచే నల్లనైన కొండయని అచ్చటివారు ఒక ప్రదేశమును చూపుదురు. ఆపాషాణములపై నల్లటి మరకలుగలవు.

సీత నలుగుపిండిని రోజురోజు ఒకచోట పారవేయు
చుండగా అవి ఒక మిట్టమయ్యెను. ఇప్పటికికూడ
దానిని నలుగులమిట్టయందురు. గోదావరికి అవతలి
ఒడ్డునగలదు. పర్ణశాలయందలి విష్ణుగుడికి వెనుక
తట్టున నొకపల్లముగలదు. సీతను రావణుడు మట్టిపెల్ల
సహితముగా ఎత్తుకొనిపోయిన స్థలమిదియే యని
చెప్పుదురు. పరిసరమున శివాలయముగలదు. మాయా
మునివేషమున రావణుడు ఈశివాలయమున అర్చన
చేసెను. శ్రీరామనవమికి భద్రాచలము పోవువారు
పర్ణశాలకుకూడ పోవుదురు.

## భద్రాచలము

రాముని నివాసభూమి. భద్రుడు అను మునీశ్వ
రుడు రాముని రాకకుపూర్వ మిచ్చటనుండెను. అతనిని
బట్టియే దీనికి భద్రాచలమని పేరువచ్చెను. అతడు
రామున కాతిథ్యమిచ్చెను. రావణసంహారానంతరము
రాముడు ఇచటికి తిరిగివచ్చి భద్రునకు మోక్ష
మిచ్చెను.

## గుండాల

భద్రాచలమునకు నాలుగున్నరమైళ్ళు. పరీక్షిత్తు
కుమారుడు జనమేజయుడు సర్పయాగము చేసినతావు
ఇది అని చెప్పుదురు. గోదావరిగర్భమున ఒక ఉష్ణ
గుండముగలదు. సర్పములు ఆహుతియైన గుండము
ఇదియే అని అందురు.

## కుమారస్వామిగూడెము

భద్రాచలమునకు 26 మైళ్ళు దిగువను. శివుని
కుమారుడగు కుమారస్వామికి ఇచట ఆలయముగలదు.
ప్రాచీనమును, పవిత్రమును అయినది. కుమారస్వామికి
స్త్రీద్వేషము మెక్కుడై పరిభ్రమించుచుండగా శివుడు
కుమారస్వామికి ప్రతిస్త్రీయు మాతృస్వరూపమున
పార్వతిరూపమున కనుపించుగాక యని పలికెను.
ఆవాక్కు ప్రథమమున గోదావరిచెంత ఈగూడెమున
తార్కాణమిచ్చెను. అందుమీద సంతోషించి కుమా
రస్వామి ఇచ్చటి గోదావరియందలిస్నానము విశేష
పుణ్యప్రదమగునట్లు వరమునొసగెను.

## శ్రీరామగిరి

భద్రాచలమునకు నలుబదినాలుగుమైళ్ళ దిగువ.
సీతాపహరణమునకు రావణుని అటకాయించి దెబ్బలు
తినిన జటాయువు అనుపక్షి ఇచట రామలక్ష్మణు
లకు నడచినవృత్తాంతము చెప్పెను. భార్యయొక్క
కుశలవార్త వినెను గనుక ఇచటి రామునకు కులాస
రాముడని పేరు. పర్ణశాలచెంతగల రామునకు శోక
రాముడని పేరు. శోకవిషయము అచ్చటను గదా
నడచినది. శ్రీరామగిరియందు శ్రీరాముడు జటాయు
వునకు అంత్యక్రియలు జరిపెను. శ్రీరామగిరియందలి
దేవాలయమునకు రేకపల్లి జమీందారు ధర్మకర్త.

## వాలిసుగ్రీవాద్రి

శ్రీరామగిరి చెంతగలదు. వానరరాజుఅగు వాలి
తమ్ముడగు సుగ్రీవునివలన సీతనుగూర్చిన విశేషవిష
యములను శ్రీరాము డిచటవినెను గావున ఈకొండకు
వాలిసుగ్రీవాద్రియని పేరువచ్చినదని చెప్పుదురు.

## మహానందీశ్వరము

పట్టిశమునకు నాలుగుమైళ్ళ యెగువను ఒకచిన్న
కొండపైగలదు. ఈకొండ కుండబోర్లించినట్లుండును.
వరదదినములలో చుట్టును గోదావరి పరివేష్టించి యుం
డును. చక్కనిదృశ్యములు. పట్టిశవీరభద్రస్వామికి
చెందిన నందియొక్క నివాసమని చెప్పుదురు. ఇది
మిక్కిలి ప్రాచీనకాలపుదేవాలయమగుట సత్యము.
శాతవాహనులలోని వసిష్ఠపుత్రుని శాసనమొకటి
ఇచటగలదని తెలియవచ్చుచున్నది. ఈకొండపై నొక
గుహగలదు. అందుండి భూమార్గమున కాశికిపోవచ్చు
నని చెప్పుదురు.

## పాతపట్టిశము

గోదావరిమధ్యను ఒకచిన్నకొండమీద గలదు.
పోలవరమునకు మూడుమైళ్ళుదక్షిణము. శివరాత్రి
కిక్కడ గొప్పఉత్సవము జరుగును. వీరభద్రస్వామి
దేవాలయము. స్థలపురాణములో ఇట్లుగలదు: పర్వత
ములన్నియు ఒకసారి హిమాలయమున సభచేసినవి.
ఆసభకు పట్టిసపర్వతముకూడ పోయినది. కాని దీనికి

ఆక్కడతగిన మర్యాదజరగలేదు. అందుమీద కోపము వచ్చి శివునిగూర్చి తపముచేసి ఆతడు ప్రత్యక్షము కాగా ఆతనిని హిమాలయమునువదలి తనకడ నివసింపుమని కోరెను. దానికి శివుడువల్లెయని నాటినుండి ఈపట్టిశపర్వతమున వసించుచున్నాడు. ఈఆలయమున రెండు స్త్రీవిగ్రహములుగలవు. ఆసీశ్వరి, పునీశ్వరిఅని వాటినామములు. అందొకటి నవప్రసూత అయినట్లుకలదు. సంతానముకాంక్షించు స్త్రీలీవిగ్రహములను మిక్కిలి పూజింతురు. ఈవిగ్రహములముందు వస్త్రామీద స్త్రీకాలుంచి తనకు ముత్యమువంటిబిడ్డ పుట్టినచో ఆదేవికి ముత్యముఇత్తునని చెప్పును. ఈ దేవాలయమున వేఱొకతావున దుర్గ, మహిషాసుర మర్దనుల విగ్రహములు కలవు. ఈకొండచెంత నే భద్రకాళిగూడెముఅని ఒకప్రదేశముగలదు. గోదావరి నదీగర్భమున ఒకమడుగుగలదు. దానికి 'తల్లిబావి' యనిపేరు. ఇందలిస్నానము మహిమగలది.

ఈపట్టిశపర్వతమును 'కాశీఖండము'లో శ్రీనాథుడిట్లభివర్ణించినాడు.

సీ. అంతఃప్రవాహయై యావిర్భవించె నే
ధరణీధరము పొంతఁదల్లిబావి
పాతాళ నేశైలంబు పాదమూలంబుగఁ
గల్లేటితో వృద్ధగంగవారి
యుదయించె నేకొండయుత్తరాశారసా
తలకుక్షి సప్తగోదావరంబు
జనియించె నేశిలోచ్చయము దక్షిణమునఁ
గణ్వవాహిని యుప్పఁగడలికొమ్మ

గీ. పద్మగిరితోడఁబుట్టు వేపర్వతంబు
బలసియుండు నేయద్రికిఁ బంచలింగి
యట్టివీరభద్రాఖ్యమహాచలమున
కరుగుదెంచెను వింధ్యమదాపహారి.

వ. ఇట్లరుగుదెంచి లోపాముద్ర కిట్లనియె:

గీ. దక్షజానందవిపినమధ్యంబునందు
క్రతువిధిధ్వంసవేళ దేవతలనతికి
వీరభద్రేశుఁ డీయద్రి పెమ్నుఁదన్ని
గౌతమీవారిఁ దరవారిఁగడిగినాఁడు.

గీ. పంకజాక్ష్మాధరము వీరభద్రగిరియుఁ
నంధ్రభూమికి వక్షోరుహద్వయంబు
భువనచక్షుఃకరంబ యంభోరుహాక్షి!
గౌతమీగంగ ముత్యాలకంఠమాల.

సీ. ఎవ్వాఁడు దాచేతఁ గ్రోవ్వాఁడినఖమునఁ
జదిమె భాషాదేవిచిగురుముక్కుఁ
గనకమేఖలఁ గ్రుచ్చికట్టె నెవ్వఁడు లీలఁ
జెఱఁగుపైఁ బూషాస్యు మెఱుఁగుపండ్లు
కోరకెవ్వఁడు పదాంగుష్ఠభాగంబున
నడురాజుపొట్టగుజ్జులుకనూఁదె
దక్షిగనెవ్వఁడు ఖడ్గధారాంచలంబున
నగ్నినాలుకలేదు వంటఁబట్టి

గీ. వాఁడనెవ్వాఁడు ముప్పదిమూఁడుకోట్ల
వేల్పులఁబారఁ బారవన్వెంటఁదగిలి
యట్టిశ్రీవీరభద్రుఁ డీయద్రిమీఁద
భద్రకాళియుఁదానుండుఁ బద్మనయన!

గీ. బ్రహ్మసంవేద్య మాదిగాఁబట్టిపాంత
మతివ! గోదావరీనదీహారమునకు
నడుమనాయకరత్నమై నలువుమిగులఁ
బంచలింగాశ్రయము వీరభద్రశిఖరి.

## కొవ్వూరు

గోదావరినదికి కుడిగట్టుననున్నది. గోవూరు అనియు, గోపాదక్షేత్రమనియు వ్యవహారముకలదు. గోవుపాదముల ఆనమాళ్ళు స్పష్టముగ కనిపించుచుండును. ఎంతనఱదవచ్చినను పూడవు.

## ధవళేశ్వరము

సుద్దగనులలో ఇచ్చటికొండ ధవళముగానుండు కారణమున దీనికి ధవళగిరియనుపేరుగలిగెను. అఖండ గౌతమి ఇచట ఖండఖండములైనది. ఇచ్చట పూర్వము నారదుడుఅనుఋషి నివసించుచుండెను. అతడే ఇచట కొండపై జనార్దనస్వామిగుడి కట్టించెను. ఈకొండపై

గల గుహాద్వారా కాశికి మార్గముకలదని చెప్పుదురు. ఈగుహలో కొండనివాసుడుఅనియు సంతానగోపాల స్వామిఅనియు పేరులుగల దేవతావిగ్రహముకలదు. సంతానముగోరుస్త్రీలు ఈస్వామిని సేవింతురు. ఈ కొండపైనుండి అఖండగౌతమిని, ఆనకట్లను చూడ వచ్చును. కొండదిగువను గోదావరిఒడ్డున ఆంజనేయ స్వామిఆలయముగలదు. అందు రెండు పెద్దరావిచెట్లు గలవు. అవి సీతారాములచే నాటబడినవని ప్రజల నమ్మకము. ఈగుడిలో రాతిపైచెక్కిన అడుగులు గలవు. అవి రామునిఅడుగులందురు. అందుచేతనే ధవళేశ్వరమునకు రామపాదక్షేత్రముఅను పేరు గలదు. ధవళేశ్వరమునందలి గోదావరీస్నానఘట్టమున 108 శివాలయములు మునిగియున్నవని చెప్పుదురు. పుష్కరకాలమున ఇచటికి ప్రజలు విశేషముగవత్తురు.

## బోడసకుఱ్ఱు

అమలాపురము తాలూకాలోనిది. గౌతమేశ్వరుడని ఇక్కడి ఈశ్వరుడు. దీనికి సమీపముననుగల చింతాడుగరువునందలి మడుగులో అర్జునుడు మత్స్యయంత్రమునుగొట్టెనని చెప్పుదురు.

## ముక్కామల

తణుకుతాలూకాలోనిది. ఖండవిల్లి ముక్కామల అందురు. ఈయూరికడ వసిష్ఠగోదావరియందలి స్నానఘట్టమును బ్రహ్మగుండములని చెప్పుదురు. ఇచ్చట బ్రహ్మయజ్ఞముగావించెను. వఱదదినములలో ఇచ్చటి గోదావరి సుడిగుండములతో అతిభీకరముగనుండును.

## మందపల్లి

రాజవోలుతాలూకాలోనిది. ప్రసిద్ధమైన పుణ్యక్షేత్రము. ఇచట మందేశ్వరుని ఆలయముగలదు. ప్రతి శనిత్రయోదశికి స్వామికి తైలాభిషేకముచేయుదురు.

## వాడపల్లి

వాడపల్లి వెంకటేశ్వరునిఆలయము గోదావరిమండలములందు ఎన్నికకెక్కినది.

## వ్యాఘ్రేశ్వరపురము

పూర్వము ఒక బ్రాహ్మణుని ఒకవ్యాఘ్రము తఱుముకొనిరాగా అతడు భయార్తుడై ఒక బిల్వ వృక్షమునెక్కి బిల్వదళమును మంత్రించి దానిమీద వేయగా ఆపులి శివలింగముగామారినది. ఆదేవునకు వ్యాఘ్రేశ్వరుడని పేరు.

## కోటిపల్లి

కోటిఫలిఅని నామాంతరము. ఇచ్చట ప్రవహించు గౌతమీగోదావరి మాతృగమనాపహారి అనుప్రసిద్ధి. సోమేశ్వరస్వామివారి ఆలయమున్నది. ఇచ్చటచేయు పుణ్యకార్యములు కోటిఫలముల నిచ్చునుగావున దీనికి కోటిఫలియను పేరువచ్చెను.

## తాపేశ్వరము

మునిరూపమును ధరించి మునులను విందునకుబిలిచి వారిని చంపుచుండిన వాతాపి, ఇల్వలుడు అనురాక్షసులలో వాతాపిని ఇక్కడ అగస్త్యుడు చంపెను. అందుచే దీనిని వాతాపేశ్వరమనుచుండిరనియు, క్రమముగా తాపేశ్వరమని వాడుకలోనికి వచ్చెననియు చెప్పుదురు.

## లక్ష్మేశ్వరము

ఇది నరసాపురమునకు రెండుమైళ్ళ దూరములో గోదావరిఒడ్డునకు సమీపమునఉన్నది. ఇచ్చట గాలిగోపురము ఏడుఅంతస్తులుగలది. దీనిపైనుండి చూచిన పాలకొల్లుగాలిగోపురము కనిపించునని చెప్పుదురు.

## రామేశ్వరము

లక్ష్మేశ్వరమునకు ఎదురుగా గోదావరికి ఆవలియొడ్డునఉన్నది. అహిమహిరావణులనుండి రక్షించి రామలక్ష్మణులను చెరియొక కావడికొమ్మునందును ఉంచుకొనివచ్చుచు ఆంజనేయుడు ఇచ్చట కావడిదింపెననియు, ఆయాకొమ్ములు దించినచోట రామేశ్వరము, లక్ష్మణేశ్వరము అను క్షేత్రములేర్పడినవనియు చెప్పుదురు.

## అంతర్వేది

వసిష్ఠగోదావరి ఇచట సాగరముతో సంగమించు చున్నది. సప్తసాగరయాత్రికులు సేవించు తుదితీర్థమిది. వసిష్ఠునిప్రార్థనచే ఇచట లక్ష్మీనరసింహస్వామి వెలసినాడు. ఈప్రదేశమున పూర్వము రక్తవిలోచనుడు అనురాక్షసుడుండెను. అశ్వారూఢాంబయనియు, గుఱ్ఱాలక్క అనియు వ్యవహరింపబడు స్థానిక స్త్రీదేవతయొక్క తోడ్పాటున లక్ష్మీనరసింహస్వామి ఆరాక్షసుని సంహరించెను. అంతర్వేదియందు గుఱ్ఱము నెక్కియున్న స్త్రీదేవత శిలావిగ్రహము నేటికినిగలదు. వసిష్ఠునికోరికపై లక్ష్మీనరసింహస్వామి అచ్చట ఉండుటకు నిశ్చయించి ఒకపుట్టలో దాగుకొనెననియు, ఒకగొల్లవానిగోవు తెలివిచే బయలుపడెననియు, కెండమూర్లంక పల్లెవాడీగుడి కట్టించెననియు చెప్పుదురు.

## శివకోడు

ఇచ్చటి శివాలయము రామునిచే నిర్మింపబడినదని చెప్పుదురు. రావణునిచంపిన పాపము పోగొట్టుకొనుటకు రాముడు కోటిశివలింగములను ప్రతిష్ఠించెననియు ఇచ్చటి ఆలయముతో కోటిపూర్తియయ్యెననియు, పూర్వము దీనిని శివకోటి అనుచుండిరనియు, పామర జనులనోటబడి అదిక్రమముగా శివకోడు అయ్యెననియు స్థానికప్రజల నమ్మకము.

## కోరంగి

సప్తసాగరయాత్రికులు సేవించు పవిత్రస్థలములలో నిదియొకటి. ఇచట ఆత్రేయసాగరసంగమము. ఆత్రేయుడనుఋషి తెచ్చిన గోదావరిశాఖ యిచట సముద్రమునుపొందినది. సీతారాముల పర్ణశాలలోనుండగా రావణునిచే పంపబడి మాయలేడివేషమునవచ్చిన మారీచుని రాముడు ఇచ్చట చంపెననిచెప్పుదురు. కోరంగీశ్వరస్వామిఅను ఇచటి శివునిఆలయము శ్రీరామునిచే ప్రతిష్ఠింపబడినది.

## పలివెల

కొప్పేశ్వరుని ఆలయము సుప్రసిద్ధమైనది.

## చొల్లంగి

కాకినాడకు ఆరుమైళ్లదక్షిణము. గోదావరిసాగరమున సంగమించు ఏడుతావులలోనొకటి. తుల్యఅను మునిచే గొనిరాబడి అతనిపేరుతో వ్యవహరింపబడు గోదావరిశాఖ ఇచ్చట సముద్రమునకలియుటచే దీనికి తుల్యాసాగరసంగమమని పేరు. సప్తసాగరయాత్రికులు సేవించు ప్రథమయాత్రాస్థలమిది.

## ముక్తేశ్వరము

క్షణముక్తేశ్వరమనియు అందురు. ఇచట పూర్వము ఒకఋషిభార్యను స్వర్గలోకవాసి బలవంతముచేసినాడట. దానికి ఋషి భార్యను శపించినాడట. అందు మీద ఋషిభార్య ఇచ్చట గోదావరియందుస్నానము చేసి శుచియై తపశ్చర్యకు దొరకొనెను. రావణసంహారము చేసి రాముడు అయోధ్యకుపోవుచు ఇచటకు వచ్చి ఈమెతపశ్చర్యకు జాలినొంది ఈశ్వరునిచే ముక్తినిప్పించెను. ముక్తేశ్వరమునకు చెంతగలఅయినవిల్లిలోని సిద్ధివినాయక దేవాలయము సుప్రసిద్ధమైనది. ఈదేవాలయము శివునిమామయగు దక్షునిచే దాక్షారామములో తాను యాగముచేయుటకు పూర్వము కట్టబడినట్లు చెప్పుదురు.

# గోదావరినామవివరము

(ప్రాచీనకవి) తాడూరి కృష్ణశాస్త్రి

గౌతమునిపేర నదిగాంచె గౌతమీనా
మాఖ్య గోదార్థమాగత యగుటజేసి
యవని గోదావరీసమాహ్వయ మశేష
భువనము లెఱుంగధాత్రి నప్పుణ్యతటిని.

# గోదావరిశాఖలు

## ఏడు పాయలు

ఇంద్రావతి, ప్రాణహిత, మంజర, కిన్నరసాని, శబరి మొదలగు ఉపనదుల ప్రవాహజలములతో పరిపుష్టినొంది రాజమహేంద్రవరమున అఖండత్వమున అమరిన గోదావరీమహానది ధవళేశ్వరముకడ ఏడు పాయలుగా చీలి సముద్రమును పొందినది. గౌతముడు గొనివచ్చిన గోదావరిని ఏడుగురుఋషులు ఏడుస్థలములయందు గోదావరీజలమును సముద్రములో సంగమించునట్లు చేసిరి. గౌతముడే గొనిపోయినశాఖకు గౌతమియని పేరు. ఈశాఖ గోదావరియ్రగమువద్ద సముద్రమునబడుచున్నది. తుల్యుడు, ఆత్రేయుడు, భరద్వాజుడు, కౌశికుడు, జమదగ్ని, వసిష్ఠుడు అను మిగిలిన ఆర్గురుఋషులు గొనిపోయినశాఖలు వారివారి నామములతో బరగుచున్నవి. కాకినాడకు ఆఱుమైళ్ల దక్షిణమునున్న చొల్లంగిచెంత తుల్యుడుగొనిపోయిన శాఖ సాగరమున సంగమించుచున్నది. కోరంగికి సమీపమునయున్న మసకపల్లిచెంత ఆత్రేయుడు గొనిపోయినశాఖ సముద్రమును పొందుచున్నది. భరద్వాజుడు గొనిపోయిన గోదావరిపాయ అమలాపురము తాలూకాలోని గుత్తినదీవి సివారు తీర్థాలమొండియను చోట సముద్రమునబడుచున్నది. కౌశికుడు గొనిపోయిన గోదావరిపాయ ఇపుడు అమలాపురము తాలూకాలోనున్నది. దాని సాగరసంగమ మిపుడు కనిపించదు. అమలాపురము తాలూకాలోని సామంతకుర్రుసివారు గుడిమూలరామేశ్వరము కౌశిక సాగరమును పొందినస్థలమని చెప్పుదురు. జమదగ్ని గొనిపోయిన గోదావరిశాఖను జమదగ్నిఅనియు, వృద్ధగౌతమిఅనియు నందురు. దీనిసాగరసంగమముకూడ ఇపుడు కానరాదు. తీర్థాలమొండికి దగ్గరగ నేయున్న కుండలేశ్వరము వృద్ధగౌతమి యనబడు జమదగ్ని సాగరమున కలిసినతావుఅని వచింతురు. వసిష్ఠునిచే గొనిపోబడిన గోదావరిశాఖ అంతర్వేదివద్ద సముద్రమును పొందుచున్నది.

## సాగరసంగమములు

ఈయేడు సాగరసంగమములును ఉభయగోదావరి మండలప్రజలచే అతిపవిత్రముగ నెంచబడుచున్నవి. ఈయేడు స్థలములకువెళ్ళి స్నానముచేసి వచ్చుటయే గోదావరిమండలములందు సప్తసాగర యాత్ర యని వ్యవహరింపబడుచున్నది. సంతానముగోరు ఆమండలపు స్త్రీలు సప్తసాగరయాత్రచేసి తీరుదురు. ఈ పుణ్యమున గలిగిన సంతానమునకు 'సాగరము' అను పేరుపెట్టుటయు గలదు. ఈఏడుపాయలలో తుల్యను గూర్చి ఒకచిత్రకథగలదు. విన సొంపుగ నుండును గావున అది ఇచ్చట వివరింపబడుచున్నది.

## తుల్యభాగకథ

తుల్యభాగుడను దైత్యుడు. పరమార్థతత్త్వజ్ఞుడై పక్షపాతములేక సురాసురులకు మాధ్యస్థ్యము వహించి వివాదములు తీర్చుచుండుటకు సమర్థుడైయుండుటచే అతనికి తుల్యభాగుడని పేరు సార్థకమయ్యెను. ఆతుల్యభాగుని పేరను అతనిశాఖకు తుల్యభాగయను నామము కలిగెను. అనది గౌతమికి కూర్మికన్యక. దానితీరమున దైత్యమునులు తపము గావించుకొనుచుండిరి. ఇట్లుండ ద్రాక్షారామభీమేశ్వరసామి లగ్నవేళకు సప్తమునులు గొనిపోవుచుండు నది తుల్యభాగాప్రాంతమునగల దైత్యమునుల ఆశ్రమములను ముంచెత్తుచు ప్రవహించెను. అప్పుడు దైత్యమునులును, సప్తమహర్షులును పాకముతప్పినట్టి పటుకోపములతో వాక్కాటుకకుజొచ్చిరి. కలహవాక్యములు శాపవాక్యములుగమారెను. దానవమునులు సప్తర్షిసమానీతయైన వాహిని శుష్కతోయ యగునట్లును, మునులు దానవులకు సమాశ్రయమైన తుల్యభాగానది అపూజ్యయు, అస్పృశ్యయు అగునట్లును శపియించిరి. అప్పుడు ఆతుల్యభాగమహామునీంద్రుడు సప్తర్షులకును, దైత్యమునులకును మ్రొక్కి వారి మ్రోలనిలిచి సరసతో వాదించి యిరుదెఱంగులవారిని వారించి 'మీకు కోపమువలదు. సర్వసర్వంసహాభువనపావనులై పుణ్య

నదులను శపియింపదగునా? తపోధనులైన మీకు క్రోధముకూడదు. శాపగరళాక్షరములు క్రమ్మఱింపుడు?' అని ప్రార్థించెను. ఆప్రార్థనకు ఉభయులును శాంతులైరి. ఇట్లు చెప్పిరి. 'మాపలుకు అమోఘమైనది. క్రమ్మఱుపరానిది. నీవు చెప్పిన హితమునుపలక్షించి వేఱొకటిని మేలు చేయుదుము.' దైత్యమునులు సప్తముని సింధువునకు నంతఃప్రవాహమును, మునులు తుల్యభాగకు నుత్తరాయణదక్షిణాయన పుణ్యకాలములను, సూర్యచంద్రగ్రహణములను, ప్రతి భానువారమునను, దర్శపౌర్ణమాసప్రభృతిమహాపర్వకాలములను, సంక్రమణములు మొదలైన విశేషకాలములను స్నానదానజపతపహోమశ్రాద్ధదేవార్చనా విధానము లక్షయఫలములగునట్లుగాను పతిసమేత సతికి రజస్వలాత్వాద్యంతరాయము లేక అధశ్శయన బ్రహ్మచర్యోపవాసనియమములతో భానువారచతుష్టయము స్నానము సిద్ధించిన సంతానప్రాప్తియౌనట్టుగను వరముప్రసాదించిరి. (భీమేశ్వరపురాణము.) తుల్యభాగయను నామాంతరముగల తుల్యానది మహో గౌతమి సప్తశాఖలలో నొకటి. ప్రతిసంవత్సరమును పౌషబహుళామావాస్యనాఁడు కాకినాడచెంతనున్న 'చొల్లంగి' యనుగ్రామమునకుఁ దుల్యాసాగరసంగమస్థలమున నవగాహనము సేయవచ్చు వేలకొలఁది యాత్రికులకు తుల్యానదీప్రభావము వినికికెక్కినదే. ఇప్పుడానది ఖండఖండములై, కొన్నిస్థలములయందు రూపాంతరమును బొందినను పూర్వకాలమున నిరర్గళప్రవాహయై వాణిజ్యోజ్జీవికయైయుండెను. ఈమధ్యకాలమున నాంగ్లేయప్రభువులవలనఁ ద్రవ్వింపఁబడిన కుల్యలు ప్రజలకు మహోపకారములైనపిదపఁ దుల్య కొన్నిచోట్లఁ గేవలము మురుఁగుఁగాల్వగా నుపయోగింపబడుచున్నను, బ్రజలకుఁ దానియెడలఁగల గౌరవభావము నశించిపోలేదు. వైశాల్యమునఁ దుల్య కుల్యతో బోల్పదగినదియైనను క్షీణనదియైయుండెను. వంకరటింకరగనుండుటచే సాకల్యస్వచ్ఛందవిహారమున కనువుగ లేకున్నను అది చాలలోఁతుగలది. ఇప్పటికిఁ గూడఁ బర్వదినములయందనేకులు క్షుద్రస్వరూపయైపోయిన యీనది యందవగాహనమొనరించి విముక్తపాపులగుచుందురు. (శ్మశానవాటిక.)

## వైనతేయ

గోదావరిశాఖలలో నిదియొకటి. వసిష్ఠగోదావరినుండి విడివడుచున్నది. వైనతేయ ఇపుడున్న గోదావరిశాఖలలో పెద్దవానిలో నొకటియైనను సప్తశాఖలలో చేరదు. వైనతేయుడని ఋషి వసిష్ఠునితో చెప్పకుండ వసిష్ఠగోదావరినుండి జలమును దొంగిలించుకొని పోయెననియు, దానికికోపగించి వసిష్ఠుడు వైనతేయ అస్పృశ్యయగునట్లు శపియించెననియు, వైనతేయుని విశేషప్రార్థనమున పర్వకాలములందలి అందలిస్నానము పుణ్యప్రదమగునని శాపమునకు ఒక్కింత మఱుపాటు కలిపించెననియు చెప్పుదురు. వైనతేయగోదావరి బెండమూరులంకదగ్గఱ సాగరముతో సంగమించుచున్నది.

## దేవి!

పురాణము కుమారరాఘవశాస్త్రి గారు బి. ఏ.

ఆనాడునాయింట నడుగుపెట్టితివి,
మబ్బులన్నీ విచ్చి మాయమైపోయె
ఎక్కడిచీకటి అక్కడేసమసె
దుఃఖదేవత నన్ను తొలగియేనడచె.
పెదవిపై వెన్నెల వెలగించినావు,
నిశ్శబ్దమే రాగనియతిఁబాడినది

అరవిచ్చిచిరుపూలు పరిమళించినవి
చిరునవ్వునాయింట చిందులాడినది.
పూలుగ్రుచ్చినాకు మాలవేసితివి
మోమునందున భానుముద్రదాల్చితిని
నేత్రంబు లెఱ్ఱనై నిగ్గు దేరినవి.
వీరరక్తముపొంగి విఱ్ఱవీగితిని.

# రాజమహేంద్రపురము

సీ. కమలాచలాగ్రమార్కండేయశివశిరశ్శశిచంద్రికాధౌతసౌధవీథి
గోదావరీపుణ్యకూలంకషాజలస్ఫారితశ్రీరుద్రపాదయుగళి
బలవదభ్యున్నతప్రాకారపరివేషగండూషితాజాండమండలంబు
గంధదంతావళగ్రైవేయఘంటికాఠంకారముఖరఘంటాపథంబు
రాజబింబాననానూత్నరత్నపేటి
వీరరాహుత్తసుభటకంఠీరవాద్రి
వేమభూపాలరాజ్యాభివృద్ధికరము
సాంద్రవిభవంబు రాజమహేంద్రపురము.

సీ. ఉండునేవీట మార్కండేయమునినాథసజ్జలింగముసంగ శాసనుండు
ప్రవహించునేవీటి పశ్చిమప్రాకారమొరసి గంగమ్మసాగరముకొమ్మ
యావర్ణవించినా డేవీటికోటలో బలభేదిమదనగోపాలమూర్తి
పాలించునేవీటి ప్రాగుదక్కోణంబు నుమతోడి శ్రీముల్లగూరిశక్తి
ప్రబలధారాసురత్రాణభద్రజాతి
కరిఘటాసైన్యదుస్సాధకనకలోహ
గోపురద్వాఃకవాటప్రదీపితమతి
సాంద్రవిభవంబు రాజమహేంద్రపురము.

—శ్రీనాథమహాకవి.

మ. కురువంశాంకుర మేముహూర్తమున శంకుస్థాపనంజేసెనో
పురముంగట్టును రాణ్నరేంద్రుడు మఱేమూర్తంబునం గావ్యమున్
విరచింపం గవి నన్నభట్టు పనుపుంబిల్లారిబూజించెనో
సిరియున్ వాణి వసింత్రు నేఁడుఁజెలిమిన్ శ్రీరాణ్మహేంద్రమ్మునన్.

—వడ్డాది సుబ్బారాయకవి.

ఉ. శైవలినీమతల్లియని సర్వజగంబులఁ బేరుగొన్న గో
దావరియెల్లకాలమున దత్పరతన్నిజభంగసంగతిన్
బావనభూమిగాఁ జలుప భాసిలు రాజమహేంద్రపట్టణం
బీవసుధాస్థలంబున మహేంద్రునిపట్టణమట్టులొప్పెడున్.

—కవిరాజు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి.

# డార్లింగుకన్య

శ్రీమతి ని. సీతారామదేవిగారు

గ్రేసుడార్లింగు ఒకఆంగ్లేయబాలిక. ఈమెతండ్రి ఇంగ్లండులో సముద్రపుఒడ్డున ఒక లైటుహౌసునకు పరిశీలనాధికారియై నివసించుచుండెను. ఒకనాడు రాత్రిసమయమున సముద్రములో పెద్దతుపానువీచి దాదాపు మైలుదూరములో ఒకనౌక విచ్ఛిన్నమైనధ్వని వినిపించెను.

డార్లింగుకన్యయున్ను ఆమెతల్లిదండ్రులును ఆనౌకవిషయమై మాట్లాడుకొనుచు, పాపము అందలియాత్రికులు ఏమయినారోయని విచారించుచు ఆరాత్రిఅంతయుగడిపినారు. చివరకు ప్రాతఃకాలమాయెను. సూర్యకాంతి నలుదిక్కులప్రసరించెను. అప్పుడు డార్లింగు కన్య దూరదర్శినియంత్రంతీసుకొని లైటుహౌసుమీదకుఎక్కి సముద్రములో నలువైపుల చూచి, చాలాదూరమున సముద్రములో ఒకకజ్జనుఆశ్రయించుకొని తొమ్మిదిమందియాత్రికులు మృత్యుదేవతకొరకై ఎదురుచూచుచుండుటనుగ్రహించినది.

అంత ఆమెమనసు కరిగిపోయెను. ఆయాత్రికులందరును కొంచెముసేపటికి తుపానుయొక్క అలలవలన అంతెమొందుదురని నిశ్చయించుకొని ఏవిధముచేతనైనను వారిప్రాణముల రక్షింపవలెనని ఆవీరబాలిక సంకల్పించుకొనెను.

తలిదండ్రులు ఈమెసంకల్పము తెలుసుకొని కూతురుకు అనేకవిధములచెప్పిచూచిరి. కాని ఆమె వీరిమాటలు లక్ష్యపెట్టలేదు. చివరకామె వారితో, నాకు తోడులేకపోయినను, నేను ఒంటరిగానైనను, నావపై వెళ్లి వారినిరక్షించుటకు ప్రయత్నింతునని గట్టిగాచెప్పెను.

సముద్రమునందలి బీభత్సముగుతుపానును, కూతురి స్థిరసంకల్పమును చూచి తలిదండ్రులకేమియుతోచలేదు. కూతురుకు ఎంతచెప్పినను లాభములేదని తెలుసుకొన్నారు. వారు వెంటనే నావనువదలినారు. వీరజనకుడు వీరపుత్రికతోకూడ యాత్రికులరక్షించుటకు పయనమయినాడు.

బహునేర్పుగా సముద్రములో తుపానుతోయుద్ధముచేయుచు వీరిరువురును ప్రాణముల రక్షించుకొని యాత్రికులదగ్గరకు చేరుకొనిరి. భగవదనుగ్రహమువలన వీరు ఆయాత్రికుల నందరిని తమనావపై ఎక్కించుకొని ఒడ్డునకుచేర్చిరి. మృత్యుముఖమునుండి బయటపడిన ఆయాత్రికులు వీరికి అనేకధన్యవాదములర్పించిరి.

ఈఘనకార్యమొనరించినందువలన డార్లింగుకన్యపేరు దేశమంతటను వ్యాపించినది. ధనికులనేకులు ఈమెనుకొనియాడుచు గొప్పధనరాసులు కానుకగాసమర్పించిరి. దూరదేశము నుండి అనేకులీవీరబాలికాసందర్శనమునకై వచ్చియుండిరి. ఇదిజరిగిన నాల్గుసంవత్సరములకే ఈమెను మృత్యుదేవత కబళించెను.

# చదువరుల సమాధానములు

"శ్రీమతి తూతిక కమలాంబగారు వ్రాసిన నవనాగరికము పురుషులనుగూర్చియని తోచుచున్నది. సాధారణముగా స్త్రీలలో మల్లుబట్టలు కట్టువారు అరుదు. మరియు 'కులవిసర్జిత దెల్పు తిలకంబులను దూని-రిక్తముఖాల వర్తించువారు' అన్న దానినిబట్టి హిందువులలో పుణ్యస్త్రీలు కుంకుమ లేకుండనుండుటలేదు. అదియునుగాక ఆయాజాతి స్త్రీలు, వారి కులాచారప్రకారము ఉడుపులను కచ్చబోసి కట్టుచునేయున్నారు. కనుక ఈపద్యవ్యాసము పురుషులకు చెందినట్లు తోచుచున్నది."

— నాయని హనుమాయమ్మ.

"పుష్పచయము" లోని "పురుషధర్మములు" అను వ్యాసమునందలి కొన్ని యభిప్రాయములతో నే నేకీభవింప జాలకున్నాను. సతి నిర్దోషియగుచో పురుషుని గుణములు ఆమెకు ఖ్యాతిని తేవచ్చును ఆమె దోషములకున్నయగుచో అతని గుణము లామెకు ఖ్యాతిని తేజాలవు. తలిదండ్రులు నిర్ణయించినవరుడు తనకు నచ్చలేదని వధువు స్పష్టముగా వారితో చెప్పుచున్న యీకాలమున, వారు నిర్ణయించిన వధువును తానంగీకరింపజాలనని తన తండ్రితో చెప్పుటకు వరుడు భయపడరాదు. సతి దుర్మార్గురాలని పురుషుడు ఇతరులతో చెప్పకయుండవచ్చునుగాని మనస్సునందుంచుకొనకుండుట కాతని కెట్లు సాధ్యము? "సతి కోరినపని మంచిదైనయెడల పురుషుడు దానిని చెల్లించుచుండవలెను" అనినచో బాగుండెడిది. పడక శుభ్రపరచుపని సతిది కావున పురుషునికి పడక శుభ్రముగ నుంచుటను విధింపరాదు. పురుషుడు పడకటింట శుచిగను సంతోషముగను నుండినచాలును; షోకుచేసుకొన నవసరములేదు. సతి చేయు తప్పులను పురుషుడామెకుచూపుచు, అట్టి తప్పుల నామె మరల చేయకుండ జూచుటకు సర్వవిధముల కృషిసలుపుట అతనిధర్మము. కావున "పురుషుడు భార్యచేయు తప్పులను కలనైన తలంచకుండుట" కు వీలు కాన్పింపదు. సతి దుర్మార్గురాలగుచో ఆమెను పతి ప్రేమించినంత ఆమె యాతని ప్రేమించునని నమ్మజాలము. ఈ నా యభిప్రాయములను తెలుపుటలో వ్యాసకర్త నాక్షేపించు తలంపెంతమాత్రము లేదని మనవిచేయుచున్నాను. శ్రీమతి బొడ్డు సీతామహాలక్ష్మిగారు తమ "చిన్నిచెల్లాయి"కిపవిత్రచరిత్రయను సావిత్రి పేరుపెట్టినారు. ఆమె అభిజ్ఞకు చందనపుబొమ్మ, కర్రగుఱ్ఱము, గిలకపండు, బొంగరము, పేడబొమ్మ, పీటలు, చెంబులు మొదలగు దేశీయములగు ఆటవస్తువులనిచ్చి ఆడించి వాటియందు మోహమును బుట్టించినారు. ఖాకెండా చేతికిచ్చి అభిజ్ఞను ఉగ్గుపాలతో దేశభక్తిని నూరిపోయుచు "గాంధికిజై" యనిపించి దేశోద్ధారకులపట్ల ఆదరమును కలిగించినారు. శ్రీమతి కమలాంబగారి "నవనాగరికము" లోని "నవనాగరికులు" పురుషులని నాయూహ."

— గరికిపర్తి సీతామహాలక్ష్మమ్మ.

"పురుషధర్మములందలి యభిప్రాయములతో నే నేకీభవింతును కాని ఈపురుషధర్మములప్రకారము నడచువారు చాలతక్కువ. ప్రస్తుతసాంఘిక పరిస్థితులనుబట్టి చూడ మనదేశమున సమిష్టికుటుంబముల పద్ధతిని నిలువజాలదనుట నిర్వివాదాంశము. ఇక్కాలమున నెవరిమట్టున వారేస్వేచ్ఛగానుండుట కిచ్ఛగింతురు. అత్త మొదలగు పెద్దలెవరైనన్నున్న వారిపూర్వాచారనియమములకు కట్టుపడనిచ్ఛగింపక పడుచులు పెద్దలనిన నేవగింతురు. మీదుమిక్కిలి పెద్దలెవరైన హితము చెప్పినను అహితముగ తోచును. అట్టి ఇక్కాలమున సమిష్టికుటుంబపద్ధతిని నిలుపజూచుట చాలకష్టము. కాని సమిష్టిగానుండక విడిపోవుకుటుంబములకు చాల నష్టములుగలవు. వేరుపడినవారు తమకేదైన నాపద తటస్థించునపుడుగాని, రోగపీడితులైయున్నప్పుడుగాని తమ ఏకాకిజీవనమునకు దుఃఖితులగుదురు."

— పాకల శ్రీలక్ష్మీకామేశ్వరి.

"పురుషధర్మములు బాగుగ నేయున్నవిగాని భార్య విషయమై జెప్పిన బుద్ధులు అంతగా నచ్చుటలేదు. విద్యావంతురాలగు భార్యయగుచో వారంతగా భార్యను గూర్చి వ్రాయ నవసరములేదు. 'ఆ అదృష్టవంతుడెవరో?' ప్రస్తుత సాంఘిక పరిస్థితుల ననుసరించియు, ఆర్థికత్వమునుబట్టియు, నవీనకాలమునుబట్టియు అర్థశాస్త్రానుసారము హిందూదేశమున సమిష్టికుటుంబములు పనికిరావు. సమిష్టికుటుంబములో ప్రయోజకుడొకడుండి, పోషించుచుండిన మిగిలిన వారికి ఆర్జనయందంత బాధ్యతయుండదు. జీవనమునకుకూడ స్వాతంత్ర్యత తగ్గును. 'నవనాగరకము' ఇది చాలవరకు నవనాగరకులగు మగవారికే చెందును. కాని కొంతవరకు Uptodate Modern girls న్న Bobbed hairs గలవారికిని చెందవచ్చును."

—రె. ల. న. మూర్తి.

"చిన్నిచెల్లాయి అపుడపుడు 'గృహలక్ష్మి' నలంకరించుచున్న 'పదకొండుగురు పాపాయిల పగడాల హారము'నకు శ్రీమతి బొడ్డు సీతామహాలక్ష్మిగారు మెఱుఁగుపెట్టి చిన్నిచెల్లాయికిఁ గంఠహారముగఁ బ్రసాదించిరి నవనాగరకము ముఖ్యముగఁ బురుషులఁ గూర్చియే యనుటకు సిగ్గగుచున్నది. ఒకటిరెండు విషయములందు స్త్రీలకు తావున్నను అందులకుఁ గారణభూతులు పురుషులేయనుటకు మఱింత సిగ్గగుచున్నది."

—అయ్యగారి సూర్యనారాయణమూర్తి.

"శ్రీమతి సమయమంత్రి రాజ్యలక్ష్మిగారు వ్రాసినట్లు సమిష్టిగానుండుట లాభప్రదమే గాని పూర్వము స్త్రీపురుషులు వీరు వారలనెడి భేదములేక సమాన సోదరప్రేమ గలిగి యుండెడివారు. దూరపు బంధువులైనను వారి యాత్మీయులవలె ప్రేమించుచుండెడివారు. పూర్వపు స్త్రీలకు దయాభావము, ఓర్పు, పతిభక్తి, వినయము మొదలగు సద్గుణములుండెడివి. పురుషులకు సంసారబాధ్యత, దైవభక్తి, దానధర్మములు మొదలగు సద్గుణములుండెడివి. దుర్వ్యసనములుండెడివికావు. కాని ఇప్పటి స్త్రీలు తల్లినిచూచి కూతురోర్వలేదు. కొడుకునుగనిన తండ్రికి అసహ్యము. ఇరువురన్నదమ్ము లొకయింటనుండి ఒకపంట పెట్టుకొనుట సాధ్యము. వారివారి భార్యలు చెప్పెడి మాటలు వినియో లేక వారిదుస్స్వభావములవలననో జగడమాడి వేరుపడుదురు. ఇట్లు జగడమాడి వీధి కెక్కి విభక్తులగుటకంటె ముందుగనే మేల్కొని విభక్తులై పరస్పర సౌహార్ద్రములు వీడకుండుట మేలు గదా? ఇప్పుడైనను పూర్వపు స్త్రీలవలె కారుణ్యము, క్షమ, దైవభీతిగల స్త్రీలును; దైవభక్తి, దయ, ఓర్పుగల పురుషులును లేకపోలేదు. ఐనను అట్టివారు నూటికొక్కరు. సమిష్టికుటుంబమునందలి స్త్రీపురుషులొకరియెడ నొకరసూయాపరులై, స్వార్థపరులైనున్న యెడ నాకుటుంబస్థితిగతులు నరకముకంటె భయానకమై యుండును. గాన సమిష్టి కుటుంబీకులై యుండవలెనని శ్రీమతి రాజ్యలక్ష్మిగారు వ్రాసినట్లు "అందలి యజమానులు తక్కినవారికందరకు తాము నౌకరులమనియు, తాము వారికి సేవజేయుట పరమార్థమనియు తలంపవలెను." అనెడి మొదలగు సద్గుణము లలవడజేసికొనవలెను. అందు ముఖ్యముగా నీ సద్గుణములను స్త్రీ నేర్వవలెను. ప్రస్తుతసాంఘిక పరిస్థితులలో ఈదేశమున పైవ్రాసిన సద్గుణములు స్త్రీపురుషులు నేర్చినగాని సమిష్టి కుటుంబములపద్ధతి నిలువజాలదు. సమిష్టికుటుంబముల పద్ధతి నిలుపుట వాంఛనీయమే గాని శ్రీమతిగారు వ్రాసినట్లు స్త్రీలు అన్యోన్యసహనమలవడ జేసికొనిననేగాని అట్లుకానియెడల నాకుటుంబస్థితిగతులు ఘోరముగా పరిణమించునని మదభిప్రాయము. పూర్వము సమిష్టికుటుంబము గల్గియుండుటవలన బీదసాదలు బ్రతుకగల్గిరి. ఒకరికొకరు కష్టకాలములందు తోడ్పడుచుండిరి. ఇప్పుడో కూతునకు కష్టము కల్గిన తల్లి తొంగిచూచుట లేదు. తండ్రి చావుబ్రతుకులలోనున్న కొడుకు ఖేదపడుటలేదు. అట్లుండువారరుదు. ఇట్లు కష్టకాలమున యాత్మీయులే చూడనప్పుడు పైబంధువులును, స్నేహితులును చూచెదరన్న నమ్మకమేమి? వచ్చి చూడలేదన్న కోపము మనమున

నుండుటవలన ద్వేషాసూయలు పెరిగిపోవును. అదియే చివరకు కలహమునకుగూడ పురిగొల్పును. కాన సమిష్టిగా నుండుటయే మంచిది. కావున సోదరీమణులెల్ల శ్రీమతిగారు వ్రాసిన సద్గుణములలవడజేసికొని పురుషులను సమిష్టికుటుంబములకుగాను పురికొల్పి పూర్వమువలె మనదేశమున సమిష్టికుటుంబములపద్ధతి నిల్పుటయే మంచిదని నాయభిప్రాయము. శ్రీమతి తూతిక కమలాంబగారు వ్రాసిన "నవనాగరికము" అను పద్యవ్యాసము స్త్రీపురుషు లిద్దరిగూర్చి అయియున్నది. "నవమలాయము ప్రగూర్చు చల్దియన్నమువాని, పసలేని యుప్మాల మెసవువారు" అనునది స్త్రీపురుషు లిద్దరకును చెందియున్నది. ఇట్లే పద్యమంతయు స్త్రీపురుషు లిద్దరకును చెందియున్నది."

— పాకల చంద్రకాంతామణి.

"శ్రీ చౌదరిగారి "పురుషధర్మములు" అను వ్యాసములో పూర్తిగా నే నేకీభవింపను. "సతికోరినపనికి మారుచెప్పక నద్దాని చెల్లించుచుండ" నవసరములేదు. ఆపని మంచిదో చెడ్డదో ఆలోచించి మంచిదైననే దాని నాచరింపవలయును. ఆపని చేయకూడనిదైనచో శాంతముగా హితోపదేశము చేయవలెను. "వినయముతో ప్రార్థించుట" పురుషధర్మవిరుద్ధము. మొత్తముపైన నీవ్యాసము చదివిన ప్రతివారికిని పురుషులపై స్త్రీల కధికారముండవలెనని శ్రీ చౌదరిగారి యభిప్రాయమని తోచకమానదు. ఈవిషయమున శ్రీ చౌదరిగారితో నే నేకీభవింపను. గృహకృత్యములయందు నిమగ్నురాలై యుండు స్త్రీకి లోకజ్ఞానము తక్కువగానుండుట సహజము. అట్టి స్త్రీలకు సర్వాధికారములుండుటతగదు. కాన పురుషుడు తాను చేయదలంచుకొన్న పనికి తనసతి యంగీకరింపనిచో అందలి మంచిచెడ్డల నామెకు బోధపరచి ఒప్పించవలెను. అప్పటికిని ఒప్పుకొనకున్నచో పురుషు డాకార్యమాచరింపవలెననియే నాయుద్దేశము. అంతేకాని "వినయముతో ప్రార్థించుట" అక్కరలేదు. మన పూర్వులు పతియే దైవమని చెప్పగా శ్రీ చౌదరిగారు దానిని తారుమారుచేసినారు. ఇది పాశ్చాత్యవిద్యాప్రభావము కాబోలు. శ్రీమతి బొడ్డు సీతాలక్ష్మిగారి "చిన్నిచెల్లాయి" అను పద్యవ్యాసమునగల పారస్యమేమన:— చుట్టునుగల చిత్రములను సరిగావర్ణించుచునటుల పద్యము వ్రాయుటయే. శ్రీమతి తూతిక కమలాంబగారు వ్రాసిన "నవనాగరికము" అను పద్యము స్త్రీలనుగూర్చికాదు. ఏలనన:- స్త్రీలకు "క్రాపింగు" ఉండదు. స్త్రీలలో తిలకము కులవివక్షతను తెలుపదు."

—గొల్లకోట బుచ్చిరామశర్మ.

"చదలవాడ నాగభూషణరావుచౌదరిగారి పురుషధర్మములు అనువ్యాసమును క్రింది చిరుమార్పులతో స్త్రీధర్మములు అని పేరిడిన బాగుండునని నాఅభిప్రాయము.—"నీకు పనిలేనప్పుడు పరులదోషములెంచుట కొరకాదు. పరులసద్గుణముల నెంచుచుండుము. ఉత్తమస్త్రీచరిత్రలు చదువుచుండుము. నీవు చేతిపనులు నేర్చియుండుము. పొరుగిండ్లకు పనిలేక వెళ్ళకుము. వారికి సమయముగానియప్పుడు నీయందు అలసభావముకలుగును. నీయెదుటివారు సంపదగలవారైన సంతోషింపుము. నీకితరులు చేయుకీడును మఱచిపొమ్ము. కుటుంబముపై సమబుద్ధినుంచుము. ఇతరులతో మాటలాడునపుడు అనవసరసంభాషణచేయక మితముగా నిజమైనమాటలాడుము. మాటలవల్లనే మంచిచెడ్డలు కలుగును. పతిలేనియింట భార్యకు సౌఖ్యమెక్కడిది? పుట్టింటివారెంత ధనికులైనను పలుమాఱచ్చటకు పఱుగెత్తకుము. నీసుగుణమే నీపతికి ఖ్యాతినిచ్చును. వెలగలబట్టలు నగలు పెంచుకొనక మంచినడవడికయే ముఖ్యమైన అలంకారమనుకొనుము. నీతలిదండ్రులు కట్నములకాసించి నీకు వివాహముచేయ నిశ్చయించినప్పుడు ఆపతిపై నీకిష్టము లేనియెడల భయముచే తండ్రికి చెప్పకపోయినను తల్లితోనైన చెప్పుము. చెప్పకపోతివేని ఎల్లకాలము పరితపించుచుండెదవు. నీవొకమంచికార్యము చేయునపుడు మూఢస్త్రీలు నిందించినను నిరుత్సాహపరచినను విడువక చేయుచుండుము. అధికజనులు మెచ్చవలెననుకోరిక యుంచుకొనకుము. ప్రతిమాటకు నవ్వకుము. చిన్నలైనను సేవాపరులయెడ గౌరవము

చూపుము. పెద్దఱికపున మాట్లాడకుము. నీకు దుఃఖము వచ్చినప్పుడు గొల్లునఏడ్వకుము. ప్రతిస్త్రీయును నీతివాక్యములను నీహితులకుపదేశించి వారు మంచి వారగునటుల పాటుబడుచుండుము. ఇహసౌఖ్యము నకు పతినిమించినవారెవరును లేరని భావించవలెను. పతి దుర్మార్గుడైనయెడల హితవచనములతో సన్మార్గమునకు త్రిప్పవలెను. దుర్మార్గుడని మనమునందుంచు కొనుటగాని ఇతరులతో చెప్పుటగానికూడదు. పతి యొక్క సుగుణములను తలంచుకొని సంతోషించ వలెనుగాని దుర్గుణముల తలంచుకొని విచారింపకూడదు. తనపతి చిరాయుష్మంతుడు సూవృతవాది గా నుండుటకై దేవునిప్రార్థించుట ఉత్తమ స్త్రీలధర్మము. పతిదొంగిలించమనిగాని అనృతమాడమనిగాని దేవుని ప్రార్థింపవలదనిగాని చెప్పినయెడల అపట్టున వినయముతో అది తగనిపనియని ప్రార్థించి మానుకొనవలెను. పతిపక్షకటింటికి వచ్చునప్పటికి పడక శుభ్రముగనుంచి తానుసుఖురాయి పాకుజేసికొని చిరునగవులో ఎదు ర్కొనవలెగాని సంసారబాధలుచెప్పుచు ఎదుర్కొనగూడదు. నీపతిచెడుత్రోవ త్రొక్కినేని నీతివర్తనమునెడు దివ్వెచే అతనిని మంచిమార్గమునకు తోడితెమ్ము. నీపతిని నీవెంత ప్రేమించెదవో అతడు నిన్నంతకంటె నెక్కువగ ప్రేమించుచుండునని నమ్ముము. నీపతి కోపిష్టియైనయెడల ప్రియవచనములచే అతనిని చల్లార్పుము." —డాక్టర్ యస్. శేషగిరిరావు.

# ప్రేమభిక్షువు

ఏటుకూరు వేంకటనరసయ్యగారు

రమణీ! నీహృదయాంధకారంబు రేగి
కన్నుదమ్ములనింకెనే కజ్జలముగ
దుఃఖతోయధి కడలెల్లఁదొణకనేమొ?
బిందు శేషంబుగా జెప్పలందునురలె.
లలన! నీకోరికలు నిష్ఫలంబులగుచు
శ్వాసముఖమున వెలికి రాసాగెనేమొ
అంతరికనేత్రములఁగాంచి హర్షమొంద
పోఁతఁబోసితి హృదయసంపుటమునెవని.
చింతనాపుష్పములఁ బూజసేయుసాగి
అదనుగాదిది ప్రియునియేకాంతసేవ
కడ్డనివచింపగాలేని యంతరాత్మ
భ్రూలతావక్రమానసంపూర్తిఁజేసె.
తానుమనసావరించు సుందరునియందు
రమణికిఁగలట్టి గాఢానురక్తిదెలుపు
నిబిడనిశ్వాసపవననిర్నిద్రమగుచు
ఏమరకనిల్పిచూచు తదేకదృష్టి
అక్కటా? మూగనోమునోయంగనేమి
నిలువునంగరగిపోయెనే లలితమూర్తి

ప్రేమభాగినికష్టంబు ప్రియజనునకు
కడుపుకండలు జెకలించుగాదెబిడ్డ?
చెప్పఁదలఁచినదానిని జెప్పకున్న
తాపము విచారమాత్రత దవిలిచంపు
ప్రేమమయి యాపురన్నఁ జెప్పెడిదిఁ కేమి
దుఃఖవీచికనెయ్యురఁ దూలనడఁచు
కన్నిపడనేల, కన్నీరుగార్చనేల
చింతనావేదనలచేఁ గృశింపనేల
కలఁడువాఁడన్నిఁటికి జగత్కారణుండు
నిరతసుఖదుఃఖసాగరోత్తరణమునకు
జారుముడిపైట సందుగాజారిచెదరి
సారెకుంగారు కన్నీటిధారదోగి
స్వాతికార్తె వినిర్ముక్తజలదమాల
తూగు భ్రమగొల్పు నీయురోభాగమందు
రేగిపోయిన కాటుక రేకలందు
నీడలాడెడు నీకనీనికలనలుపు
ఊడిపడుచున్నదటనుండి యుర్విపైకి
అశ్రుబిందులపేర ముత్యాలసేరు

ఆపురనేఁ బత్తు లాలవాలాంబువులకు
లేచియుంబాయనిగాటా రెలేగదూడ
అస్తువిస్తుగ సీతండ్రి యరుగుదెంచు
అస్తమానము పనిఁజేసియలసిసొలసి
సందెచీకటి నలుదిక్కులందునలమె
తల్లిపూలమ్మినచ్చెడి తరుణమయ్యె
మచ్చగన్పింపగాఁ జందమామవేగఁ
దూరపుఁగొండపై కెక్కి తొంగిచూచె
సాంధ్యకృత్యములన్నియుఁ జక్కఁబెట్టి
వలయునెడ మాటలాడగావచ్చులెమ్మ
పెంకెసన్యాసిపోర్వట్టి చంకదిగదు
వారుకచ్చేరుకడనుండివచ్చిరేమొ
నీవునెరులందుఁదురుమని నెపమునేమొ
ఎండిసురుగయ్యె మల్లెపూమండక్రింద
శ్రీసతికిఁబూజసేయని సిగ్గునేమొ
తులసిదళములు ధూళితోఁగలసిపోయె
చేతనాధర్మమిదిగాదు చిక్కులందు
ధైర్యమువహించి యాపదదాటవలయు
తల్లిఁదండ్రిని చెలుల బాంధవులఁజూడ
దార? ప్రేమ విచిత్రమాయామయంబు
అగ్నిగోళంబుకన్న తాపాధికంబు
చందనతుషారమునకన్నఁ జల్లదనము
వింతమానసమునకన్న వేగిరంబు
స్థితివిలాసముకన్న సుస్థిరతరంబు
ఆర్ద్రహృదయులపాలిటి కమృతసరము
మందభాగ్యులపాలిటి మంటుటడవి
స్వర్గనరకంబులందు నిచ్చలుభ్రమించు
ఎవ్వరధికారు లీరాజ్యమేలుటకును
భావనాశక్తిచిత్రత ప్రణయమూర్తి
అంకితంబయియున్న దీయంతరాత్మ
పరమపూతచరిత్రుల భాగ్యరేఖ

దివ్యమై నాఁడునాఁటికి న్దేజరిల్లు
ప్రొద్దుపోయినదోయి? నేఁబోయివత్తు
చింతపడఁబోకుమని లేవఁజేయిదిగిచి
తనదుపలుచని పెదవులఁగునిసిరాని
తిన్నయెలుఁగునవచియించె దిగులుగదుర
మనసుశీలకుఁగొప్ప సంబంధమున్న
ఎంచియెటనేనియును విచారించకిట్లు
పాడియా? యని డాసిరంపానఁబెట్టు
పిన్నిగారికి నిప్పట్ల పేదగుండె
అంతరములేదు మాయిర్వురాత్మలందు
తనకునేనయి నాకును దానయగుచు
ప్రేమభిక్షను యాచించుకామితంబు
ప్రతిఫలించుఁబరస్పరభావమందు
పాపటములేని నామనోభాగ్యసీమ
ప్రేమవర్షించిప్రణయము పెంచినాఁడు
తననిరాశావిచారంబు దలఁచినపుడు
పగులు భళ్ళని లో నగ్నిపర్వతంబు
ముద్దుకై నను బెద్దల ముందునిలచి
పలికియెఱుఁగఁడు మోమోడిభావమిచ్చి
ఆత్రమున నెన్నిమారులో యడుగఁబోయి
ఆర్ద్రహృదయుఁడు దెల్పలేఁడాత్మగతము
పేటదెగిముత్తెములసేరు బెరిగినట్లు
జీవనాశ్రువు లేప్రొద్దు చెదిరిపడెడు
మాలదైవమునుమరచిన మరపుఁగాక
సుఖవిహీనశరీరంబు సురుగదేమి
పుట్టిపెరిగినమానాళ్ళు భోగమహిమ
ఆరుగాలముఁబ్రతికిన సర్థవాంఛ
కాని మరణముగోరఁ డేమానవుండు
కామితార్థవిహీనమా కాయమేల
చిన్నదాప్రక్కవారింటి సీతనేఁడు
వేసితేవెయ్యిరూపుల వెలుఁగుచుండె

కన్ను వెన్నెలమొన్న సంక్రాంతికపుడె
ఆలుపోలేమిలేదె మీయమ్మికనెదు
ఇరుగుపొరుగులపోట్లచేఁ గఁగిగుండె
కంటఁగడివెడుగార్చునా కన్నతల్లి
గుట్టుచక్కనిమీవంటి గొప్పవారు
కొండపైఁగోఁతినై నను గొసఁగలారు
వాఁడుదయసేయలేదింక వచ్చెనేని
కక్కుఁగళ్యాణమును నరికట్టఁగలమె
అంతకునుఁదగ్గగంత లేదా మఱేమి
అనుచులోలోనఁగుతకుతలాడుచుండు
గుమ్మమునుజొచ్చిరేనియుఁ గ్రొత్తవారు
మొత్తదాటనికనుసైగనొత్తిపలుకు
బంధుమర్యాదనెఱపు నేపాంథుకైనఁ
దదుపరిని రాకచే గుండెతరగిపోవ
పుట్టినప్పుడు సంతోషముట్టిపడును

సురుగునొకకొన్నినాళ్ళు కాసుఖమరీచి
రానురానీక బడబాగ్ని రగులుకొనును
కానరిటఁవంటి దుర్భరకష్టములను
అమృతలేపనమైతన్విసట్టిగుళిక
మానసరసాయనంబైన మధుపుటమ్ము
నిరతసుఖదుఃఖజలధిసంతరణతరణి
కూఁతుపేరిట విషవృష్టి గ్రుమ్మరించె
ఆలజాలముగా నాటలాడునేళ
తల్లిదండ్రులు దూరమైదారిలేక
అలనటించెడు పసిపాపనాదరించి
కడకు నానుండి యిలు వెళ్ళనడచినారు
కూలినాలియుఁజేసిన బోలదేమి?
కలిమొగంజియొ ద్రావినఁగడువదేమి?
పస్తువడియున్నఁబోవఁడిపరువదేమి?
ప్రాణములకెల్లఁ బ్రాణమా పతిలభింప.

## పిల్లి

ఒకచుక్కచుక్కల తెల్లపిల్లి
చూరులన్నియు ఎక్కితిరిగి
ఎంతవెదికిన ఎలుకదొరకక
నాదుకాళ్లవ్రేళ్ల తిరుగుచు
మ్యావుమనియరచెన్.
మట్టిబుట్టి మనుచునుండే
వెట్టివానికి గొప్పవానికి
తిరుగులాడే ప్రతీజీవికి
ఆకలేగద! గొప్పబాధ?
కడుపునిండిన చాలుననుకొని
సంతసించేవారు కొందరు
కడుపుతో గాదెలనుగూడ
నింపదలచే వారుకొందరు;
కాని నాపాదాలనిమురుచు
తిరుగులాడే పిల్లిపిల్లా!
ఎలుకదొరికిన సంతసించి,
డొక్కనిండిన చాలుననుకొని
ఆకలరపుల నాచికొనుచూ
తోకత్రిప్పచు నాడుకొనును.
అన్న మోరామా! యనేడ్చే
బహుగుజనముల కడుపునిండిన
కాటకపు కాట్లాటలడగు;
మనుజహృదిలో దాగియున్న
సాజప్రేమలు వృద్ధిపొందు.

జనమంచి కామేశ్వరరావు గారు

# అసహాయమహిళాగృహముల అవశ్యకత

శ్రీమతి కమలరత్నముగారు ఎం. ఏ.

మే మాసమున వెలువడిన 'గృహలక్ష్మి' యందు 'గయ్యాళివదిన' మరి 'అత్తకుతగ్గకోడలు'— ఈరెండుకథలున్ను చదువగా, నాకాలాటివిషయములు కథారూపమునగాక నిజముగా జరుగుచున్న వెన్నియో జ్ఞాపకమునకు వచ్చెను. గయ్యాళివదినెలు, గయ్యాళిఅత్తగార్లు, గయ్యాళితోటికోడండ్రు మరి గయ్యాళిఆడపడుచులు దినదినమున్ను వృద్ధిపొందుచున్నారుగాని వీరి సంఖ్య యేమాత్రమున్ను తగ్గుటలేదు.

వీటివలన నొకటి రెండు విషయములు విశదమగుచున్నవి. ఏమనగా స్త్రీలకు గలుగు కష్టములకు స్త్రీలే కారణభూతులనియును, మరియు నేవ్యక్తియైనను యితరుల దయకు పాత్రుడయినట్లయిన, అట్టి రక్షకులు యెట్టి దగ్గరబంధువులయినప్పటికిన్ని, కొలదిదినములలో, తమపై నాధారపడి యుండువారిపై విసుకుకొని వారిని అనేకవిధములుగా పీడించుటయును, అట్టి వ్యక్తి స్త్రీ యైనచో ఆమెస్థితి చాలా దుఃఖకరమగుచున్నది. ఏలననగా పురుషుడు అట్టి పరిస్థితులు తటస్థించినపుడు యేసంఘభయములేక తన్ను పీడించు బంధువులను వీడి తనదారినితాను బోవుటకు యేసంశయమును బొందడు. స్త్రీలు అనేక కారణములవల్ల అట్టి సాహసముచేయ సాహసింపరు. అట్లు చేసినను, మన సంఘమంతయు న్యాయాన్యాయములు విచారింపక అట్టి స్త్రీని దూషించుటకు యేమాత్రమును వెనుకదీయదు. ఏధైర్యవతియగు స్త్రీయో సాహసించి యేలాగో నొకలాగ స్వతంత్రముగా జీవింపజూచినయెడల, అనేకు లనేకవిధములుగా ఆమెను దూలనాడుటయేగాక, నిర్దయాపరులు ఆమెను బొత్తిగా నాశనము చేయుటకును కూడా కాచుకొనియుందురు.

ఏదోకాలము బాగుండినట్లయిన కొందరు గయ్యాళులవలలనుండి విముక్తిజెంది సుఖపడెదరు. అట్టివారును కొందరున్నారు. కాని వారి సంఖ్య చాలాచిన్నది.

కాని నేనిప్పు డడుగదలచుకొన్న దేమనగా అటువిముక్తిజెందుటకు వీలులేనియెడల అట్టివారు వారి జీవితము గయ్యాళుల బలిపీఠమునకు అర్పింపవలసినదేనా? డబ్బులేనివారికే యిట్టి దురవస్థ పట్టుచున్నదని యెంచుట పొరపాటు. ఎంతోమంది డబ్బుగల (అనగా మధ్యరకపు ఆదాయము గలవారు Middle class) స్త్రీలు కూడా తమ డబ్బు జాగ్రత్తపరచి ఉంచుకొనుటకు సమర్థతయు మరి సహాయమును లేక యేదో బంధువుల నాశ్రయించి తుదకు వారివలలో చిక్కుకొని తహతహలాడుచున్నారు. ఎంతోమంది స్త్రీలు మనదేశమందు నరకవాసములగు గృహములందుండి ఎటుబోవను దారిలేక కుందుచున్నారు.

అట్టి వారికి మన మేలాటి సహాయము జేయగలము. నిర్దయాపరులగు బంధువులచేత జిక్కక, వేరే యేనమ్మకమైన ప్రజాసంస్థకునైన వారిడబ్బు జాగ్రత్తపరచి నెమ్మతిజెందుట కేమార్గమైన కలదా అని మన మాలోచింపవలయును.

ఇట్లు కష్టపడు స్త్రీలు నాకెందరినో దెలియును. అట్టి దురదృష్టుల చరిత్రములను రెంటిని యిందు వ్రాయుచున్నారు.

౧. సివిల్ సర్జన్ గారి భార్య.—ఉత్తరహిందుస్థానీవారు—డాక్టర్ గారు 'యింపీరియల్ సర్వీస్' నందుండినందున ఏకష్టములేక అంతాబాగానే జరుగుచుండెను. అందరున్ను స్నేహితులులే—విరోధులెవరున్ను కనబడలేదు. అందరున్ను డాక్టరుగారిని వారిభార్యను భూషించువారేగాని దూషించువారెవ్వరున్ను లేరు. కొలదిదినములకు డాక్టరుగారు సెప్టిక్ పాయిజన్ (Sceptic poison) వల్ల అకస్మాత్తుగా చని

పోయిరి. డాక్టరుగారిభార్య ముగ్గురుఆడపిల్లలు వొక్క మొగపిల్లవానితో లోకమందు విడువబడెను. డబ్బు కలదుగాని ఆమె మిక్కిలి అసమర్థురాలు—పిల్లలతో తానేవుండుటకు అధైర్యపడెను. డాక్టరుగారి అన్నగారు యింజనీయరు. అతని కుమారుడు ఐ. సి. ఎస్. పరీక్షచేసి జిల్లాకలెక్టరుగా నున్నాడు—వారువచ్చి డాక్టరు భార్యను, పిల్లలను వారియింటికి తీసుకవెళ్ళిరి. పాపం ఆమెడబ్బంతయు బావగారిదగ్గరయిచ్చెను. అతను డబ్బును బాగా భద్రపరచుకున్నాడు. కొత్తలో అన్ని బాగా నేవుండెను. దినములుగడచినకొలది యింజనీరుగారిభార్యకు తోటికోడలిపై అసూయపుట్టెను. వారియింట ఆమె దండుగతిండితిని కూర్చుండెననుకొనెను. వంటలక్కను యేదో యొకమిషమీద నిలిపివేసెను. డాక్టరుభార్య వంటలక్కఅయెను. పిల్లలకున్ను చదువు సంధ్య లేమియున్ను లేవు. అన్నియుమాన్పివైచిరి. డాక్టరుగారిభార్యకు సాలుకు రెండుచీరలేను. పిల్లలకున్ను అన్నియే. ఏచిన్న యేసామాన్యవుపస్తువైనను డాక్టరు భార్యకు కొవలసినట్లయిన తోటికోడలు దుకాణాదార్లవద్దంతయు డాక్టరుభార్య చాలా చెడ్డదనియు, ఆమెకు నెలకొక కొత్తచీరకావలయుననీ ఆమెపిల్లలు చాలా చెడ్డవారనియు చెప్పుచుండెను. ఇలాగు ఎన్నియోయిబ్బందులన్నియుఆమె అనుభవించుచున్నది. పైగా ఆమె జబ్బుమనిషి. గుండెలజబ్బు. చికిత్సలేమియును లేవు. కాని పనులన్నియు ఆమెవియే.

౨. ఈబాలిక పేరు పద్మ—క్షత్రియులు—తలిదండ్రులు మిక్కిలి సంపన్నులు కానప్పటికిన్ని, యేక పుత్రి అని యెంతో గారాబముతో పెంచుచుండిరి. వారికి వొక పుత్రుడుకూడా నుండెను. సోదరునకును సోదరికిని 18 సంవత్సరముల వార. చాలాకాలమునకు ముందు విదేశములకు వెళ్ళి డిగ్రీలు సంపాదించి నందువల్ల గొప్ప నౌఖరీలోనే యుండెను. అతని భార్య మహాగయ్యాళి. అత్తమామల నేలాటి కష్టములు పెట్టవలయునో అవన్నియు దీర్ఘముగా ఆలోచించియే చేయుచుండెను. ఆమెపీకపైకి కత్తిలాగ అవివాహితయగు ఆడపడుచు కూడానుండెను. తలిదండ్రులు అమాయికులయినందున దూరదృష్టిచాలక తమ కుమారుడు కుమార్తెను చాలాబాగాచూచుకొనుననియును, మరియు గొప్ప వుద్యోగమునందుండుటవల్ల గొప్ప సంబంధమును కుదుర్చుననియు వారు అమ్మాయికి ఏవివాహప్రయత్నములున్ను జేయకమరణించిరి. తలిదండ్రులు మరణించిన తోడనే బాలిక చదువడుగంటెను. వదినెగారు ఆమె చదువు మాన్పివైచి, వంటయందు దింపి వంటనౌఖరీ డబ్బు మిగతపరచుకొనెను. నాటినుండి అయిదు సంవత్సరములవరకు పద్మ వంటశాల, తన చిన్నగదియు తప్ప వేరేస్థలమునకు వెళ్ళియుండలేదు. అన్నగారికి వదినెగారికి భోజనాదులు వారి గదికే పట్టుకవెళ్ళవలెను. పాశ్చాత్యదేశమున తిరిగి అలవాటయిన సోదరునకు తిండితీర్థాలన్నియు బల్లపైననే. వారికి ఒకవిధభోజనము. పద్మకు నౌఖర్లతోసహా వేరే భోజనము. రోజంతయు పద్మకు పనియే. గడియసేపు వదినెగారు విశ్రాంతి పొందనిచ్చేదికాదు. ఇంతచాకిరీ చేసినను అమ్మశక్తిగారు తృప్తిపొందెడిదిగాదు. ప్రతిపనియందును తప్పులు కనిపెట్టడమే. మరి పద్మను దుష్టురాలని వొకరోజు, దొంగఅని యింకోరోజు, మరి జారిణిఅని యింకోరోజును, యిలాగ అనరాని వాక్కులనుచుండెను. పద్మకు సోదరుడు తప్ప మరెవ్వరును బంధువులులేరు. అందులో అవివాహిత కనుక యిలాటి వర్ణింపరాని కష్టములెన్నియో నెమ్మదిగా వోర్చుకొని యుండెను. వివాహమువల్ల విడుదల నొందదమన్నను వివాహప్రయత్నములేమియు జరుగుచుండుటలేదు. పాశ్చాత్య 'మానర్స్' యెరిగిన సోదరుడు పద్మకు యిప్పుడే వివాహ మనవసరమనెను. మన దేశమున చిన్నపిల్లలకు వివాహము జేయుట యొకగొప్పదురాచార మనుచుండెను. ఇట్టి దురాచారములుండుట చేత మిస్ మేయో అలాటిపుస్తకం వ్రాయనాయె ననుచుండెను. పాశ్చాత్యదేశములందిట్టి దురాచారములు లేనందుననే వారిదేశ మత్యున్నత దశయందున్నదనుచుండెను. ఇలాగ తనకేయేవిషయములలో పాశ్చాత్య

పద్ధతియు, యేయే విషయములలో దేశీయపద్ధతియు తన లాభమునకు అనుకూలముగానుండునో ఆయా సందర్భముల నెరిగి అతను ఆయాపద్ధతులను ఆచరణలో పెట్టుచుండెను. పాశ్చాత్యదేశములో స్త్రీవిద్య అత్యున్నతదశయందుండుట అతడెన్నడును ఉచ్చరించి యెరుగడు. ఆవిషయ మతని కనవసరం. ఎందుకనగా, ఆపద్ధతి తనకు నచ్చినదన్నట్లయిన, యెవరో యొకరు తన సోదరిని విద్యలేక, వివాహములేక యుంచుకొని యున్నాడని అనెదరు. అందుచేత అతను పాశ్చాత్యదేశములలో విద్యవల్ల స్త్రీలు చెడిపోతున్నారనియు అందుచే స్త్రీవిద్య మన కనవసరమనుచుండెను. అందుచే ఆపద్ధతి అతనికి నచ్చలేదు. పాశ్చాత్యదేశములలో స్త్రీలు చాలాకాలమువరకు అవివాహితలుగా నుండు పద్ధతి అతనికి అన్ని విధములలో బాగానచ్చినది. ఎందుకనగా, డబ్బు కర్చులేక, జీతం బత్యంలేక 'ఫ్రీ' వంటలక్క దొరకెను. కనుక అతను యెప్పుడును బాల్యవివాహ దురాచారమును గురించి అందరివద్దను ఘోషించి చెప్పుచుండెను. పాపం! పద్మ, యెప్పుడైనను తనసోదరునకు తనపై దయకలుగునని, చాలాకాలము నెమ్మదిగా ఓర్చుకొనియుండెను. దినదినము వదినెగారి అక్రమము మెండగుచుండ భరింప నలవికాకుండెను. గృహజ్వాల విస్తరించి విసరుచుండెను. పద్మ గృహజ్వాలనుండి వెడలుటకు సాహసించినది. ఎన్నో యిక్కట్లుపడి వసతిగృహములందుండి యేదో యొకచిన్న ప్రయిమరీస్కూల్లో టీచరు పనిచేయుచుండెను. పద్మ యిల్లువెడలుట ఆమె దుష్టత్వమును రూపించుటకు వదినెగారికొకదృష్టాంతముగాఏర్పడెను. కొన్నాళ్ళకుపద్మ ఒకమహారాష్ట్రుని వివాహమాడినది. ఆమెకు మంచివినయ లుండినందున, యిప్పుడు ఆమెబాగానేయున్నది. తన పూర్వస్థితి మరువక తనలాగ కష్టపడువారి కెంతయు సహాయము చేయుచున్నది.

ఇట్టివారు యెందరో మనదేశమందున్నారని వేరుగా వ్రాయ నక్కరలేదు. కొందరు మాత్రము కొన్ని రోజులు కష్టపడినను తుదకు సుఖముగానే యున్నారు. మరికొందరికి ఇలాటి పరిస్థితులు అకస్మాత్తుగా తటస్థించుచున్నవి. వారికి వారి బంధువుల గుణములు బాగా తెలిసియుండును. అట్టి జాగాకు వెళ్ళడానికి కొంచెంకూడా వారికి ఇష్టములేక యుండవచ్చును. కాని వేరె యెచ్చటకు వెళ్ళగలరు? ఒంటరిగానుండుటకును సాహసింపజాలరు. కనుక తుదకు యేదారి కనబడక అట్టి బంధువుల దగ్గరకేవెళ్ళి కష్టములపాలగుచున్నారు.

నే నొకమారు డాక్టరుభార్యగారిని చూడనువెళ్ళితిని. ఆమె యేలాగో యొకలాగ నాతో ప్రత్యేకముగా మాట్లాడుటకు సందు జేకొని నన్నీక్రిందిప్రశ్న అడిగెను. 'మన దేశమందిప్పుడు అందరున్ను రాజకీయవిషయములలోనే జోక్యము కేసుకొనుచున్నారు గాని సంఘసేవజేయు వారెవ్వరును లేరు. మాలాటి అసహాయులగు స్త్రీల కెవ్వరేలాటి సహాయము జేయుచున్నారు? చదివిన స్త్రీలుకూడా వారివారి పరకున్నారుగాని మాలాటివారికి యెట్టిసహాయమున్ను జేయుటలేదు. నమ్మకముగల స్త్రీలవల్ల యేర్పబడిన యేఆశ్రమంలోగాని నిర్భయముగా నేను నాడబ్బును భద్రపరచి నాపిల్లలను ఉంచుకొనగలిగియుండినట్లయిన నాకీ కష్టములు లేకయుండునుగదా!' అని ఆమె కన్నీరు పెట్టుకొనెను.

ఆమె మాటలు నాకు కొంతవరకు నిజమేనని తోచినవి. ఎందుకనగా మనదేశమున 'సేవాసదనం' మొదలగు నికేతనములును, గృహములును ఉండినను ఇవి ముఖ్యముగా విద్యార్థినులకొరకే జరుపబడుచున్నవి. విద్యార్థినులు గాని స్త్రీల కొరకిట్టిగృహమొకటి నిర్మించుటకు మేము కొందరమిక్కడ (కాశీ) ప్రయత్నము చేయుచున్నాము. ఈవిషయమందు చాలామంది వారి సలహాల నొసగుచున్నారు. చాలామంది స్త్రీలు కూడా యిట్టి గృహమొకటి నిర్మించిన వారికిబాగుండుననుచున్నారు. దేవుని దయవలనను, మాసోదరసోదరీమణుల ఆశీర్వచనముల వల్లను, శ్రీమంతుల సహాయ్యమువల్లను మాప్రయత్నమీడేరునని తలంచుచున్నాము. ఈవిషయమందు ఆంధ్రసోదరీమణులును గృహలక్ష్మిద్వారా వారిసలహాలనొసగ ప్రార్థింతును.

## ఆషాఢరమ

హరి రాధాకృష్ణమూర్తిగారు

మిథునమునకీవు దావిచ్చి మెలఁగినంత
శూన్యమైతంచు జనులంద్రు చోద్యమహహా!
శైవమిథునంబునకును దా స్థలమునిచ్చి
శూన్యమాయెనె గిరిరాజు చూడుమింత.
సారమతిఁ గర్షకుఁడు కే
దారములను జదునుపరచి తత్ఫలసిద్ధిం
గోరి నీరములకొరకై
నీరాకల నమృతవర్షిణీ! గోరుకదే.
పితరులు పుత్రసంతతులు బ్రీతినొసంగు తిలాదితర్పణ
క్రతువుల ముక్తినింబడసి క్రమ్మఱ వారి ననుగ్రహించు వి
శ్రుతమగుదక్షిణాయనవిశుద్ధమహాఫలకాలముత్సన
స్థితిని దనర్చుఁగాదె భవతీభవదీయహృదంతరమ్మునన్.
మండువేసగియెండల మాడిమాడి
బీటువారినప్రకృతి నీపాటవమున
మెల్లమెల్లన దరిఁజేరి పల్లవించి
స్వస్వరూపంబునంది శోభలఁదనర్చు.
ఏటేటికన్న నీయేడాది నీవు స
మస్తదేవతలను మాదు పితరు
లను యక్షగంధర్వులను మానులను వెంటఁ
బిలిపించుకొనివచ్చి వేడ్కతోడ
అమరగురుండు సింహముఁ జొచ్చువేళ గో
దావరీనిర్మలోదకములందు
వారెల్లరును జలావాసంబుఁ జేయఁ
జాలెదవంచు మాశాస్త్రవిదులు
పలికెదరు నీకు నాశక్తి గలిగెనేని
వారినిఁగొనివచ్చి మముఁగూడ వారితోడ
స్నానముల నాడఁజేయు మాజలములందు
భవ్యఆషాఢమాసమా! ప్రణతులమ్మ!

# గోదావరీపుష్కరములు

శ్రీమతి యమ్. వేదవల్లి తాయారమ్మగారు

శ్లో. రేవాతీరే తపఃకుర్యాత్ । మరణం జాహ్నవీతటే ।
దానం దద్యాత్కురుక్షేత్రే । త్రితయం గౌతమీతటే.

నర్మదానదీతీరమున తపస్సును, గంగాతీరమున మరణమును, కురుక్షేత్రమున దానమును చేసిన కలుగుమూడుఫలములు నీగోదావరీతీరమున కలుగునని పౌరాణికవచనము. ఈనదీరాజము బొంబాయిరాజధానిలోనిదగు నాసికసమీపమునసున్న సహ్యాపర్వతములయందు పుట్టి బొంబాయిమీదగా ప్రవహించివచ్చి ధవళేశ్వరమువద్ద నేడుపాయలుగాచీలి బంగాళఖాతమున బడుచున్నది. ఈపాయలు సముద్రమునపడిన తావులకు సప్తసాగరసంగమమని పేరు. సప్తమహర్షులలో నొకరగు గౌతమమహర్షి బ్రహ్మగిరియందు తపంబొనర్చి యీనదిని బడయుటవలన నీగోదావరికి గౌతమియను నామాంతరముకలిగెను. మరియు బ్రహ్మర్షి గొనివచ్చిన కారణమున రాజర్షియగు భగీరథుడు గొనివచ్చిన గంగానది కంటె నధికఫలమిచ్చునని పైనివివరించినశ్లోకమువలన దెలియుచున్నది.

ఈనదీతీరమున భద్రాచలము, కొవ్వూరు,(గోష్పాదక్షేత్రము) కోటిలింగములు, పట్టిసం మొదలగు పుణ్యక్షేత్రములు చాలగలవు. పూర్వకాలమున వీనిలో గోష్పాదక్షేత్రమున గౌతమమహర్షి తపస్సుచేయుచు గోవులను పెంచెనని యొకప్రతీతికలదు. ఆగోవులు నడచుటవలన నేర్పడినయడుగు లిప్పటికిని కొవ్వూరు గోవుపాదరేవున కానవచ్చుచున్నవి. అవి యెన్నివరదలువచ్చినను పూడిపోవు. శ్రీరామచంద్రమూర్తివారు రావణవధానంతరమున బ్రహ్మహత్యాదోషము పోగొట్టుకొనుటకు గోదావరీతీరమున ననేకశివలింగప్రతిష్ఠలుగావించిరి. అట్టిమహత్తరమహిమగలదియు, విష్ణుపాదోద్భవయు, పతితపావనియునగు నీగోదావరీమహానది పుష్కరము లీయంగీరసనామసంవత్సరమున జరుగుచున్నవి.

గంగా, యమునా, గోదావరి, కృష్ణా, తుంగభద్రా, నర్మదా, సింధు, కావేరి మొదలగు మహానదులకు పండ్రెండువత్సరముల కొకతూరి పుష్కరప్రవేశముకలుగుచుండును. పుష్కరములు పండ్రెండుదినములుజరుగును. ఈపుణ్యదినములలో సార్థత్రికోటితీర్థములు (మూడుకోట్లన్నర) త్రియస్త్రింశత్కోటిదేవతలు (ముప్పదిమూడుకోట్లు) ఋషులు నచ్చట నుందురని పురాణములయందు చెప్పబడియున్నది. నవగ్రహములలో నొకటియగు బృహస్పతిగ్రహము సింహరాసిలో ప్రవేశించునపుడు గోదావరీనదికి పుష్కరమువచ్చును. ఇట్లే క్రమముగా కన్య మొదలగురాసులకు వచ్చినపుడు కృష్ణవేణిమొదలగు నదులకు పుష్కరము కలుగును. ఆసేతుశీతశైలపర్యంతమునున్న హిందువు లనేకలక్షలకొలది ఈపుష్కరములకు గోదావరికివచ్చి స్నానదానములుగావించి కృతార్థులగుదురు.

# గౌతముఁడు గోదావరినిఁ దెచ్చుట

నంది మల్లయ, ఘంట సింగయ కవులు

సీ. మున్ను భారతవర్ష • మున దండకావన
వాసి గౌతమఋషి • వర్యుఁ డబ్జ
సంభవుఁగూర్చి ని • ష్ఠాపరత్వంబున
బహుకాల ముగ్రత • పంబుసలిపి
ప్రత్యక్షమైన త • ద్బ్రహ్మచే వి త్తిన
సస్యంబులన్నియు • జాములోన
పరిపాకమును బొంద • వరముగైకొని వచ్చి
శతశృంగగిరిఁ బర్ణ • శాలఁగట్టి

తే. కొని సమర్పించుఁ గోటుల • కొలఁదిమీఱ
వచ్చు నతిథులకెల్ల న • వ్వారిగాఁగ
షడ్రసాన్నంబు వరలబ్ధ • సస్యవృద్ధి
కలిమి నంతట నొకకొంత • కాలమునకు.

క. కోపముతో నిజమహిమో
త్కర్షము చూపంగవలసి • మీనంబునకున్
బూపార్శ్వజుండు వచ్చిన
దోషంబునఁ జేసి కఱవుఁ • దోఁడ్తెరాఁగన్.

ఉ. అప్పుడు దేవదారువిపి
నాంతరసీమ వసించు సంయముల్
విప్రసుభూమి సన్నము ఫ
లింపక చెట్టులు నెండిపోయె వా
తప్పినఁబోవుఁ బ్రాణములు
తప్పదు రండనిమున్న గౌతముం
జెప్పఁగ విన్నవారగుటఁ
జేరిరి తచ్ఛతశృంగశైలమున్.

క. ఈగతివచ్చిన మునులకు
నాగౌతముఁ డెదురు నడచి • సాష్టాంగముగాఁ
జాగిలి మ్రొక్కుచు నేఁడు గ
దా గణనకు నెక్కె మత్ప్ర • యాసంబనుచున్.

సీ. సంతసించుచు నిజా • శ్రమమున విడియించి
కొని వారికెల్లను • దినదినము న
హల్యప్రాశనుఁ డ • హల్యకాల్యాన్నంబు
వలసినవారికి • వలసినంత
ఘృతసూపఫలదధి • క్షీరయుక్తంబుగాఁ
దలచినప్పుడె పెట్టఁ • దారు నిత్య
మును భుజాభోజనం • బులుచేసి చెట్టుల
కరణి నందఱు మెచ్చ • మురయు బలిసి

తే. నెమ్మది సుఖింప నెడలె బం • డ్రెండువత్స
రములు కఱవున దీఱె న • వర్షములు గురిసెఁ
జల్లఁబడె నేల సకలస • స్యములఁ బండెఁ
బుడమి ధాన్యంబు పోకకుఁ • బుట్టెఁ డమ్మ.

క. అప్పుడు తపసులు తమలో
దెప్పరమా తీఱె నేమి • టికి నిఁక నిచటం
గుప్పలుపడి నిలువగ రం
డెప్పటిత్రావులకు పోద • మిందఱ మనుచున్.

క. గుంపులు గూడుకొని విచా
రింపఁగ శాండిల్యుఁ డది యె • ఱిఁగి గౌతముచే
నంపించుకొనక పోవఁద
లంపుట భావ్యంబె పెద్ద • లారా! మీకున్.

క. విపరీతపుఁ గఱవున నే
యుపద్రవము నొందకుండ • నోమిన మునికిన్
గపటింతురె 'సవితా యు
స్తు పోషకో' యటన్నమాట చూడఁగ వలదా?

మ. అన భార్గవ్యుఁడునట్టితప్పదన నా
హా! కూటిమాత్రంబునన్
మన నేమమ్ముడుపోతిమో యితనికిం
జాపంబుగాదంచు దు
ర్జనవృత్తింజనువారలైమునులు ని
ష్ఠాహీనంపుగోవుఁ బ్సృజిం
చినియోగించిరి గౌతమాశ్రమ పుష్కలము
క్షేత్రంబుభక్షింపఁగన్.

తరల. అరిగి తత్కపటంపు ధేనువు
నల్లనల్లన మళ్లలోఁ
దిరుగుచున్ వడిగాలికొట్టినఁ
ద్రెళ్లుచున్ మఱిలేచుచున్
దరళరైరి వరిచేల్లఁ జెల్లఁగ
దత్క్షణంబున మేయఁగాఁ
బరమశాంతుఁడు గౌతముండును
బారుతెంచి మనంబునన్.

శా. ధేనుగ్రాసముమాన్పదోసమని సం
దేహించినన్ సస్యమెం
తేనష్టంబగు నైన నేమి మరియున్
విత్తంగ యామంబులో
నౌనన్నన్ మును లెల్ల మిక్కిలియు నేఁ
డాకొందు రీధేనువుం
దానోమానముదప్పమేసినది యిం
తం ద్రోలెదన్ మెల్లనన్.

క. అని నిశ్చయించి హస్తం
బున జలములు పూని తల్లి! ♦ పొమ్మని ప్రోక్షిం
చిన మాయగోవు పడుచుం
గనుగ్రుడ్లం దిరుగవేసి ♦ కాలముచేసెన్.

సీ. అపుడు బ్రాహ్మణులెల్ల ♦ నన్యాయమన్యాయ
మనుచుఁ బేరలుఁగున ♦ సార్వువారు
గోహత్యసిద్ధించె ♦ నోహో యితనియింట
గుడువఁగాఁ గాదని ♦ గొణగువారు
నీమహాపాతకి ♦ నేల చూచితిరి సూ
ర్యవిలోకనము చేయుఁ ♦ డనెడు
పిడికెడు పూరికై ♦ బెడిదంపు సాహసం
బెట్లు సేసితివని ♦ తిట్టువారు

తే. నై దిసంతులుగొట్టుచు ♦ నమ్మునీంద్రు
గువ్వకరిగొని కడువెలఁ ♦ గుడువఁ బఱచి
బట్టగట్టితనంబున ♦ వట్టికట్టి
కదల వారికిఁ బ్రణమిల్లి ♦ గౌతముండు.

మ. అకటా! ధేనువుమీఁదఁజేయిడితినో
సామర్ష వాక్యంబులన్
తెకలం ద్రోలితినో బుభుక్షకుఁ
మేయంగ నీనైతినో
ప్రకటంబైన మదీయపూర్వకృతపా
పంబెట్టిదో కాక మి
న్నక గోహత్యకుఁ బాత్రమైతిననుచున్
బాష్పాంబువుల్ గాఱఁగన్.

క. దైవికమున నొకనేరము
గావించిన నిట్లు విడువఁ ♦ గాఁ దగవో నే
సేవకుని నన్ను మునులా
రా! వలదా యింతకనిక ♦ రంబైన మదిన్.

శా. ప్రాయశ్చిత్తముపంపుఁడిందుకనినన్
బాభ్రవ్యశాండిల్యుల
య్యో! యీసాధునకిట్టుగాఁదగిలె న
త్యుగ్రంపుగోహత్య కా
నీ యింకం బదివేలు నేమిటికి మా
నీ! దీనిపై జాహ్నవీ
తోయంబుల్ ప్రవహింపజేయు బ్రదుకన్
దోసంబుడీఱుందుదిన్.

సీ. మాకుఁ జూడంగ నో♦మ్మసిలి పడ్డది గాని
తెగటారఁజచ్చుట ♦ తెలియరాదు
కావున నీపాతి♦కం బసివోవ్వ జా
హ్నవిఁ దెచ్చుటకుఁ బ్రయ ♦ త్నంబునీవు
సేయు మేము నింకఁ ♦ బోయి వచ్చెదము తో
పించకు మం చూర ♦ డించి మునులు
దేవదారుద్రవ ♦ నీవాటి కరిగిరి
గౌతముండును శిత ♦ కరకిరీటి

తే. ఘోరతపమున మెప్పించు♦కొంచుఁ దెత్తు
గంగ నాకిది యెంత దుష్క♦ర మటంచు
మగువతోఁ దాను శతశృంగ ♦ నగము డిగ్గి
కదలి చనుదెంచి చనుదెంచి ♦ కొండుటఁ గనియె.

క. అతిక్షుద్రపాతకానిల
ధతశాపన్నగము బహుల♦బలభిన్నగమున్
వితతోన్నతి ధవళిమ
ఖ్యుతగణాసన్నగమును ♦ హిమవన్నగమున్.

క. కని మనమునఁ గోరిక ని
క్కని తాంతానందవార్థి ◆ గరుసుకొనఁగఁ జ
క్కనిసతి నాకిభరికి మ్రొ
క్కనియోగించుచును మ్రొక్కె ◆ కౌతూహలియై.

సీ. ధారుణీగవికి ర◆త్నమహౌషధంబులు
చేఁపు పుట్టించిన ◆ క్రేఁపుఁగుజ్జ
కఱకంఠునకుఁ గాళ్లు◆గడిగి గౌరీకన్య
ధారవోసిన మహా◆దానపరుఁడు
మౌనికోటికి నెల్ల ◆ మన్నింపఁదగిన మే
నామానినికిఁ బ్రాణ◆నాయకుండు
తనకూఁతుసవతి మం◆దాకినీనదికి నా
ధారమై నిలిచిన ◆ తగవులాఁడు

తే. సురధరిత్రీధరమునకు◆జోడుకోడె
వనధిసఖమైన మైనాక◆మునకుఁ దండ్రి
కాంత కన్నుల పండువు◆గాఁగఁ జూడు
మంచు నమ్మించుకొండ వ◆ర్ణించి మఱియు.

వ. అనేకవిధంబుల నహల్యకు నాహిమవన్నగంబు మహిమ చెప్పుచు వచ్చి తన్నగప్రదేశంబున నొక్క స్థలంబున నేకపాదస్థుండై శంభుం డనగు నన్నుం గూర్చి యతిఘోరతపంబు సేయు నవసరంబున.

చ. కరినివహంబు రాచుకొనఁ
గాఁ జలియింపదు బొడ్డుబంటిగాఁ
బెరిగిన పుట్టలో వెడలు
భీకరభోగికులంబు ప్రాఁకఁగా
గుఱుగుఱుకాదు గడ్డమున
గూఁడులు పెట్టిన పక్షికోటి పెన్
మొరప మెఱుంగఁ డెట్లు ముని
ముఖ్యుని యాతనుపంచుఁదాపసుల్.

వ. తద్దయు వెఱంగుపడ.

క. ఈరీతి నిఖిలవిస్మయ
కారణమగు నుగ్రతపము ◆ గావించె నహ
ల్యారమణుఁడు నా కిడు ల
పారకరుణ నంత నేను ◆ బ్రత్యక్షంబై.

వ. తదీయపూజనంబులంది వరంబు వేఁడుమన నాతండు మందాకినిం గోరి ప్రణతులు ఘటించి నిల్చుటయు.

తే. ఏను నొక్కజటాఖండ ◆ మిచ్చి వత్స!
యిందు నిందుకళామృతం ◆ బిందుకొన్న
దద్వయమ్మది యున్నది ◆ తడయ కిపుడ
పొమ్ము నీవన్న నమ్ముని ◆ పొంగపొందు.

మ. ననుభావించుచు నప్పటప్పటికి నా
నందాశ్రువుల్ గాఱఁగాఁ
దనలోఁ జొక్కుచు నేఁగి దంభగవిమీఁ
దన్ దజ్జటాఖండ మెం
య్యనఁ బిండన్ విమలాంబువుల్ వెడలె సం
ధ్యారాగసంలిప్తనూ
తనశీతాంశుకళావినిర్గతసుధా
ధారానుకారాకృతిన్.

క. ఆ నీరు సోఁకి మాయా
ధేనువు తా నిద్రవోయి ◆ తెలిసినపగిదిన్
మేను విదిలించుకొంచును
మౌనులు వెఱఁగంది చూడ ◆ మగుడ నుగుతరిన్.

క. ఉదకము చేత నే కపటపు
మొదవు మడిసె మొదల నుదక ◆ ములచేత తుదిన్
బ్రదికె నుదకంబు ధరలో
నదిగాన విషామృతాహ్వ◆యంబులు దాల్చెన్.

వ. అని జగజ్జనంబులు పలుక నజ్జటాఖండవారిపూరంబులు క్రమక్రమంబున మహావాహినియై ధరణీధరంబుల దిగంబాఱుచు నానారత్నంబుల వడింబడి పరిభ్రమించుచు సరిద్రమణసంగమోత్సవంబు గైకొనియె నప్పుడు విమానాంతరవర్తులై ఋషీంద్రులు.

మ. కలకాలంబును సన్నవాన మొసఁగం
గాంక్షించి యామంబులో
పల నే సస్యము వింతపండని తపః
ప్రాధాన్యమే ధాన్యమి
ట్టులపో కం జదలేటినీరు మృతమా
యాధేను పైఁ దేని వా

దళుకే శివవనమంచుఁ దన్ను ఘనతిఁ
బ్రాభిం ప్రశంసింపఁగన్.

వ. విని గౌతముండు వీరుమాయాధేనువనిన కారణం బేమియని యోగదృష్టింజూచి దేవదారువనాం తరగతుల ధార్ష్ట్యం బెఱింగి బొమలు ముడివడఁ గోపంబున వియద్గంగాసలిలంబులు పుడిసిటం బట్టి

మ. కలకాలంబు కృతఘ్నులై కపటులై
కైవల్యదూరాత్ములై
మలినీభూతమనస్కులై సుకృతశ
ర్మభ్రష్టులై కష్టులై
తలలింగంబులు మేనబూడిదలు గం
తల్ బొంతలుం దాల్చి శా
స్త్రిల వేదంబుల సర్వదైవతములన్
దూషించు పాషండులై

క. పోవుదురు దుష్టదారువ
నీవాచంయము లటంచు నిష్ఠురతరవా
చా వైఖరిని శపించం
గా వైమానికులు మునులు ♦ గౌతముతోడన్.

క. భట్టారక తన్మునులకు
వట్టికోపలె కృతఘ్ను ♦ లై యాకరణిన్
వట్టి పెనురట్టు నీకున్
గట్టినకట్టిఁడునకైనఁ ♦ గారుణ్యమునన్.

వ. అస్మదీయప్రార్థనం బంగీకరించి భీషణాభిశాపమోక్ష భాషణఫలంబు కలియుగంబున ననుభవించునట్లుగా వారలననుగ్రహింపుము. నీవు దెచ్చినదిగావున నిమ్మహానది గౌతమీనామంబును, వరదానంబున వచ్చి గోవుమీఁదఁ బ్రవహించుటం జేసి గోదావరీ నామంబును బూని రంగత్తరంగకోలాహలమిషం బున నీకీర్తి ఘోషించుచు భువనపావనయై వర్తించుచుండు; నో మహానుభావా! మేము పోయి వచ్చెద మనుటయు గౌతముండు వారల నుచితవచ నంబుల వీడ్కొల్పె. నాటనికతంబున భరతవర్షం బున గోదావరీనది యుద్భాసితంబయ్యె.

# గోదావరీపుష్కరము

శ్రీమతి వెంపటి అన్నపూర్ణమ్మ గారు

పరమపావనమైన భరతదేశమున
వరనాసికాపురవరమందు బుట్టి
ఎత్తుకొండలచీల్చి ఇట్టట్టదాటి
ఒత్తైనవనముల నొప్పుగాజొచ్చి
భక్తితో శ్రీరాము భజనగావించి
ముక్తిసీదయసేసి భక్తులన్ బ్రోచి
పూతమై బహుపుణ్యపురములాజూచి
గౌతమీయనుపేరుగాంచి యావెలసి
రాజరాజనరేంద్రుని రాజ్యంబుసొచ్చి
పూజనీయంబైన పుణ్యచారిత్ర!
నీపుష్కరములకు నిఖిలోర్విజనులు
ఏపుగాదర్శించి ప్రాపుగోరెదరు
గోదావరీతల్లి! కోర్కెలానొసగి
మా దేశస్వాతంత్ర్యమహిమ మాకొసగు.

నీలోనగలవుగా నిఖిలవిద్యలును
నీలోనగనినంత నెగడుభావములు
నీనీటిచేగాదె నెగడెభారతము
నీనీటిచే నేడు నెగడుభారతియు
నీపాటకీడౌనె యేపాటగాని
సాపాటుమరపించ జాలునీపాట
నీచిత్రఫలకంబు నెలకొల్పగాను
ఏచిత్రకారుని కెన్నగాదరము
ఈమాతృదేశంబు ఈవుంటగాదె
శ్యామసుందరమౌచు సాగుచుండుటయు.
గోదావరీతల్లి! కోర్కెలానొసగి
మా దేశస్వాతంత్ర్య మహిమమాకొసగు
మ్రొక్కెనావరమీనిమూర్తి నే విడతు
గ్రక్కునన్ స్వాతంత్ర్యగరిమ మర్పించు.

# మహిళోన్నతి

విద్వాన్ సూరిగుచ్చి కృష్ణమూర్తిగారు

శ్రీరాజారామమోహనరాయలకాలమున నారంభింపఁబడిన సాంఘికవిపరిణామము నేఁటికిని ఫలోన్ముఖముగాలేదని తెల్పుట కెంతయు విచారము. కాని యాంధ్రదేశమునకంటెఁ దదితర దేశములలో స్త్రీసంఘోద్ధరణమునకై ప్రయత్నములు విరివిగా సాగుచుండుటయుఁ జాలవఱకు నవి ఫలవంతములగుచుండుటయు వినుచున్నాము. పరదాయాచారమున నేమి, విద్యావిషయమున నేమి, వివాహవిషయమున నేమి, యాదరణవిషయమున నేమి యెంతయో సంస్కరణావశ్యకత గలిగిన స్త్రీజాతివిషయమై యాలోచించినవారుగాని కార్యాచరణమునకుఁ బూనుకొనువారుగాని యంతగ లేరనుట సత్యదూరముగాదు. మన యాంధ్రదేశమునఁ బైఁజెప్పిన సంస్కరణమువిషయమై నడుముగట్టుకొని నిరుద్ధప్రవర్తనమున నాచారముల లెక్కచేయక కార్యమునకుఁ గడంగినవారు శ్రీ వీరేశలింగముపంతులుగారు. ఆమహాత్ముని యనంతర మంతటి యాలోచనాపరులుగానీ యట్టిదీక్షాపరులుగానీ యంతగ లేరు. అగుట కార్యమున్సైత మంతమాత్రముగ నేయున్నది. ఉన్న స్వల్పమునైనను లోకము మెచ్చుకో కుండినందులకు విచారము.

ఏతత్సంస్కరణవిషయమునఁ గల యీయలసత్వమునకు నిదానమెద్ది? సంస్కరణ మెంతవఱ కావశ్యకము? ఎట్టివిధమగు సంస్కరణము వలయును? అనువిషయవిమర్శనమునకు గడంగినవారును లేరు. పూర్వముకన్న జనసంఖ్యయు, నాగరికతయు, విద్యాభివృద్ధియు, వివేచనాశక్తియు మహిళామణులలో నేఁడు విశేషముగఁ గాన్పించుచున్నది. ప్రాచ్యపాశ్చాత్య విద్యలయం దాఱితేరినయువతులు పలువురున్నారు. పాండిత్యప్రకర్షముఁ జూపుచు మృదుమధురములగు వ్యాసములు వ్రాయు నారీమణులున్నారు. స్వీయప్రతిభావిశేషమున దేశమునంతను నబ్బూతలూగించెడి మహిళామతల్లులున్నారు. కాని తమసంఘోద్ధరణమునకై వలయు కార్యమునమాత్రము వారిమనస్సు ప్రచలించుట లేదు. అట్టియువతీమణులకు దేశమింతయుఁ బ్రోత్సాహమునిచ్చుట లేదు.

యావద్భారతరాష్ట్రమునకు నిమేషమేనియు మనస్స్వాస్థ్యముగలిగింపని రాజకీయాందోళనము నేఁడు తీవ్రప్రచాలనముననున్నది. అగుటఁ జాలవఱకు ప్రజలచిత్తము లందు లగ్నములై యున్నవి. విరివిగా నారీగణమున్సైత మాయుద్యమమునఁ బాల్గొనుచున్నది. దానితో స్త్రీజాతికిఁ గొంత పరిణామముగల్గినది. కాని కలుగవలసినంతగలుగలేదు. కలిగిన స్వల్పమైనను తీరైన తెన్నున లేదు.

పూర్వమున నన్ని విషయములలోను బ్రాశస్త్యమునందిన స్త్రీజాతి నేఁ డిట్లధఃపతితమై తొల్లింటితేజము గోల్పోవుట కెంతయువిచారము. తనపాతివ్రత్యప్రభావమున దుష్టచిత్తుని దహించిన మహాతల్లిచరితమును, సాహిత్యనిధియై మహారాజాస్థానపండితుఁడైన తండ్రికి విద్యావిషయమున మహోపకారముచేసిన పండితురాలివృత్తాంతమును, దిగ్విజయముచేసి

యోధాగ్రేసరుఁడనిపించుకొనినభర్తకుఁ గదనమునఁదోడ్పడిన ధైర్యవతీచరితమును నేఁడు కేవలకథామాత్రములుగనుండుట యాశ్చర్యము. పట్టపరీక్షనంది విద్యాతిశయముగలిగి యుద్యోగముగలిగి గౌరవకుటుంబమునకుఁజెందినవారమని తలలెత్తుకొనితిరిగెడి పెద్దమనుష్యులుసైతము స్త్రీజాతియెడ నపచారముసేయుచుండుట హృదయవిదారకరము. స్త్రీలు చదువుకొనినచో నితరపురుషులకుఁ బ్రేమలేఖలవ్రాయుదురను మూఢనమ్మకముగలయువకులు నేఁటికి నున్నారనుట వింతగాదు. చేతఁ బుస్తకములుంచికొని విద్యార్జనమునకై పాఠశాలకరిగెడిబాలికను లేనిపోనిమాటలాడి వేళాకోళముచేయు యువకులున్నారు. వేయేల? సంభ్రాంతవంశమునజనించి పవిత్రశీలముగలిగి, పాండిత్యవిశేషముగలిగి, బాలికలకింత విద్యాభిక్షనొసంగ విద్యాశాలకరిగెడి యుపాధ్యాయినులనుసైతము మార్గమధ్యమున ననరాని వినరాని మాటలననుమగవారును నేఁడుగలరు. ఈయన్యాయము నడ్డుపెట్టువారుగాని, యీదుండగమును దొలంగించువారుగాని యెవరునులేరు. ఏనాఁటికైన నీవైపరీత్యము నమయునాయనునదియె సందేహము.

ఇట్టిదుస్థితిని దొలఁగించి జాతినభివృద్ధిపఱచి తొల్లింటిగౌరవము, ఆదరము, తేజము, జవము గలిగించుట ప్రప్రథమముగు కార్యము. స్త్రీ లోకమున కర్ధభాగము. ప్రపంచమున నర్ధభాగము కాంతిహీనమై నత్యుత్సాహములుడిగియుండిన నేపనియుఁగొనసాగదు. కాన స్త్రీపురుషులెల్లరును విజ్ఞానముగలిగి లేనిపోనిశంకలకుఁ దావీయక సంఘమందలి యుత్సాహహీతముల మున్ముందుగ్రహించి తత్సంఘోద్ధరణమునకై పాటుపడవలసియున్నది. స్త్రీలీ విషయమున మొక్కవోని ప్రయత్నముచేయవలసియున్నది. సహృదయులగు పురుషుల సాయము నపేక్షించి ప్రచారము చేయవలయును. దేశమునందెల్లయెడల గ్రామములందు సైత మొక్కొకనారీసమితి స్థాపింపలయును. కొన్ని సమితులకు సమీపపట్టణమున నొక కేంద్రస్థానముండవలయును. సమితిసభ్యురాండ్రు ప్రజలకు నారీసంఘోద్ధరణవిషయావశ్యకతనుబోధించి వారికుద్బోధముగావింపలయును. ఇట్టి సాంఘికవిషయప్రచారమునకును, రాజకీయమునకును సంబంధములేదు. విద్యాతిశయమునందిన యువతీమణులు, భాగ్యవతులైన వనితామతల్లులు, అధికారముగలిగినయంగనలు ధైర్యమువహించి తమజాతియొక్క హైన్యమునెఱింగి, తాము గోల్పోయినస్వాతంత్ర్యమును దెలిసికొని, జాతికిఁగలుగుచున్న దుర్భరమగువిపత్తులనెఱింగి పైఁజెప్పినసంఘములస్థాపించి విరివిగఁ బ్రచారముచేయవలయును.

స్త్రీ లిట్టికార్యాచరణమునకుఁ బూనుకొని దేశమున కొకవిధమగు పరిణామము తేఁజాలకుండిన విద్యాభివృద్ధియగుటకుఁ గానీ, విశాలభావములుగల్గుటకుఁ గానీ, నాగరికత యబ్బుటకుఁ గానీ యవకాశములుండఁజాలవు.

కావున విద్యావిశారదురాండ్రగు శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు మొదలగు మహిళామతల్లులు తమతమ ప్రాంతములలో నిట్టిసంఘములనెలకొల్పి పత్రికలద్వారా తదితర

ప్రాంతములందు సైతము సంఘములు స్థాపింపబ్రార్థించి కార్యముపట్లలోపముగన్పింప నీయక శక్తికొలంది పాటుపడుచుఁ దమసంఘమునకు సంప్రాప్తించిన నైచ్యమునుదొలఁగించి కొనుటకుఁబాటుపడి యుత్తోధికమగు యశశ్శాలినులుగా వేఁకుకొనుచున్నాను. అధికారమే జీవితాదర్శమనుకొనక బానిసత్వమునందుఁగలహైన్యమునెఱింగి తనపదవికి రాజీనామా నొసంగి శరీరశ్రమను లెక్కసేయక సంఘోద్ధరణమునకై జీవితమును ధారవోయుచు నిరతి శయప్రచారముసేయుచున్న శ్రీమతి డాక్టరు ముత్తులక్ష్మిరెడ్డిగారి మార్గమును యువతీ మణులెల్లరు త్రొక్కుదురుగాక!

# దశావతారములాలి

శ్రీమతి చిరంజీవి వసంతా దేవిగారు

(కస్తూరిరంగరంగా అనుమెట్టు)

శ్రీరమారమణలాలి యాశ్రేందు శేషపర్యంక లాలి॥
క్షీరాబ్ధిశయనలాలి సురవరార్చితపాదయుగళ లాలి॥
వారిచరరూపమెత్తి సోమకుని వధియించి వేదములన్
నీరజాసునకిచ్చిన నిగమసంచార పరమేశ లాలి॥
సురులకోసరము నీవు పైన మందరగిరిని మ్రోయవలసి
వరకమఠమై వెలసిన వైకుంఠవాస పరమేశ లాలి॥
ధరణబ్ధిలోత్రోయను మదిలోనదలచిన కనకనేత్రుని
వరహావతారమెత్తి వధించితివి వనజభవజనక లాలి॥
హరియెక్కడున్నాడని దైతేంద్రుడడుగ ప్రహ్లాదుకొఱకై
నరుదార స్తంభమందు నుదయించినట్టి నరసింహ లాలి॥
అమరగణములను దోలి స్వర్గలోకమును తా బలియేలగా
నముచిసూదనున కజుడై ఆబలి నణచిన సుధీర లాలి॥
యిరువదొకమారు ధరణీపతుల శిరముల అవనీతలముపై
దురమున నఱకిచంపిన మహాభయంకర పరశురామ లాలి॥
దినమణికులాబ్ధియందు దశరథాధిపసూనుడై జనించి
జనకరాజసుపుత్రిచేకొన రావణునిచంపు రామ లాలి॥
కడుప్రళంబాదైద్యుని శిరముప్రక్కలుగాగ నొకముష్టిచే
యిలపైని గూల్చియశమున్ పొందిన బలరామమూర్తి లాలి॥
భూమిభారము తీర్పను భువిలోనపుట్టి దనుజులనుగొట్టి
క్షేమమునొసగి ఖ్యాతినిచేకొన్న శ్రీకృష్ణదేవ లాలి॥
కలికితురగంబునెక్కి కరములో ఖడ్గాయుధము ధరించి
కలిమ్లేచ్ఛులైన జనుల కలికివై ఖండించు దేవ లాలి॥




— మామిడికాయ మర్బా —

పచ్చిబంగినిపల్లి మామిడికాయలు పెద్దవి డజను చెక్కుతీసి ఒక్కొక్కముక్క అరఅంగుళము వెడల్పు 2 అంగుళములు పొడుగుగా కోయవలెను. కోసిన ముక్కలను సున్నపుతేటనీళ్ళలోవేసి పావుగంట వుంచిన ఎడల ముక్కలకసరుపోవును. సున్నపు నీళ్ళల్లో వేసిన ముక్కలను తీసి మజ్జిగతేటతో కడగవలెను. తరువాత ముక్కలను మంచినీళ్ళతో కడిగి శుభ్రమైనగుడ్డలో తుడవవలెను. కళాయిప్రాతలో 2 వీసెల చక్కెరవేసి అరశేరు నీళ్ళుపోసి పొయ్యిమీదపెట్టి పాకము ముదురుపాకము అనగా ఒక పళ్ళెములో మంచినీళ్ళుపోసి అందులో కొంచెము పాకముపోసినఎడల గట్టిగాఅవును. అప్పుడు పాకములో తుడిచివుంచిన ముక్కలను వేయవలెను. ముక్కలు వేయగానే పాకము పలుచబడును. పలుచబడినపాకము ముదుగుగావండి దించవలెను. చల్లారిన తరువాత మరజాడీలో వేసి ఎండలో 2 దినములు పెట్టి తరువాత జాగ్రత్తగఉంచిన సంవత్సరమువరకు నిలువవుండును. చాలారుచికరముగా ఉండును. ముక్కలను సన్నగాతరిగి ఈవిధముగా చేసినఎడల జామ్అవును.

—కోకా ధనలక్ష్మమ్మ.

— చంద్రకాంతలు —

1 శేరు పెసరపప్పు నానవైచి గట్టిగనుండేలాగు రుబ్బవలెను. తరువాత పెసరపప్పంతే 1 శేరు పంచదార తెచ్చి పాకముపట్టి ఆపాకమున నీపెసరపప్పు ముద్ద పడవైచి గరిటెతో కలుపుచుండవలెను. కొంతసేపటికి కది బల్లమీద పోయుటకు తగిన పాకములోకి వచ్చును. అప్పుడు ఏలకగింజలు, కుంకుమపువ్వు, పచ్చకర్పూరము, కొద్దిగకస్తూరి మొదలగు సుగంధద్రవ్యములువేసి కలిపి దింపవలెను. దాని నొకపీట మీద పలచగబోసి తయారనియ్యవలెను. తరువాత వది అచ్చువలెనగును. అప్పుడు దానిని చాకుతో చిన్న చిన్న ముక్కలుగా కోయవలెను. మనకు ఏయాకారములో నెంతెంతముక్కలు కావలయునో అంతంత కోసుకొనవచ్చును. వాటిని నేతిలోగాని నూనెలో గాని వేసి వేచి తినినచో ఎంతో రుచిగనుండును. వీటినే చంద్రకాంతలంటారు. చంద్రుణ్ణితింటే నోట్లో వేసుకొనేటప్పటికి ఎల్లా కరిగిపోతాడో ఇవిఅల్లా కరిగిపోతాయి. అందుకే వీటి కాపేరు వొచ్చిందట.

—కొలచ నరసమ్మ.

—రాయలసీమ పుష్పాపు ఒబ్బట్లు—

కాలుపడి పచ్చిపిండికి, అనగా బియ్యపుపిండికి, నీళ్ళు పిండికైనకొంచము తక్కువగా ఎసరుపెట్టేది. ఆజలము బాగామరుగునప్పుడు 5 పలముల బెల్లము వేసి ఈపిండిపోసి వుప్పేది. బాగ చెండువలె కావలె. దానిలో కొంచెము యేలకబుడ్డలు పొడిచేసి వేసేది. పిమ్మట కాలుపడి మైదాపిండి ఒక్కవువ్వారాయివేసి బాగనీళ్ళుపోసి ముద్దకలిపి నిమ్మకాయంత వుండలు చేసి, కొంచెము వల్లెగాచేసుకుని దానిలో ఈపూర్ణం నిమ్మకాయంతవుండపెట్టి పైవల్లె బాగుగమూసి అనీటి యాకులో హోళిగవలెతట్టి పెనములోవేసి కాలనిచ్చి

తయారు చేసి వుంచుకునేది. దానిలో వేసి భుజించుటకు మంచి మల్గోవా, కాదర్, పీటర్, దాడి, బంగినపల్లి, సువర్ణరేఖలు ఇటువంటి మంచి మామిడిపండ్లు బాగ వలిచి రసంపిండుకునేది. ఆరసంలో పీచుగీచు ఏమిలేకుండ శోధించి ఒకపాత్రలో వుంచేది. ½ పడి రసమునకు 5 తులముల చక్కెర పాకుపట్టేది. 2 అంగుళముల తీగపాకానిచ్చి ఈపండ్లరసము పాకులో పోసి అల్వా మిషంగరికెతో బాగ కలుపుతూవుంటె నీరంతయు ఇంకి అనుకుగానుండును. దానిలో కొంచెం ఏలకి పొడివేసిదింపి కొద్దిగా తేనెవేసి సైజుబ్బట్లులో వేసుకొని భుజించిన ఈజాము చాలబాగుండును. ఈ జాము మిగిలిన ఒకగ్లాస్‌జాడిలో ఎత్తిపెట్టినట్లయిన 8 లేక 10 రోజులు ఉండును.

— కంకిపాటి రుక్మిణమ్మ.

## — సాజ్జపూరి చేయు విధము —

పావుసేరు పాలు నీళ్ళుకలిపి ఎసరుపెట్టేది. కాగిన తరువాత అర్ధపావుసేరు సీమరవ అప్పాచక్కెర ముక్కాలు పావుసేరుకలిపి ఉంచుకొని కాగుచున్న ఎసరులోపోసి బాగ పొరపవలెను. బాగా అల్వా అయినవెనుక ముంతమామిడిపప్పు, సారపప్పు, దోసపప్పు అన్నియు కొద్దిగావేసుకొని అల్వాలో కలియపెట్టవలెను. పావుసేరు మయిదాపిండి కొద్దిగాచక్కెర వేసి గట్టిగాకలిపి అప్పడములొత్తవలెను. ఈసాజ్జని మంచి నిమ్మపండ్లంత ముద్దలుచేసి అప్పడములోపెట్టి అప్పడము ముద్దచుట్టు వేయవలెను. మరల అరటి ఆకులో అప్పడముమాదిరి తట్టి చేతిలో వేయవలెను బాగా పూరిమాదిరి పొంగును. కొంచెము ఎఱ్ఱగా వచ్చిన తరువాత తీయవలెను. ఇదేమాదిరి అన్నము చేయవలెను.

— దరిశి సుబ్బరత్నమ్మ.

## — మితాయికిచడి —

సేరు సన్నబియ్యమును పావుసేరు పెసరపప్పును శుభ్రముగ కడిగియుంచుకొని పొయ్యిమీద అత్తెసరు ప్రమాణముగ నీళ్ళు యెసరుపెట్టి ఆనీళ్ళలో కడిగిన బియ్యము పప్పును వేసి, మూతపెట్టి సన్నపుమంట పెట్టవలయును. యాలకులు 1 తులం పొడిచేసి ఒక కొబ్బరికాయ కోరుమును కలిపి బాణలిలో కొంచెమువెన్న కాచి దానిలో నీరెండింటిని వేసి కొంచము వెచ్చజేసి తీసి ఉడుకుచుండు కిచడిలోవేసి కలియపెట్టవలెను. ఇట్లుకలిపి మూతపెట్టి 10 తులములవెన్న కిచడిలో వేయవలెను. అటుపైని ఇష్టమున్నమట్టుకు చక్కెర వేసి బాగా కలియపెట్టి, దించి నిప్పులపయిని పెట్టి కొంచెము సేపుంచి తీసి వినియోగించవచ్చును. ఇట్లు తయారైన కిచడి మూడురోజులవరకు చెడకుండా నుండును.

— కోక పంకజమ్మ.

## — కరక పచ్చడి —

ఈజేష్ఠఆషాఢమాసములలో కరకపిందెలు కొండల ప్రాంతములలో సమృద్ధిగాదొరకును. వాటిని 3-4 పళ్ళపిందెలను పెద్దపాత్రలోపోసి పిందెలు మునగ నీళ్ళుపోసేది. ఆరోజంతాఉండనిచ్చి మరుసటిరోజున ఆనీరంతయు వంపివేసి మరల నీరు పోయవలయును. మరల రెండవరోజు అట్లేచేయవలయును. మూడవ రోజు పిందెలన్ని ఒకబుట్టలో వడపోసి నీరంతయు వడగనిచ్చి రోటపోసి దంపి ఉసిరికపొట్టువలె అంతయు విత్తులేకుండచేసి, ఒకపెద్దరాతిచిప్పలో కొద్దిగ కరకపొట్టువేసి దానిపైన ఉప్పుకొద్దిగ పసుపుపొడి వేసేది. ఇట్లు పొరలుపొరలుగా దానికి తగినఉప్పు పసుపుచేర్చి బాగుగమూతపెట్టియుంచిన ఒక సంవత్సరంవుండును. దానిని కావలసినప్పుడు వారమునకు పదిరోజులకు ఒకసారి కమలాపండంత పచ్చడికి వుసిరికకాయఅంత చింతపండు దానికితగిన మిరపకాయలు కొద్దిగా మెంతి, ఆవ, జీలకర్ర, ఇంగువ తిరగబోతవేసి నూరి, భుజించినట్లయితే రుచికరముగా నుండును. కాలప్రవర్తి బద్ధకముగానుండువారు చింతపండు తక్కువచేసి కొద్దిగా ఆముదమువేసి తిరగపోసి మొదటిఅన్నములో భుజించిన సాఫీగా ప్రవర్తి అగును.

— కంకిపాటి రుక్మిణమ్మ.

# గోదావరీజననము

హరి సుబ్బారావుగారు

తపోగరిష్ఠుడగు గౌతముడు అహల్యాసహితుడై బ్రహ్మశైలమున వసియించుచుండెను. ఆసమయమున నూరుసంవత్సరము లనావృష్టిగలిగెను. గౌతము డప్పుడు ప్రాణాయామపరుడై వరుణునుద్దేశించి తపంబొనర్చె. వరుణుడు ప్రీతుండై గౌతమునెదుట ప్రత్యక్షమై అతనికి నొకపుష్కరిణిని అక్షయజలసమృద్ధిగలదానిని అతనిపేర బరగగలదానిని నిర్మించియిచ్చెను. మహాత్ముండగు గౌతముండట్లు దుర్లభంబగు జలంబును సంపాదించి నాజలమూలంబున హోమార్థంబుగ యవనీవారాదిసస్యంబులను సంపన్నంబులగావించె. అప్పుడీ భూమండలంబున గౌతమతపోవనం బొక్కటియే సస్యసమృద్ధమైయుండెను. సత్కర్మపరాయణులగు మును లనేకులు పుత్రశిష్యసమేతులై యయ్యాశ్రమంబున వసియించియుండిరి. ఇట్లుండ నొక్కనాడు మహర్షియగు గౌతముడు జలాపహరణార్థము కొందఱుశిష్యుల నాగౌతమపుష్కరిణికిం బంపించెను. అప్పుడు కొందఱు మునిపత్నులా గౌతమశిష్యులం గాంచి మేము జలంబుగైకొని పోవువంతవఱకు మీరు దూరంబుగనుండుడని పలికిరి. అమ్మాటలకు శిష్యులు కుపితులై వెనుదిరిగివచ్చి గురుపత్నియగు నహల్యకావృత్తాంతము నివేదించిరి. అప్పుడా యహల్యాదేవి శిష్యులనాశ్వాసించి, మునిపత్నులను బుజ్జగించి యంతటనుండి నిత్యమును స్వయముగబోయి జలమునుగొనితెచ్చి తానే యాగౌతమునికి సమర్పించుచుండెను. మహర్షి యాజలంబులచేతనే నిత్యకర్మానుష్ఠానంబు గావించుచుండెను. అదియంతయుగాంచి ఋషిపత్నులు స్త్రీస్వభావసులభంబగు నీర్ష్యచేనొకనాడా మెనుగూడ తిరస్కరించిపోయి తమతమ భర్తలతో కొండెములు చెప్పిరి. అమాటలనమ్మి మునులొకనాడు గౌతమాశ్రమంబునకుబోయి యహల్యమూలంబున తమపత్నులకు గలిగిన పరాభవంబులం దెల్పిరి. అమ్మాటల నాకర్ణించి యచ్చటివారందఱును మునిపత్నులవాక్యంబులు సత్యంబులనినమ్మి విచారించి గౌతముని, అహల్యను ఎట్లు పరిభవింపగలమా? ఎట్లువారిని యిచ్చటనుండి వెడలగొట్టగలమా? అని ఆలోచింపదొడంగిరి. సిద్ధివినాయకునిగూర్చి తపముసల్పిరి. వినాయకుండు ప్రసన్నుండై వరంబు గోరుకొమ్మనుటయు నందఱేకవాక్యముగా గౌతముని నయ్యాశ్రమంబునుండి వెడలగొట్టుటకుదగినయుపాయమును మాకనుగ్రహింపుమని ప్రార్థించిరి. దానికి గణనాయకు డిట్లు బదులుచెప్పెను. "ఓఋషులారా! మీరందఱు కఱవుకాలమున నెట్టిగతియును లేక దుఃఖావస్థయందున్న సమయంబున గౌతముడు దయామయుడై మీకు సుఖమును ప్రసాదించియుండెను. మీరిప్పుడాతనికి దుఃఖమునుగూర్పవలయుననితలంచుట కేవల మయుక్తము. మీరు దుష్టపత్నీసంసర్గంబున నవివేకులై యిట్టి దుష్కార్యముగావించినను నిశ్చయముగా నిది యిమ్మహర్షికి హితకరంబె కాగలదు. మీరిట్లపచారముగావించినను మరల నతడు మీకుపకారమునే చేయును." ఇట్లుచెప్పి గజముఖు డంతర్ధానమునొందెను.

ఇది యిట్లుండ దేవాసురులు సముద్రమథనము చేయునప్పుడు మొదట వెలువడిన విషమును పానముచేయ జనించిన తాపమును సహింపజాలక తాపోపశమనము కొఱకు నీశ్వరుడు తన జటాజూటమున గంగను ధరించి యామెయం దెక్కుడుప్రీతిగలిగియుండెను. తనయందనాదరముగల వాడగుటను పార్వతిగ్రహించి తన కుమారులగు విఘ్నేశ్వరుని, కుమారస్వామిని, పుత్రికయగు జయాదేవినిజేరి యావృత్తాంతమును వారలతో జెప్ప గణనాయకుడు కొంచమాలోచనానిమగ్నమానసుడై యిట్లనిచెప్పదొడంగె. "జననీ! విచారింపకుము. భూలోకమున నూరువత్సరములనుండి యనావృష్టిదోషముచే నన్నోదకములులేక జనులు మలమలమాడుచున్నవారు. తద్విషయమున్గ్రహించి కొవ్వూరను పుణ్యక్షేత్రమున తపముచేయుచున్న గౌతమమహాముని సత్రయాగ మారంభించి తన తపోబలముచే ప్రజలకన్నోదకము లిడుచుండె. ఆఋషివర్యుడే మాజనకజటాజూటమునందున్న గంగనుగొనిపోవ సమర్థుడుగాన నే నచ్చటకుబోయి యొకానొకయుపాయముచే నీకార్యముసాధించి

రాగలమని చెప్పి యామె యాజ్ఞను బొంది గణాధిపషణ్ముఖజయదేవులు బయలుదేరిరి. వారట్లు గౌతమాశ్రమము జేరి మృష్టాన్నమును భుజించుచు సత్కథాకాలక్షేపము సేయుచు గౌతమాదుల కానంద మొసగూర్చుచుండిరి. అంత గణపతి యొకానొకదినమున జయాదేవిని వృద్ధగోరూపము దాల్చి సస్యభక్షణముఁ జేయ నాజ్ఞాపించెను. అంతట నద్దేవియు గోరూపము దాల్చి సస్యభక్షణము జేయుచుండె. దానిని గని గౌతమముని తృణమును విసరివైచె. ఆకపటగోవు తృణస్పర్శచేఁ బ్రాణములు వాసె. అంత ఋషులందరు నాసంగతినిఁ జూచి గోహత్యాపాతకుఁడని గౌతమమహామునిని దూఱి తదాశ్రమము వాసయోగ్యము కాదని దర్భాసనములను భుజములమీద వైచి బయలుదేర నారంభించిరి. గౌతము డది చూచి విచారించి పాదాక్రాంతుడై పాపనివృత్త్యుపాయముఁ జెప్పరే యని వారిని బ్రార్థించె. ఋషివేషమును దాల్చిన కుమారస్వామి "శివజటాజూటమందలి గంగను గోవుమీదుగాఁ బ్రవహింపఁజేసిన నీకలుషము వాయు" నని చెప్ప గౌతమమహాముని త్రియంబకపర్వతమున కేగి యీశ్వరు నారాధించి తత్ప్రసాదమున గంగను దనయాశ్రమము వఱకుఁ బ్రవహింపఁజేసి గోవున కుత్తమలోకములు సేకూర్చి పాపరహితుఁడాయె. తదుపరి సప్తమహాఋషులు గౌతముని బ్రార్థించి గౌతమి నేడుభాగములుగాఁ గొనిపోయి సముద్రమును బొందించిరి.

# గౌతమికథ

౧

క. గంగాధరుఁ డిచ్చిన వర
మంగైకొని గౌతమమునిముఖ్యుఁడు వనులన్
దుంగాద్రితటములంబడి
ముంగలఁ దాఁ బోవుచుండె మోదస్ఫూర్తిన్.

ఉత్సాహ. పిలువఁ జూడ రాదటంచు
వేడ్క సేని భీతి సేన్
పరప్రసాదుఁ డమ్మునీంద్ర
పర్యుదృష్టిమల్లినా
ఝుకీమతల్లి యంతరించు:
జాలు నఱదరాదిఁకన్
ద్వరన్ ద్వరన్ మునీంద్రుఁ డట్లె
పాఱుదీసె ముంగలన్.

సీ. నాసికాత్ర్యంబకనగసీమ వెల్వడి
నవ్యమహోద్ధతి భవ్యమగుచుఁ
దననడన్ జెనఁగొను తరుమూలనిచయమ్ము
నందందుఁ గాల్చి పైన్ సందడిగను
మునుముందుఁ బఱువెత్తిపోలేక నీర్మ్రింగు
మృగసంతతుల యార్పుమించి ప్రోకి
నడపాటునను దొర్లిపడి దిశలదురంగ
జాలతాలనుగొట్టి రహిఁ జెలంగి

## కవికొండల వేంకటరావుగారు

గీ. వెనుక జనుదెంచు వాహిని విభవమెట్టు
లున్నదో యని యట్టితా నన్నమాట
మఱచి కన్గొని వాఁడు సన్మానియతఁడు
లేదు - లేదు - గోదావరి రాదొకింత.

క. ఆముని క్రమ్మఱఁ దపమున్
సోమధరునిగూర్చి చేయఁ 'జాడకు' మనుచున్
'నీమంబున నుండుమ' యని
యామఱువరమిచ్చె మునియు నరిగెను మఱలన్.

ర. పాపికనుమఁ బగులగొట్టి
ఆపరానిదగుచుఁ దొట్టి
భోరుకుభోరుకు ముఖరితరుతి
వెలికిఁ దొఱగి వెల్లువ ధ్రుతి.

చ. సమపులినంపు మెత్తనగు
చాయలనింకుమఁ బొంగుమన్ మెఱిన్
గొమిరెపుఁ గామినింబలెను
గొప్పగ వెంటను వచ్చుచున్న ఆ
యమరనదీసమాసయగు
నార్యనదిన్ వెనుఁజూచె వెండి సం
యమి విజితేంద్రియుండయుయు
'మహాద్భుతమే' యని పట్టనేగమిన్.

క. నదిలేదు: నా స్త్రిసీరము:
మొదలిడిన ప్రయత్నమెల్లమునికి వృథకదా

పదపడి వెడలెన్ శివుఁడయు
గోదయును బరమింకొకవరి నుదకముగాగన్.

ఉ. మునిరయమున్న నడువనాగ
మునికి వెనుక నడచెనెన్
ముని వెనుకకుఁ జూడఁబోడు
మునికిముందునడియఁబో
దవపరత ము గౌతమీమ
హానదీయనంగ న
మ్మునివెనుకనె యబ్ధిదాఁక
పూజ్యమా మనదిచనెన్.

౨

క. గిరులనుచు వనములనుచున్
జలధియనుచును దరువులనుచు జంకక రయే చే
టరు దెంచుచుండు గోదా
వరి! నిన్నుఁ బ్రస్తుతింపవశమే మాకున్?

సీ. ఇసుకతిన్నెలతోడ నెసఁగుచునుండు నీ
వీదరికాదరి లేకమైతి
ఒక చిన్నకొలఁకట్టు లోప్పచుండెడు నీవు
తరియింపఁజాలని ఝరిణివైతి
చలనమించుక లేక యలరుచునుండు నీ
వాపజాలని ప్రవాహంబవైతి
స్వల్పనీరముతోడ పరలుచుండెడు నీవు
వర్ణనాతీతాంబుపూర్ణవైతి
పరయుటకు నెంతో సామాన్యమైన నీవు
సృష్టిలో పలఁగనఁదగు చిత్రమైతి
వహవా! నిర్జీవమైతోఁచునట్టి నీవు
సకలసత్వ్యయుతంబగు శక్తివైతి.

చ. నురువులుగొట్టుకొంచును వి
నూతనశక్తిని నెల్లచూపుచున్
గెరటములం గలంగుచును
గ్రేలుచు నొక్కవిధంబునన్ పడిన
మెఱకని యల్లమంచును గ
జింపక వెల్లువయౌదువచ్చు నీ
పఱదను జూడ మాకుఁ గను
బండువయయ్యెడుఁదల్లి! గౌతమీ!

సీ. వ్యవసాయములులేని వంధ్యభూములకైన
పసగలిగించెడు పసలుతోడ
ఎండిపోవుచునున్న నెట్టిసస్యముకైన
ఫలియింపఁజేసెడు జలములోడ
పడిపోవుచున్నట్టి పాడుగృహముకైన
భువనభవనమొసఁగు కలపతోడ
నడుపలేకుండెడు నాకలకైనను
బరువెత్తఁజేసెడు వాలుతోడ
కరముమూర్ఖతనుండెడు నరునకైన
కౌతకంబెడఁగొల్పెడు గతులతోడ
మాకుఁ బ్రత్యక్షమగునట్టి మాన్యతటినీ!
పలుకఁదగుఁగద నిన్నుఁ "గల్పవల్లి"యనుచు.

క. ఎటొ నాసికకడఁ బుట్టియు
నిట నీసామర్థ్యమెల్ల యేర్పడుటరయన్
దిటముగఁ బరోపకారం
బెటనైన జలుపదగునని యెంతయుఁజాటున్.

# గౌతమీగంగ లవణాబ్ధి గాఁగిలించె

సీ. త్ర్యంబకాచలశిఖాగ్రమునందు నుదయించి పొదలియార్యావర్తభూమిదఁటిసి
మలగి దండకవనీమధ్యభాగమున నా ప్రస్రవణాచలప్రస్థమొఱసి
పట్టిస శ్రీవీరభద్రేశు సేవించి తీరసోమేశుమందిరముఁజూసి
యేదియనంతభోగేశ్వరస్థానంబు రుద్రపాదములపైఁ ద్రోవగాఁగఁ

గీ. గోటిపల్లిశుకోమలాంఘ్రులకు మ్రొక్కి
కుండలాముఖతీర్థంబుఁ గుస్తరించి
భీమమండలిఙావలఁ బెట్టుకొనుచు
గౌతమీగంగ లవణాబ్ధి గాఁగిలించె.

# బాలవిజ్ఞానశాఖ

౧. పదము

## సమిత్ఖండము

శ్రీమతి శ్రీపాద శారదా దేవిగారు

[సమిత్ఖండమను పేరున నొక ద్విపదకావ్యభాగము తాటియాకుల పుస్తకముచూచి వ్రాయబడిన లిఖిత పుస్తకమునందు ఉండగ నేనుజూచుట తటస్థించినది. ఆలిఖితపుస్తకమున గౌడపురాణము, అశ్వశాస్త్రము, పశుశాస్త్రము మొదలగు కావ్యభాగములు లిఖింపబడియున్నవి. ఆపుస్తకమునందు మొదటిపుటలలోనున్న పైగ్రంథ భాగము చదువుటకింపుగా నున్నందున నేనొక ప్రతిని వ్రాసికొని ప్రకటింపపంపితిని. దానిలో నెచ్చటను గ్రంథకర్త పేరులేదు. లేఖకదోషములు పెక్కులున్న వానిని సవరించివ్రాసితిని. ఇంకనుకొన్ని వాక్యములు అర్థముకానివికలవు. కొన్ని యతిదోషములును గానవచ్చుచున్నవి. ద్విపదరూపముననున్న గౌడపురాణమున నైజాంరాష్ట్రములోగల కొలనిపాకయను చారిత్రకస్థానమున వీరశైవులకును, జైనులకును పూర్వముజరిగిన మతయుద్ధమునుగూర్చివర్ణనముగలదు. ఆవిషయమునుగూర్చి వ్రాసికొనవలెనని తలంచుచుండగా ఆలిఖితపుస్తకపు యజమానులు అవసరముపడి స్థలాంతరమునకు గొనిపోవుట తటస్థపడినదని వ్రాయుటకు చింతిలుచున్నాను.]

కలికిసామెతలెల్ల
కళలుల్లసిల్ల
తెలిపెదవినుబాగ
తేటతెల్లముగ
దరిలేనిబావిని
తరణలేనిశీవి
సరిపోనితగవు హా
స్యములేనినగవు
నడలేనిహయము మ
న్ననలేనిప్రభువు
పాడిగానిపిండి యిం
పునులేనితిండి
గయ్యాళిదుండి కా
పకురానిబెండి
కయ్యాలపొరుగు విరా
గడలేనిపెరుగు

పొగడనేరనిభట్టు
పోగుచనుకట్టు
మొగనితో జగడాలు
మొరిగేటిఆలు
సమసిననాలు వా
సనలేనిపూలు
భ్రమలేనిమరులు సం
పదలేనిసరులు
హీనునికలిమి వా
హినిలేనిచెలిమి
లేమిడివిటుడు యే
లికలేనిభటుడు
తామసయోగి ప
థ్యములేనిరోగి
తనివితీరనిచల్ల
తల్లిలేనిపిల్ల

ధనవంతునితోపోరు
దబ్బరనోరు
కలలోనిధనము సా
గనిపెద్దతనము
నలుగురొప్పనిమాట
నడువనిబాట
గడిలేనికోట రా
గములేనిపాట
విడువనిఝుళ్ళు (జల్లు)కో
వెలలేనిఊళ్లు
మొండిపోయినవర్లు
వెలయాలిమర్లు
గండివెయ్యనిచెర్లు
కట్టనిబర్లు
కొంగలుగలమర్లు
కూలేటిదర్లు

అంగన లేని యిల్లు
అతుకనిపల్లు
కడలేనితంట ప
క్వముగానివంట
చెడినకాపురమంట
చపలునిదంట
దారిగాగనుమంట పె
ద్దలు బలుకుచుంట

ధారుణిలోన య
థార్థంబెగాని చెలుకు
దయలేనిచెలియ యి
మ్మహీనలమినప్రేమ
హెచ్చెనపోలేమి
వనితలలామ!
వైకుంఠభవనుండు

వనిత! కృష్ణుండు
యువిద! ననువిడనా
డోకయింతిగూడి
నెయ్యంబుననురాడు
నీవై ననేడు
తొయ్యలి! పోవమ్మ
తోడితేనమ్మ.

2. పాటలు

## జోలపాటలు

శ్రీమతి యన్. వి. సరళాదేవిగారు

ఆడుకో ఆడుకో అందాలబరిణ
కులకులనాట్యాలు కుప్పపడియేని
పాడుకో పాడుకో రత్నాలమొలక
తేనెవాకలుమమ్ము ముంచుకొచ్చేని.
ఏడువకు ఏడువకు వెఱ్ఱినాతల్లి
ఏడిస్తెనాగుండె దిటవుజారేని.
ఓబాల మీమామ యెటువంటివాడు
రామువంటీవాడు రమ్యగుణశాలి.
ఓతల్లి మీయత్త యెటువంటిదమ్మ
తేనెగుండెకలది సీతవంటిది.
ఓచిట్టి మాబావ యెటువంటివాడు
అందమైనవాడు అతడుచంద్రుండు.

ఓతల్లి మీయక్క యెటువంటిదమ్మ
మురిపాలనొలికేటి మొలకవెన్నెల.
పేరేమి? పేరేమి? మురియాలపేరు
ఆపేరుకాదమ్మ నీదైనపేరు.
ఆపేరుకాదోకో ఆపేరుకాద
అట్టయితేనాపేరు చిట్టిరాధమ్మ.
నీవురాధవైతే మురిపాలమొలక
నీచిన్నికృష్ణుండు నినుచెట్టపట్టు.
ఆడుబిడ్డలతల్లి ఆనందవల్లి
ఆడబిడ్డలఇల్లు అందాలపెల్లు.
కొడుకులనుకన్నట్టి కోమలినిజూడ
బంగారుపండులదోస స్మృతికొచ్చు.

3. కథలు

## ఇంకా పదిహేనురోజులు

శ్రీమతి నాయని హనుమాయమ్మగారు

ఒకపేదరాలికి అమావాస్యఎప్పుడో తెలుసుకోవలసిన అవసరంవచ్చింది. ఆదినం పౌర్ణమివెళ్ళిన పాడ్యమి. కొడుకునిపిలిచి 'నాయనా! పొరుగూళ్ళోవున్న బాపనయ్యను అమావాస్య ఇంకా ఎన్నాళ్ళుందో కనుక్కోనిరా' అన్నది. సరేనని వాడు అట్టహాసముగా బయలుదేరినాడు. పొరుగూరుచేరి పురోహితుణ్ణి అడిగినాడు. అతడు పంచాంగం పార చూచి 'అమావాస్య ఇంకాపదిహేనురోజులువుంది' అన్నాడు. ఆమాట ఎక్కడమరచి

పోతానో అన్నభయంచేత కుర్రవాడు 'ఇంకా పదిహేనురోజులు, ఇంకా పదిహేనురోజులు' అనుకుంటూ ఆపూట చెరువుగట్టుమీదుగా ఇంటికిమళ్లినాడు. ఆచెర్లో ఒకపల్లెవాడు పదిహేనురోజులుగా వలపన్నుతున్నాడు. కాని చేపాజెల్లా ఏమీవలలోకి రావడంలేదు. పల్లెవాడిప్రాణం విసిగిపోయింది. ఆసమయంలో ఇంటికివెళ్లుతున్న మనకుర్రవాడిస్మరణ వాడికి వినపడ్డది. తటాలున వెనక్కుతిరిగి కుర్రవాణ్ణిచూచి వొళ్లుమండి 'ఓరీ! భడవా! చచ్చి చెడి పదిహేనురోజులనుండి కాచుకున్నవాణ్ణిచూచి నీకుఇంత వేళాకోళమా!' అంటూ పల్లె వాడు కుర్రవాడుఎదురుతిరిగి 'అయితే ఇంకేమనమన్నావ్?' అన్నాడు. 'ఇదుగో ఇప్పుడే రావాలె' అనమన్నాడు పల్లెవాడు. 'ఇదుగో ఇప్పుడేరావాలె, ఇదుగో ఇప్పుడేరావాలె' అను కుంటూ కుర్రవాడు ప్రయాణంసాగించినాడు. దారిలో ఒకమర్రిచెట్టుక్రింద నలుగురుదొంగలు తీరికగాకూర్చుని దొంగసొమ్ములన్నీ వాటాలువేసుకొంటూ చాలాఖుషీగావున్నారు. అట్టి సమయంలో అఘాట్టుగా కుర్రవాడిస్మరణ వినపడ్డది. ఉలిక్కిపడి వెనక్కుతిరిగిచూచారు. కుర్రవాణ్ణి పట్టుకుని 'ఓరిశుంఠా! తెల్లవార్లూకష్టపడి మేము దొంగలించితెచ్చిన ధనాన్ని పోలీసులకు పట్టిఇవ్వాలని కూస్తున్నావా?' అని బడితెపూజచేశారు. ఆదెబ్బలకుకూడా తట్టుకుని 'అయితే ఇంకేమనమన్నారు?' అన్నాడు కుర్రవాడు. 'ఎత్తుకోవాలె, బుజానపెట్టు కోవాలె' అనమన్నారు దొంగలు. ఆమాటబట్టుకొని వల్లించుకుంటూ కుర్రవాడు వూళ్లో పడ్డాడు. చాలారోజులుగా జబ్బుగావున్న పెద్దకాపుకూతిరికి ఆనాడు క్రిందిట్లు మీదట్లుగా వుంది. అందరూచుట్టుచేరి గోలుగోలుమంటున్నారు. ఆసమయంలో వాళ్లకు కుర్రవాడి స్మరణవినపడ్డది. 'ఓరిదరిద్రుడా! అయిందిపోయింది అనుకుంటూ అసలే మేము మొత్తుకుం టుంటేపైగా ఇదేమి దీవెనరా?' అని నాలుగు ఉతికారువాళ్లు. కొంచెం తమాయించుకుని 'అయితే ఏమనమన్నారు?' అన్నాడు కుర్రవాడు. తిరగమళ్లాలె, తిరగమళ్లాలె అనమన్నారు వాళ్లు. ఆమాటలు పారాయణంచేస్తు ఆబజారులో గ్రామమున్సఫుఇల్లువుంది. మున్సఫు కుమార్తెపెండ్లిఆరోజు. అంతాఉత్సాహంగా వూరేగింపుకుబయలుదేరుతున్నారు. 'తిరగ మళ్లాలె, తిరగమళ్లాలె' అంటూ కుర్రవాడు ఎదురువచ్చాడు 'ఓరివెధవా, శుభమస్తుఅంటే ఏదోఅన్నట్లు ఈఅవకతవక కూతలేమిటిరా' అని కుర్రవాణ్ణి తుక్కురేగతన్నారు పెండ్లి పెద్దలు. వారిలో ఒకఆసామి కొంచెంజాలిగుండెకలవాడు దెబ్బలకుతట్టుకోలేక ఏడుస్తున్న కుర్రవాణ్ణి ఓదార్చి లోపలికితీసుకువెళ్లి బాగాభోజనంపెట్టించాడు. బొజ్జనిమురుకుంటూ కుర్ర వాడు 'అయ్యా! నామాటఏమిటి? నన్నేమనమన్నారు?' అన్నాడు. 'ఏటాఇట్లాగేజరగాలె, ఏటాఇట్లాగేజరగాలె' అనమన్నాడు ఆసామి. బజారువీధికి పండ్రెండేండ్లకొకసారి తగలబడే అలవాటు. కుర్రవాడి గ్రహచారవశాత్తు ఆరోజు ఆనాడేవచ్చింది. ఉన్నట్లుండి ఆవీధిలోని ఇండ్లనిప్పంటుకొని ఘోరంగాతగలబడుతున్నై. ఆమంటనుచూచాడు. ఆబాలవృద్ధులూ పడేపాట్లుచూచాడు కుర్రవాడు. 'ఏటాఇట్లాగేకావాలె, ఏటాఇట్లాగేకావాలె' అంటూపరు

గెత్తినాడు జనంలోకి. ఇండ్లుతగలబడి ఏడుస్తున్న వాళ్లకు ఈమాటలు అగ్నిలో ఆజ్యంపోసినట్లు అయి 'పండ్రెండేండ్లకు ఒకసారి తగలబడుతూ మేము అగసాట్లుపడుతుంటే నీవు ఏటా ఇట్లాగా కావాలె నంటున్నావురా దరిద్రుడా!' అని వారు తలాపొకకొరవితీసుకొని వొంటినిండా వాతలుపెట్టినారు. వొళ్లంతాకాలి ఆమంటలకు తట్టుకోలేక కథానాయకుడు 'అయితే ఇంకే మనమన్నారు' అన్నమాట మరచిపోయి తిన్నగా ఇల్లుచేరుకున్నాడు. తల్లిచూచి 'అమావాస్యఎన్నాళ్లో కనుక్కోనిరారాఅంటె ఇదేమి అవతారమురా? నాయనా! అన్నది. 'ఇంకా పదిహేనురోజులమహాత్వమే' అన్నాడు కొడుకుఏడుస్తూ. కథకంచికి మనంఇంటికి.

## డబ్బు ఎంతపనియైనను చేయును

శ్రీమతి పి. సుభద్రగారు

ఒకబ్రాహ్మడు అతని ఈనలుగురుకొడుకులకు పెండ్లిండ్లుచేసి కొన్నిఏండ్లు పోయిన తరువాత పిలచి నాయనలారా నేను పెద్దవాణ్నిఅయాను. ఇకమీరు ఆ స్తినిపంచుకోండి అని చెప్పాడు. తరువాత కొన్నిరోజులు గడచిపోయాయి. నలుగురుకొడుకులు ఎవరికావరాలు వాళ్ళుచేసుకుంటున్నారు. పాపము ఈముసలివాణ్ణి ఎవరుచూచుటలేదు. ఏమిచేస్తాడు? అనేకఅవస్థలు పడుతూఉన్నాడు. ఏమిచేయుటకు డబ్బులేదు. కోడళ్ళుఅందరు తిట్టటం మొదలుపెట్టారు. ఆలోచించాడు ముసలాడు నాకు డబ్బులేకపోబట్టికదా, నన్ను వాళ్ళు ఆలాచేస్తున్నారు అని. ఒకచిన్న సీనారేకుపెట్టె తయారుచేశాడు. దానినిండా గాజుపెంకులు పోసి ఒకదుప్పికొమ్ము దానిలోవేసి, పైని సీలువేసినాడు. దానిని ఒకమూల పాతిపెట్టాడు. రోజు దానినిపైకితీసి గలగలమనిపించడం, మరల పాతిపెట్టుచుండడం. ఒకరోజున కోడళ్ళు చూచి భర్తలతోచెప్పారు. వారు అదివిని ఏమఱ్ఱోయి మీరు చాలాప్రేమగా చూడండని ఒకడుకంటెఒకడు ఎక్కువగాచెప్పారు భార్యలతోటి. అదిమొదలు ముసలివాడిపని మాబా గుంది. ముసలివాడికి చాలాసదుపాయముగావుంది. కొద్దిరోజులుపోయినతరువాత ముసలాడికి అవసానదశవచ్చింది. అప్పుడు ఒకచీటివ్రాసి ముసలాడుపెట్టెలోపెట్టి మరీ కళ్ళుమూసాడు. అప్పుడు అన్నదమ్ములందరు ఒకేపెట్టెతీద్దామా అనుకున్నారు. వద్దురా నాన్నను దహనపరచి మరీతీద్దామన్నాడు పెద్దవాడు. సరేఅని అందరు తండ్రిని దహనపరచివచ్చి తీయుటకు ప్రయత్నించగా పెద్దవాడుఅన్నాడు ఏమఱ్ఱోయి ఇప్పుడువద్దు ఈఅడావిడిఅయినతరువాత తీసుకుందామన్నాడు. సరేఅని పెళ్ళమంటు దినవారముజరిపేరు. అన్నియు అయిన తరువాత ఒకరోజున అందరుకలసి ఆపెట్టెతీసి మూతతెరిచారు. ఏముంది! అన్నీ గాజుపెంకులే. అందరు ఆరొహ్యాయని చలివిడిముద్దలులాగున కూలబడ్డారు. అందులో ఒకచీటిఉంది. అదివిప్పిచదివారు. ఏముంది? "నాయనలారా! ఎప్పుడు డబ్బులేనప్పటికి చచ్చేకాలానికి డబ్బుంచుకోండి. ఎప్పటికైనా మీరు నాలాగేఅవుతారు. లేకపోతేఏముంది? మీనోట్లో ఈదుప్పికొమ్మే." నలుగురుకొడుకులు చాలాసిగ్గుపడి చల్లచల్లగ ఎవరిఇండ్లకు వారుజారిరి.

# గోదావరిఉపనది వంజరకథ

కొంకణదేశపు రాజు సితదత్తుడు. అతని కుమారుడు వంజరుడు. వంజరుడు విరోధిభయదబాహుబలదిక్కుంజరుడు, అభిరామయశోమంజరుడు. అతని పెండ్లి సేయుటకునై సితదత్తుడు ప్రయత్నపడుచుండగా వంజరునకు గంగాయాత్ర చేయవలయునని బుద్ధిపొడమెను. తండ్రి అనేకవిధముల చెప్పిచూచెను. కాని కార్యములేకపోయెను. వంజరుడు కదలిపోయెను. పుత్రవియోగనిష్ఠురవహ్నికి తాళజాలక సితదత్తుడు చనిపోయెను. అందుమీద మంత్రివర్యులు ఈవార్త చెప్పి వంజరుని ఏవిధముననైన తిరిగి తోడ్కొనివచ్చు నుద్దేశ్యముతో వెడలిరి. అతనిని కలిసికొని నడచిన వృత్తాంతమంతయు చెప్పిరి. తనకై తనతండ్రి మరణించుట తెలిసికొని విచారించి మంత్రుల పట్టుబలవంతముమీద ఇంటికితిరిగి వచ్చెను. అట్లువచ్చి సితదత్తునకుఁ బితృకృత్యములు యథోచితంబుగానొనర్చి యొక్కశుభదినమునఁ బుణ్యనదీజలాభిషేచనపురస్సరముగాఁ బట్టముగట్టుకొని యాప్రతిహతప్రతాపముదీపింప ననేకవర్షములు భూమి యేలుచు ధామినియను కామినియందు నుగ్రలోచనుడను కొడుకునుగని వానిమీద సకలసామ్రాజ్యభారమును బెట్టి గంగాయాత్రగావించి తపోవనమునకుజని ఉగ్రతపము గావింపదొడగెను. ఈఉగ్రతపమునకు భీతిల్లి ఇంద్రుడు ఈతనికడకు అప్సరసలపంపెను. కాని వంజరుడు చెదరలేదు. అందుమీద ఇంద్రుడు నారదునితో ఆలోచనచేసెను. బ్రహ్మనుగొని తానీపని చక్కచేసికొనివత్తునని నారదుడు చెప్పెను. బ్రహ్మ సితదత్తనృపతి యాకృతిగైకొని యంతరిక్షమున నదృశ్యరూపముననుండి నారదుడు వంజరునితో పలుకు దానికి ప్రత్యక్షీకరింపవలయునని కట్టడచేసికొని మునిరాజుదగ్గరకువచ్చి ఇట్లుచెప్పెను: "రాజా! నేనొకసారి యమలోకమునకుపోయితిని. నీతండ్రి కనిపించి కొన్నిసంగతులుచెప్పి అవి నీతో చెప్పుమనెను. ఇప్పటివారిట్టి సంగతులునమ్మరు. కావున నీవే స్వయముగావచ్చి చెప్పవలసినదంటిని. దాని కాతడు ఒడబడి అడుగోవచ్చియున్నాడు." అనిచెప్పి సితదత్తుని పేరెత్తి పిలచెను. అతడు దృష్టిగోచరుడై మ్రొక్కినకొడుకును లేవనెత్తి "నిన్నుగానక అనాడు మృతినొందితిని. ఈముని దయవలన తిరిగినిన్ను కన్గొనగల్గితిని. సంతోషమైనది. కాని ఒకసంగతి. నాపాపములను నీవు పోద్రోలవలయును. నాశరీరమును ఇచట విడిచిపోయెదను. శివజటాజూటమునుండి జలము తెచ్చి ఇచ్చట ప్రవహింపజేయుము. ఆజలము నాకాయమును సోకగనే నేను పుణ్యగతికి పోగలను. కావున ఈపని మఱువక కావింపు" అనిచెప్పి కృతిమాంగమును అచట వైచి బ్రహ్మ అదృశ్యుడయ్యెను. ఈవార్త నారదుడు తెలుపగా విని ఇంద్రుడుసంతోషించెను. ఇచట వంజరుడు గురునకు మాక్షేత్రోపగూర్చెదనని హిమాలయదక్షిణభాగమునందు శివునిగూర్చి ఉగ్రతపము చేయనారంభించెను.

సీ. నాతోడిసవతియై మాతండ్రిజడలలో
  నుప్పొంగుచదలేటి యుబ్బుడిగఁ
 దోలిఁదోలి గౌతముం డలఘుతపశ్శక్తి
  గొనిపోయె నర్వ్యాకిఁ గొంతనీరు
 మఱిభగీరథుఁ డనుమానవాధీశుండు
  గొనిచన్న నీటికి గొలఁదిలేదు
 ఇంకఁజిక్కిననీటి నీవంజరక్షితిం
  ద్రుఁడుగొనిపోయినఁ దోడుమాలి
గీ. యుండవచ్చు నీతఁ డొనరించుతపమున
 కడ్డపడకు మనిగణాధిపతికి
 గౌరిబుద్ధిచెప్పెఁగాక కాకున్న వి
 ఘ్నంబుకాదె యతనికార్యమింత.

— భోజరాజీయము.

ఇట్లుదృఢనిష్ఠతపము సలుపుచున్న వంజరునకు శివుడు ప్రత్యక్షమై 'నీతపమునకు మెచ్చితిని. వరము వేడుము ఇచ్చెద' ననెను. "నీశిరమందున్న మహానదిని పితృహితార్థము భూమికిగొనిపోవవచ్చితిని. అనుగ్రహింపుము" అన శివుడు వల్లెయనెను. గంగయిట్లు చెప్పెను. "ఓరాజా! నీవెనుకనే వేగమువత్తును. నీవు అమహనీయవేగమునకు అంకిలిసేయక తూగ గల్గినచో నీకోరికసిద్ధించు. కాదేని నేనెచ్చటికైనపోయెదను.' దానికి వంజరు డిట్లు చెప్పెను. "తల్లీ! నీవేగములో సమముగా నేనెక్కడనడునగలను, తప్పుబట్ట

కుండువేని ఒకవరము అడిగెదను. జవసత్త్వసంపన్నమగు నొక్క వాహనము సమకూర్చుకొని దాని నెక్కి నిన్ను గొలిచివచ్చెదను. ఈయొక్క చనువును నాకీయవలయును. అట్లు సేయక ఇతరోపాయములచే నన్ను మోసపుచ్చెదననిన చో నే నేకాదు ఈమూఁడులోకము లందును నిన్ను ఎవ్వఁడు గెలువఁగలఁడు?

ఉ. విష్ణుపదంబునం బొడమి
  విశ్వమునుం గబళింపఁబూను న
వ్విష్ణునిమాయవో లెఁ దెస
  వెల్లువయైచను దెంచు నీదు న
ద్ధిష్ణుత చూచి భ్రాంతులయి
  దేవతలందఱుఁ దల్లడిల్లరే
విష్ణుపదీ! ధవప్రియుఁడు
  శీతధయుండు శివుండు తక్కఁగన్.

ఉ. కావున నీమహామహిమ
  గానఁగనెవ్వరు నేర్తురమ్మ నీ
జీవనమీజగత్త్రితయ
  జీవచయంబులకుం దలంపఁగా
జీవన మిట్టినీవు ననుఁ
  జేకొని కాచుటపోలదమ్మ నీ
సేవకకోటికన్నఁడను
  జెందఁగలేవు గదమ్మ దుర్దశల్."

— భోజరాజీయము.

అని ప్రార్థింప గంగకృపదలిర్ప అతడు వాహనము ఎక్కివచ్చుటకు అంగీకరించెను. అప్పుడు పంజరుడు విష్ణుమూర్తినిగూర్చి తపము చేసి అతనిని ప్రత్యక్షము చేసికొని ఇట్లు మనవి చేసికొనెను. "ఓనిగమసన్నుత! వియదాపగ నీచరణారవిందసుందరమకరందబిందువు. తజ్జలమును శంకరుడు శిరోవిభూషణముగా ధరియించెను. అది ఇతరులకు పొందరానిది. అగౌతముడును, భగీరథుండును అధికమైన తపమొనర్చి పొందిరి. నా తండ్రియు ఆజలములనే అర్థించెను. యాతనాశరీరుడై నరకాగ్నులనోలగి తన్నివృత్తికొఱకు నన్ను ఇట్లుపంపెను. నేనును శివుని ప్రార్థించి జలములకు అనుజ్ఞపడసితిని. కాని గంగ నాతో తనప్రవాహవేగమునకు నేను ముందటను తెరువుపెట్టుకున్న తానెటకేని పోవుదునని చెప్పెను. అప్పుడు నేను తల్లీ! పాదచారినై నేను నీతో నడువజాలను. వాహనమును ఎక్కివచ్చుటకు అనుజ్ఞనీయమంటి. గంగయు సమ్మతించెను. నీవారిని గెలుచుటకు నీవారేకావలయును. కావున నాకు ఒకసారి గరుత్మంతుని ఇమ్ము." ఈప్రార్థనకు విష్ణువు అంగీకరించెను. ఖగేంద్రుని ఎక్కి పంజరుడు పఱచుచుండగా గంగ అతనివెనుక పోవదొడంగెను.

సీ. ధరణియంతయు మున్నుదలఁగిపేసినమాడ్కి
  బాధోరయంబునఁ బాయపడఁగ
నడలునసోదానఁ బడుచున్నగజముల
  కరణిని గరిగడ్డలురలిపడఁగ
తటిమెనసంధించి మెఱమినక్రియఁదట
  ద్రుమకోటులున్మూలితములుగాఁగ
ఘనవ్రజనాటిఁబోలెఁదన కగ్గమైనశై
  లములు వేగంబె కుత్తుమురుగాఁగ
తే. వైనతేయుఁబక్షోత్కటధ్వనియుఁదనక
డశ్శ పెనుమ్రోఁతయును దిక్తటంబుఁబర్వ
బాఱెఁగృత్తిమన్నృపశేఖరుఁదాఁక
నమ్మహానది సకలజనాద్భుతముగ.

— భోజరాజీయము.

ఆసమయమున కృతకశవము బిటుసై తత్సంస్పర్శవలన ఆకాశమార్గమున ప్రద్యోతనబింబమున కెదురై పంజరుని దీవించుకొనుచుపోయెను. అది కపటమయ్యు భావనకు ఇది నిక్కువమె కావున ఇంద్రుని పురియందు నెమ్మదినున్న నృపముఖ్యుడు ముదితుడగుచు బ్రహ్మలోకమునకుపోయెను. అప్పుడు పంజరుడు కృతార్థుడై వాహనమును దిగి భక్తితో గంగ కిట్లనియెను: "జగదంబ! నావాంఛఫలించినది. సిద్ధాంజనదృష్టిగొని మహానిధిగాంచిన సాధకునివలె నాజనకుండు నీమూలమున చిరసౌఖ్యములు పొందినాడు. ఇక నీయిష్టమువచ్చిన తావునకు బొమ్ము." అందువీడ అనది గోదావరియందు కలసెను. ఆరాజుపేర అది పంజరయని వ్యవహరింపబడుచున్నది. రాజొద్ద సెలవుగొని గరుత్మంతుడరిగెను. పంజరుడు తపోవనమునకుబోయెను.

క. ఇదిపంజరము మహానది
యుదయము సకలేష్టదము మహోపద్రవశాం
తిదమిది యెవ్వరువినినన్
జదివిన నిష్టార్థసిద్ధి సమకూరువెసన్.

— భోజరాజీయము.




## దాగుడుమూతలు

అవ్వారిడవ్వారి డక్కారిడన్
యాంబిలికాంబిలి మస్కీడన్
అల్లంటల్లంటంటీవన్, అయిగో
కొండమీద కోతి

తల్లి దొంగగాయున్న బాలిక అరచేతిలో చరచుచు ఈపాటపాడును. తరువాత ఆబాలిక దాగిన వాండ్రను పట్టుటకై పోవును.

దాగుడుముచ్చి దండాకోర్
పిల్లివచ్చె ఎలకథాట్
ఎక్కడి దొంగలక్కడ
పారిపో పారిపో.

తల్లి దొంగకన్నులనుమూసి యిట్లుపాడి తరువాత దాగుకొనినవారిని పట్టుకొనుటకై విడచును.

## ఏనుగుఆట

ఏనుగువచ్చిందేనుగు
ఎక్కడికొచ్చిందేనుగు?
మావూరొచ్చిందేనుగు
ఏంచేసిందేనుగు?
మంచినీళ్ళుతాగిందేనుగు
ఎక్కడికెళ్ళిందేనుగు?
కాకినాడెళ్ళిందేనుగు
ఏంచేసిందేనుగు?
కొబ్బరికాయలుతిందేనుగు.

ఒకబాలిక వంగుకొని యింకొకచేయి తొండముగను వెనుకొకచేయి తోకగను చాపి మెల్లగా నడచును. పిమ్మట మిగిలినబాలికలు రెండుభాగములుగానై ఒకరు ప్రశ్నలను రెండవవారు జవాబులను పాడుదురు.

— యస్. వి. శివరావు.

## ఆటపాటలు

తోనుపాశంతోను
అన్నలతమ్ములతోను
ఆటమాణిక్యమ్మతోను
తోడితే నాచెయ్యివేడి
వేడివేడి పరమానంజుర్రు.

ఇట్లు పిల్లని ఒడిలోకూర్చోపెట్టుకుని వానిచేయి ఒకచేతితో పట్టుకుని ఊపుతూ ఈమాటలుచెప్పి జుర్రు అని పిల్లవానిచేయి నోటివద్దపెట్టిన పిల్లలు అల్లరిమాని నవ్వుచుందురు.

కాటుకపెట్టినకన్ను అన్నారు.
లేతమామిడిచిగురన్నారు
లేగంటావులపెరుగన్నారు
కందిపప్పుముద్దఅన్నారు
అప్పుడుకాచిననెయ్యిఅన్నారు
అప్పాలపండన్నారు.

ఈమాటలుచెప్పి ఆడించుచు పిల్లని ముద్దులాడుదురు.

— పిండిప్రోలు కొండయాంబ.

## పుష్కరఫలితము

మునగపాటి చినహనుమయ్యగారు

సతులను నిత్యంబు సాధించి, వేధించి
బాధింప నిపుణులై బరఁగువిభులు,
పసినాఁటనే పెండ్లి పొసగించి కూతుల
కుత్తుక లురిఁద్రాటఁ గూర్చుఘనులు,
యువతులై మను వితంతువులపై సహితంబు
జాలిఁజూపని ధర్మశాస్త్రవిదులు,
పొలఁతులు స్వేచ్ఛతో మెలఁగుటఁ గనులారఁ
జూచి సహింపని సుగుణమతులు,
జనని! గోదావరమ్మ పుష్కరమునందు
స్నానమొనరింప వచ్చుచున్నారు; వారి
పాపములఁ ద్రుంతువో! క్షుద్రభావములను
మార్తువో! నీదు జాత్యభిమానమూని.



హైందవ స్త్రీలు : ఆభరణములు :—

"మనదేశ స్త్రీలకు ఆభరణములయందు విశేషవ్యామోహమున్నదని నొక్కి చెప్పనక్కరలేదు. ఆభరణములవలన ప్రయోజనమేమి? సొమ్ములన్నియు నలంకారమునకేగదా! పశ్చిమదేశ నారీమణులను చూచిన వారు మనవారికన్నను ఆభరణములు తక్కువగా ఉపయోగించుచున్న విషయము విశదమగును. భూషణములు అలంకారముకొరకైన వీరికి అవి లేమిచే సౌందర్యము తక్కువగా నున్నదా? కాదు. మనపూర్వికుల యొక్క ముఖ్యోద్దేశము వేఱుగానున్నట్లు తోచెడిని. స్త్రీలు వివాహమైనతోడనే వారి తండ్రికుటుంబము విడనాడి పరకుటుంబమునకు చేరుదురు. ఆకారణముచే వారికి ప్రత్యేకముగ నిధియేర్పాటు చేయవలెనను యుద్దేశముతో ఆభరణరూపకమైన మూలధనము నిచ్చెడివారు. కాలపరిస్థితులు మారినప్పటికిని యనాదిగవచ్చు ఆచారమును విడువచాలక దానినే యిపుడుగూడ నవలంబించుచున్నారు. పూర్వము మనదేశములో బ్యాంకులు (Banks) లేమిచే నీపద్ధతిని యవలంబించిరని యూహించుటకు సంశయపడనక్కరలేదు. ఆకాలమున మనదేశపరిస్థితులు ఇప్పటివలె నేర్పడియుండిన మన పూర్వికులు వేఱుమార్గములనే తమ యువతులకు ధనసదుపాయములు చేసియుందురు. నవనాగరికమునకు కన్నులు తెరచిన నారీమణులు పైయభిప్రాయములకు లోబడియుండుట యెంతయు సంతోషకరము. వీరు తమ యభిప్రాయములను వెల్లడిచేయుచు తమ సోదరీమణుల గృహము లంతట తృప్తి, శాంతి, సుఖము వికాసింప చేయుదురుగాక!"

—వా. వేంకటరమణరావు.

పుష్కరమననేమి:—

"పూర్వకాలంబున తుందిలుండను ధరామరుండొకడు పెద్దకాలము శివునారాధించి తన్మహానియాను గ్రహంబున శివాష్టమూర్తులయందొకటియగు జలస్వరూపము బడసి శివసాయుజ్యమందెను. అతనికే పుష్కరమనునామము ప్రఖ్యాతమయ్యెను. జలస్వరూపుడగు నాతనినుండి మూడుకోట్లతీర్థంబులు జన్యంబులైనకతన నాతడు తీర్థరాజయ్యె. పరమేష్ఠి పరమేశ్వరానుగ్రహము బొంది తీర్థరాజగు పుష్కరుని సృష్టినిమిత్తమై యాచించి సఫలమనోరథుండై నాతనిస్వకమండలస్థాపితునిగానొనర్చి విశ్వకార్యంబు నిర్వక్రగతి నెఱపుచుండె. అంతనొంతకాలంబునకు బృహస్పతి తపంబాచరించి విధాతృప్రసాదమునుబడసి సర్వజ్ఞత్వమును, గ్రహపతిత్వమును నభ్యర్థించి సఫలకాముడై తీర్థరాజగు పుష్కరునిగూడఁ దనవశంబుననుండ నడిగెను. అందుల కావిధాత యొడంబడి పుష్కరుని గీష్పతివశంబుననుండ నియమింప నందుల కాపుష్కరుడో దేవదేవా! నిన్ను వీడియుండ జాలను. నీవును నాతో నేతెంచినయెడ నేనందుల కొడంబడుదుననియె. అంతనప్పరమేష్ఠి బృహస్పతి మేషాది

రాసులయందు ప్రవేశించినప్పుడాదియందు పండ్రెండుదివసములును, సంత్యమందు పండ్రెండుదివసంబులును, దక్షిణపథునొకండు మాసములయందు మధ్యాహ్నకాలమున రెండుముహూర్తముల కాలములందును బృహస్పతితో నుండును. ఆసమయంబులందేను దక్కుంగల దేవతానీకంబులంగూడి యటకరుదెంచి స్నాతకులకమిత ఫలదాతనగు నీతోడంగలసిస్నాతులపై భక్తవరుల కమితైశ్వర్యాది ఫలంబులనొసగూర్తు మని పుష్కరుని బృహస్పతిపరిణంబు గావించె. అనంతర మాబృహస్పతి పుష్కరుని వెంటబెట్టుకొని మేషాదిద్వాదశరాసులయందు సంచరించుచుండెను. బృహస్పతి పండ్రెండుసంవత్సరముల పరిమితిగలకాలమునందపరిమితపుణ్యామొసంగునట్టి గంగాదిమహానదులయందుఁ బుష్కరునితోఁగూడి స్నానము సేయునట్టి కాలము పుష్కరమహాపుణ్యకాలమని చెప్పబడును."

—ముదిగొండ కోటయ్య శాస్త్రి గారి 'కృష్ణా పుష్కర మహాత్మ్యము' నుండి.

వజ్రముల పరీక్షించుట:—

"అసలువజ్రమని ఎట్లుచెప్పుటకు? ఈవిషయమై జార్జి ఇ. జీ గారిట్లు వ్రాసిరి: ప్రజలు వజ్రముల క్రయవిక్రయములందు తరచుగా మోసపోవుచుందురు. వజ్రముల పరీక్షించుటలో పలువురు పలువిధములుగా పరీక్షించుచుందురు. అందరు ఒకేవిధముగా పరీక్షించుచుందురని చెప్పుట మిగులకష్టము. ఆకారణమున నేను రత్నపరీక్షకుల వాడుకలోనుండు కొన్నివిధానములను మీయుపయోగార్థమై తెలియజేయుచున్నాను. అసలు వజ్రముయొక్క కళతగ్గునో తగ్గదో అనియు, దానియందలి దోషములను కనిపెట్టుటకును సాధారణముగా రత్నముల సాన్యముచేయునపుడు ఊపిరినివిడచిచూచును. అదిఅసలైన వజ్రమైన దానిపై నేమాత్రము తడిలేక వెంటనే ఆరిపోవును. అదియే ఇమిటేషన్ వజ్రమైనట్టయిన తడిఆరకుండాయుండును. అసలువజ్రమును నాలుకపైనుంచిన మిగుల చల్లగానుండును. అది ఇమిటేషన్ అయినట్టయిన అంతచల్లగానుండదు. వజ్రముయొక్క పెద్దపలకపరుపుపైని ఒక నీటిచుక్క నుంచుము. అప్పుడానీటిచుక్క తామరాకుపై నీటిబిందువువలె ముత్యమట్లుండును. అప్పు డొకసూదినిదీసుకొని దాని మొనచే యానీటిబిందువును ఎటుత్రిప్పినను అటు తిరుగును. మరియుదాని చుట్టుప్రక్కలందు కొంచెమైనతడిగా లేక పొడిగానుండును. అదియే ఇమిటేషన్ వజ్రమైనట్టయిన ఆనీటిబిందువు సూదిమొనతో ముట్టిన చెదిరిపోవును. ఒకగిన్నెలో నీళ్ళనుపోయుము. దానిలో వజ్రమును వేయుము. అదిఅసలైన వజ్రమైనట్టయిన చక్కగా ప్రకాశించును. అదియే ఇమిటేషన్ అయినట్టయిన కాంతిగాలేక మబ్బుగానుండును. అసలువజ్రముయొక్క పలకలు నీటిలో అంతఖచితముగా కనబడవు. ఒక తెల్లకాగితముపైని ఒకచిన్న సిరాచుక్కను పెట్టుము. దానిని వజ్రముచే చూడుము. ఆసిరాచుక్క చక్కగా నగుపడును. అదేతీరుగా ఇమిటేషన్ వజ్రముచేచూచిన నది విరివిగాను చెదిరినట్లుగాను కనపడును. ఒక అట్టను తీసుకొని దానికొకచిన్న బెజ్జమును చేయుము. ఆబెజ్జమును వజ్రముచే చూచినట్టయిన ఒక బెజ్జము మాత్రము కనబడును. అదియే ఇమిటేషన్ వజ్రముతో జూచినట్టయిన రెండుబెజ్జములు కనబడును. హైడ్రోఫ్లోరిక్ ఆసిడునవజ్రముపై వేసినట్టయిన నది ఏమాత్రము కొరకలేదు. అదియే యితరమయిన గ్లాసుపైని, పెబిల్సుపైని, ఫ్రెంచి బ్రిలియంటుపయిని వేసినట్టయిన వెంటనే కొరికివేయును. అసలైనవజ్రము చక్రసానపయి సానపెట్టినట్టయిన నేమాత్రము తెగదు. అది యింకేవిధమయిన దైనట్టయిన వెంటనే పలకలఅంచులు రాపిడినొందును. వజ్రమును తేలుచుగా ఆకురాయిచే రాసినట్టయిన అది తెగదు. కృత్రిమమైనది అయినట్టయిన వెంటనే అరిగిపోవును. వజ్రములను సరియైన పలకలనుపట్టుట మిగుల కష్టము. అదియే యిమిటేషన్ వజ్రమయినట్టయిన పలుకనుమిగుల అందముగా పట్టుదురు. ఆకారణముచే పలుకలనుజూచి వజ్రమును పోల్చునది.

తెల్లనిస్ఫటికపురాళ్ళను వజ్రములని తప్పుఅభిప్రాయము పడుచుందురు. అయినప్పటికి దానిని స్పెసిఫిక్ గ్రావిటీవలన తెలుసుకుందురు. స్ఫటికపురాళ్ళు స్పెసిఫిక్ గ్రావిటీవలన తూచినట్టయిన 2/3 బరవు వజ్రముకంటె హెచ్చుగానుండును. అంతేగాక అసలువజ్రము మిక్కిలి కాంతిగానుండును. వజ్రములను సరియైన చలకలనుబట్టినట్టయిన ధర హెచ్చుగానుండును."

—పంచానన.

సంతానసమస్య:—

"జూన్ నెలలో గృహలక్ష్మియందు తాత కృష్ణమూర్తిగారిచే ప్రచురింపబడిన 'సంతానసమస్య' అనునది చూచినాను. అందలి విషయములన్నియు మన భారతీయుల సంతానము గురించినవియైయున్నవి. గాని పురుషులకన్న స్త్రీలకే యీవిషయము బాగుగ స్పష్టపరచవలయును. మనదేశమందు స్త్రీలకు విద్యాజ్ఞానము తక్కువ. మూర్ఖతఎక్కువ. అట్టివారు ఇట్టివ్రాతలు చెవినిబెట్టరు. మితిమీరిన సంతానమునుగని వారినిపోషింపనోపక, తామున్ను బలహీనులైయున్నవారు మనదేశములో మూడువంతులుగలరు. కూలినాలిచేసికొని, తిరుపమెత్తుకొని జీవనముచేయువారు మితిమీరిన సంతానమునుగని వారినెటులనో అష్టకష్టములుపడి కొంతకాలము అనగా 7, 8 సంవత్సరములవరకు గంజియో, అంబలియోపోసి పెంచి పిదపవారినిగూడ తమవృత్తిలోనికిదింపి ఆజన్మాంతము తాము తమబిడ్డలు కష్టపడి జీవనయాత్రముగించువారు పెక్కురుగలరు. ధనవంతులకుగూడ ఎక్కువసంతానమువలన సుఖములేదు. బిడ్డలులేనివారు చెట్టుకుపుట్టకుమ్రొక్కి, బైరాగులకు, సాధులకు చేతులనిచ్చి, రచ్చలు పోగులుకట్టించుకొని, తిరుపతి వెంకటేశ్వర్లకు సింహాద్రి అప్పన్నకు మ్రొక్కుకొనుట, యిటువంటివన్ని చేయువారు కొందరు. ఇప్పటి నాగరికపుస్త్రీలు లేడీడాక్టర్లచే గర్భాశయములను శుద్ధపరిపించుకొని ఔషధములను గ్రోలుట మొదలగునవి చేయవచ్చునుగాని, సంతానముచాలు ఇకవలదనిఅనుట తప్పా? ఆక్షేపణయా? మనదేశములో 30 ఏండ్లవయసున ముసలివారగుటకు కారణ మీమితిమీరిన సంతానమే! సంతాననిరోధనమార్గములనుబట్టి స్త్రీలలో చెరుపు ఎక్కువవునని కొందరభిప్రాయపడుచున్నట్లు సమస్యలో గలదు. కొందరికేగాదు అందరికిఇది తక్షణమే తట్టగలదు. కాని యిప్పుడుమాత్రము స్త్రీలలో నీతివిరుద్ధముగ నడుచువారెందరులేరు? చెడుమార్గములవలంబించి గర్భస్రావముల నెందరుచేసికొనుటలేదు? పిండరూపముగనున్న వక్రప్రాణినిహింసించి చంపవచ్చునుగాని నిరోధనమార్గమేల అవలంబించరాదు? గనుక ఇదియే యుక్తమము. భారతస్త్రీ జీవితమును నెంతసుఖముగ గడుపుచున్నదియు శ్రీకృష్ణమూర్తిగారు సమస్యలో వర్ణించియేయున్నారు. పురుషులు స్వాతంత్ర్యముతో గూడుకొన్న స్వార్థులు. అట్టికష్టములేవీ వారికి గలుగనేరవు. బిడ్డలయొక్క ఏవిధములైన ఉపచారములుగాని, అల్లరి బేజార్లుగాని మగవారికనవసరము. ఇకస్త్రీకి ఇట్టివాటితో సుఖమనునది యెరుగక నిద్రాహారములైన సరిగాలేకపోవును. అట్టిస్త్రీకి బలహీనత, అనారోగ్యము, జీవనమునందు విరక్తియు గలుగును. ఎంతధనవంతులకైనను, దాసదాసీజనములున్న వారికైనను బిడ్డలు ప్రతిబంధకములు. తల్లిని పీడించుచుందురు. కనుక సంతాననిరోధనమార్గములు, మనహిందూస్త్రీలకందరకు తెలియపరచి, అందలిమంచిచెడుగులు బోధపడునటులజేసిన, సోదరసోదరీమణులు దేశమునకును, సంఘమునకును మేలుజేసినవారయ్యెదరు. కాన ఈవిషయమందు శ్రద్ధవహించకోరుచున్నాను."

—సుంకర వాసుదేవమ్మ.

లంజదిబ్బలు:—

"ఈపేరుగల పెద్దయిటుకరాతిగుట్ట లాంధ్రదేశమందక్కడక్కడ గలవు. కృష్ణామండలమున గుడివాడలో నిట్టిదొకటియున్నది. అది మేము చూచితిమి. దానింగూర్చి నేడు వాడుకయందున్న యైతిహ్య

మేమనగా పూర్వమొకలంజెయుండెడిది. దాని కాపురమొక మేడలో. కానుకొల్లు ఘంటశాల మొదలగు నిరుగుపొరుగూళ్ళలో దాని చెల్లెండ్రుగలరు. వారును కులటలే. కాపురము మేడలలోనే. ఈలంజలందఱు ప్రతి సాయంకాలము తమ మేడలపైకెక్కి పెద్దదీపముల సంకేతముతో పరస్పరక్షేమము దెలిసికొనుచుండిరి. నాటి మేడలే పాడుపడి యీదిబ్బలైనవి. అందుచే నివి లంజదిబ్బలు. వీనిని దీపాలదిబ్బలనుటయు కద్దు. నేడు చెప్పకొనెడు కథయిది. కాని యీకథ మన పుక్కిటిపురాణముల పెక్కింటిలో నొక్కటియైయున్నది. ఆకులటలందఱకు మేడలుండుటయు అవియున్నియు నొక్కవిధముగా కూలి గుట్టలగుటయు అసంభవము. అయితే పైకథాంశములు కొన్ని యీదిబ్బల నిజచరిత్రమూహించుట కాధారములగుచున్నవి. ఆంధ్రులొకప్పుడు బౌద్ధమతావలంబులై యుండిరనుట చరిత్రప్రసిద్ధమే. ఈదేశమున బౌద్ధమతము వ్యాపించినప్పుడు కట్టబడిన బౌద్ధస్తూపములే పిదప హిందూమతముద్ధతివహించినకాలమున కూలద్రోయబడి యప్పుడీనిందాస్పదములగు పేరులకు గురియైనట్లు తెలియుచున్నది. బౌద్ధశ్రమణులు వేడుక సమయములందీస్తూపములపై దీపములు వెలిగించు నాచారముండెడిది. అందుచే నివి దీపాలదిబ్బలను ప్రతీతి అప్పటికేకలదు. కాని ఇట్టివిశుద్ధబుద్ధచిహ్నితస్తూపముల లంజదిబ్బలనుటకు హేతువేమి? మతోన్మాదగ్రస్తులగు కొందఱు ఈస్తూపములను లంజదిబ్బలని పిలిపించుట తమ విజయారంభమున కొకచిహ్నముగా నెంచి యిట్టియవాచ్యపుకథలు కల్పించి జనసామాన్యమున వ్యాపింపజేసియుందురు. మన హిందూజనులలో పెక్కుమంది శాస్త్రములకంటెను, చరిత్రములకంటెను జనప్రతీతిని పరమప్రమాణముగ నెన్నుదురు. అంధప్రాయముగ వ్యాపించిన యిట్టి ప్రతీతియొక్క బలిమిచే నెన్నియో సత్యములు మాటువడి హిందూజనులను సత్యజ్ఞానదూరులుగ జేసివైచెను. సత్యమున కిట్టిగతి పట్టించినచోట ఇక ధర్మమునకు తావుమాత్ర మెట్లుండు?" (పద్మశాలి)

—మా. సీతారామయ్య.

కీ. శే. మునునూరు జానకమ్మగారు:—

"కమ్మకులరమణీమణియగు మునునూరు జానకమ్మగారు 31-5-32-వ తేదీని స్వగృహమందు పరమపదించెను. ఇప్పటి కామెకు నూటరెండువత్సరములవయస్సు. నాలుగుమాసముల క్రిందటవరకు అవయవపటుత్వము, జీర్ణశక్తి బాగుగ నేయుండినవి. కాయశరీరిణి. శరీరకాంతి పండుతమలపాకును మించియుండెడిది. ఈమె కిరువురు పుత్రికాజననమే గాని పుత్రులు లేరు. వారును యీమె మధ్యవయస్సుదాటిన కొలదికాలమునకే గతజీవులైరి. వారి కిరువురకు సంతానముగలదు. జానకమ్మగారు అమితదయాశీల. దానధర్మతత్పర, ఎట్టిసమయమందైనను అన్నార్తులగు జనులు యీమె గుమ్మము ముంగిట కేగిన షడ్రసోపేతముగా భుజించి మరలెడివారు. అయింటతినినవారొరాపెట్టు మరువరనుట ఆమెయందు సార్థకమైనది. చాల పుణ్యతీర్థములను త్రొక్కిచూచినది. భక్తులను సేవించినది. బ్రాహ్మణులను పూజించినది. అవసానమువరకును ఆమె భాగ్యభోగ్యము లొకేవిధమున దులతూగినవి. తనఆస్తికంతకు సర్వాధికారిణియైన ఆమె పౌత్రి మునునూరు దుర్గమ్మగారు తన సోదరితనయుడగు నూతలపాటి రత్తయ్యచౌదరిగారిపై కర్తృత్వముంచి పదునైదవదినమువరకు నిత్యకర్మయు, పదునైదవదినము మొదలు మూడుదినములు శాస్త్రోక్తముగా సకలదానములు సంతృప్తికరముగా బ్రాహ్మణులకొసంగిరి. పదునారవదినమున కీ. శే. జానకమ్మగారి జ్ఞాపకార్థము ఆబోతును అచ్చువేసి వర్ణవిచక్షణ లేకుండా నాలుగువేలజనమునకు అన్నప్రదానముగావింపబడినది. స్వర్గస్థురాలగు శ్రీజానకమ్మగారియాత్మకు సర్వేశ్వరుడు శాంతి నొసంగునుగాత!" (ఆంధ్రపత్రిక)

—బో. వేంకటకృష్ణారావు.




### ఆవుకడుపున సింహపుపిల్ల పుట్టుట:—

మే 26-వ తారీఖున బరెల్లీలో నొకఆవు ఈనినది. ఆదూడయొక్క మొగమును, శరీరమును సింహపు పిల్లమాదిరిగా నుండెను. పుట్టినవెంటనే ఆదూడ చనిపోయెను. ఈవిడ్డూరపుదూడను చూచుటకు జనులు తండోపతండములుగ మూగిరి.

### చదరంగపుఆట పదిఏండ్లకు ముగిసినది:—

విదేశములందు విడివడియున్న ఇరువురు యార్కుషైరుపురుషులు ఉత్తరముల ద్వారా 1922-లో ఒక చదరంగపు ఆటను ఆడుటకు ప్రారంభముచేసిరి. ఇన్నాళ్ళుగ ఆఆట ఉత్తరముల ద్వారా సాగుచునే యుండెను. ఇప్పుడు ముగిసినది. సమమైనది.

### నత్తగుల్లలు రైలునాపగా బాతులువచ్చి దారిచేసినవి:—

మొరాకోలో ఒక రైలుబాటపై నత్తగుల్లలు గుట్టలుగుట్టలయ్యెను. రైలునడచుటకు వీలులేకపోయెను. ఆపు డొకబాతులగుంపును తెచ్చి అక్కడ విడువగా నత్తగుల్లల నవి చెల్లించినవి. బాటను సరిచేసి రైలు పోవుటకు వీలుకలిగించినవి.

### 32 ఏండ్లలో 220 పుస్తకములు వ్రాసినకవి:—

ఎడ్గారు వాలస్ 1900 సంవత్సరములో గ్రంథరచనకు దొరకొనెను. ఆతడు ఈనడుమ చనిపోయెను. ఈ 32 సంవత్సరములలో నాతడు నవలలైననేమి, నాటకములైననేమి, పద్యకావ్యములైననేమి 220 గ్రంథములు వ్రాసెను. బ్రిటీషుమ్యూజియము గ్రంథాలయము వారి కేటలాగులో ఈతని గ్రంథములనామములు 20 పుటలు ఆక్రమించెను.

### పెళ్ళాన్ని కొట్టినందుకు శిక్ష:—

టిహాన్‌వోస్‌లో నొకమందులవాళ్ళగుంపు గలదు. అందు ఒకడు సంగీతపాఠకుడు. వాడొకసారి తప్ప తాగి పెళ్ళామును, పిల్లలను కొట్టెను. ఈనేరము కులపెద్దలవద్ద విచారణకువచ్చెను. వారు ఈతనికి విచిత్రమైన శిక్ష విధించిరి. సంగీతపాఠకుడు కులపెద్దల సమావేశస్థలమునుండి ఇంటివఱకు భార్యను మోసికొని పోవలయును. భార్యను రెండుచేతులమీదను అడ్డాలలో పెట్టుకొనవలయును. నడువరాదు. మోకాళ్ళపై దేకవల

యును. ఇట్లు ఇంటికితీసికొనిపోయి నలుగురి సమక్షమున భార్యను క్షమాపణకోరవలయును. ఇంతలో శిక్ష పూర్తిగాదు. మఱునాటిరాత్రి అంతయు వారడు నీళ్ళతోనిండియున్న తొట్టిని నెత్తిపై తక్కెడవదునన నిలుపుకొని యుండవలయును. అనీరు ఇవతాళించుచుండును. గడ్డ కట్టకుండుటకై ఆనీటిని అపుడపుడు కదలించుచుండవలయును. ఈకఠినశిక్షతో బుద్ధివచ్చిఆతడు ఇప్పుడు మంచివాడుగానున్నాడు.

**17 గురు పిల్లల తల్లి తిరిగి పెండ్లియాడుట:—**

లండను చెంతగల క్లెర్కన్‌వెల్ కాంటీకోర్టునందు 49 ఏండ్లుగల ఒక స్త్రీకి 17 గురు పుట్టిరి. అందు 16 గురు ఇప్పటికిని సజీవులైయున్నారు. ఈమె ఇప్పుడు తిరిగి పెండ్లిచేసికొన్నది. బిడ్డలను కనుటకేనా?

**ఆడది మగవాడగుచుండ ఆపరేటు చేసి అరికట్టుట:—**

లండనులో నొక పదహారు ఏండ్ల బాలికకు క్రమముగా మగలక్షణములు కనిపించజొచ్చెను. దినదినము ఆమె గడ్డము చేసికొనుచుండెను. ఆమెకు 22 ఏండ్లురాగా బ్రౌస్టరు డాక్టరు ఆపరేటుచేసెను. ఆమె ఇప్పుడు తిరిగి స్త్రీలక్షణములతోనున్నది. గడ్డము వచ్చుటలేదు.

**అన్నియు అంకెలు:—**

దాని జీవితకాలములో ఒక నత్త 50,000,000 గ్రుడ్లుపెట్టును. పోస్టుకార్డు తొలుత ఆస్ట్రియాలో అక్టోబరు 1869-వ సంవత్సరమున ఉపయోగింపబడెను. లండనులో వారమునకు 250,000 పౌనుల విలువగల వస్తువులు తాకట్టుపెట్టబడును. ఇంగ్లీషుభాషలో 515,000 మాటలుగలవు. ఒక్కగడియారములో వివిధము లైనపార్టులు 175.1 పౌను టీ సాధారణముగా 12 చెట్లఫలము. బ్రిటీషుసామ్రాజ్యవిస్తీర్ణము 13,653,751 చతురపుమైళ్ళు.

**భువనగిరి సోమేశ్వర ప్రభావము:—**

భువనగిరికి పడమర చెరువుకట్టవెనుకనున్న శివాలయము కొందరి భక్తాదులయొక్క దృఢమైన ప్రయత్నమువలన మంచి యభివృద్ధి గాంచుచున్నది. సోమేశ్వరుని మహిమగూడ దినదినము అభివృద్ధి బొందుచునే యున్నది. అప్పుడప్పు డొక పెద్దసర్పము వచ్చి లింగమూర్తిచుట్టు చుట్టుకొని యుండును. ప్రజలు ఆసర్పమున కేమాత్రమును భయపడరు. ఆసర్పముగూడ ఎంతమందియున్నను సరకుగొనక నిర్భయముగా ఆలయములోనికి వెళ్ళుచుండును. ఈలోపల వేరొక వింత తెలియుచున్నది. అర్ధరాత్రివేళ ఎవ్వరో అదృశ్యచారులువచ్చి శంకరునిపూజించి వెళ్ళుచుందురట. శ్రీయుత పుట్టేపు రాజారావుగారును, ఆలయమునందె నివసించు అంతయ్యగారను సానుమూర్తియును అప్పుడప్పు డర్ధరాత్రివేళ గర్భాలయములోన ఘంటానాదము స్పష్టముగావినిరట, అచ్చటికి వెళ్ళి చూచువరకెవ్వరును లేరట. అప్పుడప్పుడే అభిషేకము చేసినట్లు అచ్చటనీళ్ళు మాత్రము పడి యుండెనట. ఇది మహాచిత్రమని అందరును తలంచుచున్నారు. (గోలకొండ.)

**ఒకే కాన్పున ముగ్గురు బిడ్డలు:—**

మిడ్నపూరుపట్టణమున పాట్నాబజారులో ఒక తెలి స్త్రీ ఒకేకాన్పున ముగ్గురుబిడ్డలను ప్రసవించినది. ముగ్గురును మగబిడ్డలే. కాని ముగ్గురును పదిగంటలవ్యత్యాసములో చనిపోయిరి. తల్లి కులాసగనున్నది.

**గాజు ఇటుకలు కనుగొనబడినవి:—**

రాతిదెబ్బకు గాజుపగులుట సహజము. కాని అట్టి రాతిదెబ్బలకు తాళగల గాజుఇటుకలు ఇప్పుడు కనుగొనబడినవి. ఇవి వేడిని నిరోధించగలవు. వెలుతురు రానిచ్చును. బయటివారు లోనిసంగతులను కనుగొనజాలరు. ఇక ఇట్టి గాజుయిల్లు ప్రచారములోనికి రావచ్చును. అప్పుడు గాజుయింట రాళ్ళురువ్వరాదు అను సామెతకు మాత్రము ఇక సార్థకతయుండదు.




కలనిజమయ్యెను:—

రోమునగరమున అంటానియో కాటానియో అని ఒకడు. అతడొక అచ్చాఫీసు మేనేజరు. అతడు తన చిన్నతనములో ఒకపూజారిని యెఱిగియుండెను. ఆపూజారి ఇప్పటికి ఇరువదిసంవత్సరములకు పూర్వము మరణించియుండెను. అతడొకనాడు కాటానియో కలలో కనిపించి 'నీవు ఇపుడుజరుగుచున్న లాటరీలో టిక్కట్లు కొనుక్కొనుము' అనిచెప్పి మూడు నెంబర్లుసూచించి అదృశ్యుడాయెను. కలలోని ఆపూజారివ్యక్తి చెప్పిన మూడు నెంబర్లు నెగ్గినవి. కాంటానియోకు నూటయిరువది పౌనులువచ్చెను. ఇట్లు కలలోసంగతి నిజమైన అనుభవము ఈతని కిది రెండవసారి. వెనుక నొకసారి ఇట్టి కలమూలముననే కాంటానియో నూరుపౌనులు లాటరీలో సంపాదింపజాలి యుండెను.

దయ్యములు చేసినపని:—

కలకత్తా మాట్ లేనులో ఒక యిల్లుకలదు. అందు దయ్యములుకలవని వాడుక. అగుట ఆయిల్లు చాలదినములుగ ఖాళీగా ఉండుచుండెను. ఒక ఆంగ్లోఇండియను ఇపుడు చొరవచేసి ఆయింటిని అద్దెకుతీసికొనెను. రెండు మూడు రోజుల అనంతరము ఆతని కుక్క అర్ధరాత్రులయందు అకారణముగ అరచుచుండెను. కుక్క అరుపుసాగిన నాలుగవనాడు ఆతని కూతురు 16 ఏండ్ల పడుచు పరుపుపై పరుండియుండగా బలవంతముగా నొకఅదృశ్యవ్యక్తిచే క్రిందికి తోసివేయబడెను. బలమైనగాయములు తగిలెను, ఆసుపత్రికి గొనిపోయిరి. ఆమె స్థితి యిపుడు అపాయకరముగనున్నది.

భయంకరమైన మొసలి:—

పంజాబులో సట్లెజ్ నదియందు ఒక భయంకరమైన మొసలి స్థావరమేర్పరచుకొని, ఆ తీరమునకు స్నానమాచరింప, సలిలము గొంపోవ నేతెంచిన స్త్రీ పురుషుల, జంతుజాలముల కబళించుచుండెను. ఆమొసలి అదివఱకే రెండుసార్లు తుపాకిగుండుదెబ్బ తప్పించుకొన్నది. తదుపరి ఒక ఆంగ్లేయుడు ఒక షికారీని వెంటఁబెట్టుకొని ఆమొసలిని యెట్టులయిన సాధింపవలెనని ఆవ్యాహిని పరిసరములఁ దిరుగుచుండెను. అది మట్ట మధ్యాహ్నము. ఎల్లరు సూర్యరస్మికి తబ్బిబ్బవుచుండిరి. అట్టియెండ ఆమొసలి ఆనదినుండి నిర్గమించి వడ్డునఁ బరికించి మెల్లమెల్లగా మామూలుగా ప్రతిదినము విశ్రాంతిదీనుకొనెడి యిసుకప్రదేశమునకువచ్చెను. పొదల చాటున దాగియున్న వారలిద్దఱా మొసలి నడవడుల గన్పెట్టుచు నేయుండిరి. ఆంగ్లేయుడంత తుపాకిని గురి చూచి పేల్చెను. ఒకటి...రెండు...మూఁడు, ఏడుసార్లుపేల్చెను. అది నేలకొరిగెను. వారలా మొసలిని సమీపించిరి. ఇంతలో కూలివాండ్రు విచ్చేయ దాని నతికష్టము మీఁద మోయలేక లాగలేక త్రిప్పలుపడి

ఒక చిన్న పడవలోఁజేర్చిరి. కొలతవేయగా అది పదునాఱడుగుల పైనయున్నది. చాలపెద్దది. పడవయందు దానిని త్రాళ్ళతో బడవేయ ఒక విచిత్రము జఱిగినది. దానితోఁక నీటిలోఁబడుచుండెను. కొంతవడికి దానికి ప్రాణమువచ్చినది. అందఱు భయభ్రాంతులైరి. ప్రాణరక్షణకై ఎవరికి వారు నీటదుముకువారైరి. దాని నతికష్టముతోఁ త్రాళ్ళతోఁబంధించి పలుకష్టములకు లోనై దానిని అవల యొడ్డునకుఁజేర్చిరి. భగవదనుగ్రహముచే పడవ తలక్రిందవలేదు. తీరము చేరినంత దాని చర్మము ఒలిపించి దాని నాతఁడు గైకొనెను. ఎల్లఱును మిగుల హర్షించిరి. మొసలి సర్వసాధారణముగా 10 అడుగుల పొడవేయుండును కాని యియ్యది చాలపెద్దది. ఘాతుకమృగపువేటలో పులి మొదలైనవి రొటులో యియ్యదియు నంతియే గాని మొసలిని చంపుట దుస్తరము. (Wide World)

— మరకాని పరాత్పరరావు.

# పుష్కర పుస్తకములు

## శ్రీ గౌతమీపుష్కరకృత్యానుక్రమణికా:—

ఇది బ్రహ్మాండపురాణమునుండి శ్రీసాగి రామశాస్త్రులువారిచే సంగ్రహించి రచియింపబడినది. పెద్ద పత్తి కృష్ణమూర్తిశాస్త్రిగారివలన తెలుగుతాత్పర్యము వ్రాయబడినది. పుష్కరపూర్వదినప్రయోగము, సంకల్పము, మృత్తికాస్నానవిధి, తీర్థప్రయుక్తస్నానవిధి, అర్ఘ్యములు, ఉపవాససంకల్పము, గౌతమీపూజ, సహస్రనామావళి, అష్టోత్తరశతనామావళి, కథ, పుష్కరగౌతమీప్రశంసకథ, అర్ఘ్యశ్లోకములు, దానక్రమము, ధర్మపిండశ్లోకములు, పిండదానక్రమము, క్షేత్రాదికారుణ్యక్రమము, కర్తవ్యాకర్తవ్యవిభాగము ఇందుగలవు. పుష్కరతీర్థయాత్రికులెల్లరు తీయదగినది. డెమ్మిసైజున 52 పుటలు: వెల రు. 0–8–0. వలయువారు మాదేటి సవ్యాసయ్య అండ్ సన్స్, ఆంధ్రాబుక్కుడిపో, రాజమహేంద్రవరము, అను చిరునామాకు వ్రాయవలెను.

## శ్రీ గోదావరీపుష్కరమాహాత్మ్యము:—

రాజమండ్రి ఆంధ్రప్రకటనసంఘమువారు ప్రచురించినది. గోదావరమ్మకుస్వాగతము, సప్తమహర్షులొనర్చిన గోదావరీస్తోత్రము, గోదావరీప్రాశస్త్యము, పుష్కరసామాన్యప్రశంస, వివిధనదులపుష్కరయోగము, గోదావరీపుష్కరయోగము సర్వోత్తమము, శ్రీగోదావరీపుష్కరమాహాత్మ్యము, పుష్కరయాత్రసేవనవిధానము, పుష్కరస్నానవిధి, పుష్కరస్నానమహిమ, గోదావరీపుష్కరస్నానఫలము బాల్యవైధవ్యమును దప్పించినకథ, పుష్కరవ్రతవిధి, పుష్కరవ్రతఫలము అపమృత్యువునుహరించినకథ, మంత్రానుష్ఠానవిధి, గౌతమీపుష్కరులసంవాదము, దానవిధానము, వివిధదానఫలములు, పుష్కరతీర్థశ్రాద్ధవిధానము, గౌతమీపుష్కరకాలపిండప్రదానమహిమ, గోదావరీధ్యానశ్లోకములుఅను విషయములుగలవు. పామరులుకూడ చదువదగు సులభవచనము. నడుమనడుమ చక్కనిపద్యములు. శ్రీనాథుని భీమేశ్వరపురాణమునుండి గోదావరిస్తుతిపద్యములు ఎత్తి చేర్పబడినవి. పుష్కరములలో జను లందఱును పారాయణచేయవలసిన పుస్తకము. డబుల్ క్రౌనుసైజున అనగా గృహలక్ష్మిసైజున నలుబదిఎనిమిదిపుటలు. వెల రు. 0-2-0 మాత్రమే. వలయువారు ఆమేరకు పోస్టుబిళ్లలుపంపిన గ్రంథము బుక్కుపోస్టుగాపంపబడును. ఈగ్రంథములు దొరుకుచోటు: నాళము సోమరాజాగారు, ఆర్యాపురము, రాజమండ్రి.

# గ్రంథపరిచయము

**శ్రీ నెల్లూరు వర్ధమాన సమాజ నివేదిక:—**

నెల్లూరు ప్రోగ్రెసివ్ యూనియనువారి 1931-వ నివేదిక పరిశీలనార్థము మాకార్యాలయమునకు పంపబడినది. ఈనివేదిక పై సమాజముయొక్క క్రమాభివృద్ధిని, నివేదికవత్సరమునందలి దాని ప్రశంసనీయమగు ప్రజాసేవను ప్రదర్శించుచున్నది. దీని ఈఅభివృద్ధికి కారణభూతులగుచున్న వారెల్లరును కొనియాడదగియున్నారు.

**మైరావణచరిత్రము:—**

పౌరాణికము. మైరావణచరిత్ర విచిత్రకథాసంయుతమైనది, ఆంజనేయుని బలయుక్తిప్రదర్శనమునకు తావళము. మాడయ మొదలగు కవులు చంపూకావ్యముగను, మరికొందరు ద్విపదకావ్యముగను మైరావణకథను వ్రాసియున్నారు. ఇది వచనమున వ్రాయబడినది. సుబోధకమగుశైలి. గ్రంథకర్త డాక్టరు దువ్వ శేషగిరిరావుగారు, క్రౌనుసైజు గ్లేజుకాగితములు 64 పుటలు. వలయువారు పిఠాపురమునందలి గ్రంథకర్తగారికి వ్రాయునది.

**ఆంధ్రరత్నస్మృతి:—**

రచయిత కర్లపాలెం కృష్ణరావుగారు. ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారిమీది ఇందలి నవపద్యరత్నములను చదివి పులకితులమైతిమి. గోపాలకృష్ణుని-ఆంధ్రకీర్తికి రక్షణదేవతయైనవాని-ప్రస్తుతింపనొల్లని వారెవరు? చిన్నసైజున గ్లేజుకాగితములు. వెల 0-1-0. చిరునామా: శ్రీదామోదర ప్రెస్, చీరాల.

**జ్ఞానోదయము:—**

వేదాంతజ్ఞానము, భక్తిజ్ఞానవైరాగ్యములను సులభశైలిలో బోధించు చక్కనిగ్రంథము. గురువు శిష్యునకు బోధించురీతిని ఉన్నది. మోక్షాపేక్షకులు పఠింపవలసినగ్రంథము. క్రౌనుసైజున 58 పుటలు. 0-0-6ల పోస్టుబిళ్ళలు పంపువారికీగ్రంథము బుక్కుపోస్టులో పంపబడును. చిరునామా: వైద్యవిద్వాన్ తెలికిచర్ల సుబ్బారావుగారు, రాజమహేంద్రవరము.

**పశ్చిమగోదావరిజిల్లా భూగోళము:—**

నాల్గవతరగతికి ఉద్దేశింపబడినది. నందిగామబోర్డుహైస్కూలు సహోపాధ్యాయులగు వెంపటి పురుషోత్తముగారు బి. యె, యల్.టి. వ్రాసినది. మూడుభాగములు. మొదటిభాగమున సాధారణభూగోళవిషయములు వివరింపబడినవి. రెండవభాగమున గ్రామభూగోళమును, మూడవభాగమున జిల్లాప్రత్యేకభూగోళమును వివరింపబడినది. చిత్రములు అతివిరళములు. శైలి సులభము. చెన్నపురి సి. కుమారస్వామినాయుడు అండ్ సన్సువారిచే ప్రచురింపబడినది. వెల రు 0-6-0

**దివ్యప్రబంధమార్గప్రదీపిక:—**

విశిష్టాద్వైత ప్రతిపాదకము. నిమిషకవి వెంకయ్యగారు రచియించినది. జ్ఞానవైరాగ్యములందు పూర్ణప్రజ్ఞనందిన స్వామి శ్రీమాన్ గోవిందాచార్యులవారి గ్రంథమున కిది తెలుగుచేత. సర్వమతధర్మములకు సామరస్యము గల్పించి భక్తిమార్గమును, దానింబట్టి గమ్యస్థానము చేరుటకు నుపాయములును ఈగ్రంథమున దృష్టాంతపూర్వకముగ స్పష్టపఱుపబడినవి. అచ్చటచ్చట సూచింపబడిన గ్రంథకర్తగారి ఆత్మానుభవము లాయనయొక్క నిశ్చలభక్తిని జాటుచున్నవి. గ్రంథకర్తగారి ఛాయాచిత్రము చేర్చబడినది. డెమ్మిసైజు గ్లేజుకాగితములు. 250 పుటలు. పోస్టేజికగు 0-4-0 బిళ్ళలుపంపిన ఈగ్రంథము ఉచితముగ పంపబడును. చిరునామా: నిమిషకవి శ్రీరామమూర్తిగారు, మోదేకుర్రు, కొత్తపేటపోస్టు, ఈస్టుగోదావరిజిల్లా.

**శ్రీ కుసుమహరనాథ బోధసంగ్రహము:—**

మోదేకుర్రువాస్తవ్యులు నిమిషకవి వెంకయ్యగారిచే రచియింపబడినది. శ్రీకృష్ణపరావతారులని ప్రఖ్యాతిగనిన హరనాథుల లీలామృతమను ఇంగ్లీషు గ్రంథమునగల అద్వైతమతనిరసనభాగమును సవరించుటకు ఈగ్రంథము వ్రాయబడినది. ఆంధ్రభాషాభిమానులగు శ్రీ కామర్షి వేంకటసుబ్బయ్యగారీ గ్రంథమునకు పీఠిక వ్రాసియున్నారు. వయోవృద్ధులగు గ్రంథకర్తగారి ఛాయాచిత్రము చేర్చబడినది. ఈక్రింది అడ్రెసునకు ఒక అణా బిళ్ళ పోస్టేజికొఱకు పంపినయెడల ఈపుస్తకము ఉచితముగ పంపబడును. నిమిషకవి వెంకయ్యగారు, రిటైర్డు హెడ్మేష్టరు, మోదేకుర్రు, కొత్తపేటపోస్టు, తూర్పుగోదావరిజిల్లా.

**కుట్టుపని:—**

కోలా బాలరామారావుగారిచే రచియింపబడినది. అలంకారములలో దుస్తులు ప్రధానమైనవి. అట్టి అలంకారములను సంతృప్తిగ తయారుచేసికొను విద్య స్త్రీలు నేర్చినచో కుటుంబవ్యయములో కొంతతగ్గును. కుట్టుపనిపై ఇంతవఱకు తెలుగులో పుస్తకములులేవు. ఆలోటును ఈగ్రంథము కొంతవఱకు తీర్చునని చెప్పగలము. ట్రౌజరు, కోటు, వెయిస్టు, షర్టు, జాకెట్టు, షేరువాణీ, లాల్చీ, ఆఘారము, రవికె, ఫ్రాకు, బనియను, షెడ్డీ మొదలగువాని కత్తిరింపురీతులు, వివరములు చిత్రములతో సహా తెలుపబడినవి. సాధారణమైన మెలుకువలును చూపబడినవి. స్త్రీలీ గ్రంథపఠనమున కొంతిలాభము తప్పకపొందగలుగుదురని చెప్పగలము. క్రౌనుసైజున 72 పుటలు. వెల రు 1-0-0. గ్రంథములు దొరుకుచోటు: యస్. వి. ప్రెస్. పెంటపాడు, వెస్టుగోదావరిజిల్లా.

**గోదావరిజిల్లా భూగోళపుస్తకము:—**

చెంగల్పట్టుజిల్లా స్కూళ్ళఆక్టింగు అసిస్టెంటు ఇనస్పెక్టరుఅయిన యస్. సుబ్రహ్మణ్యముగారు బి. యె; యల్. టి. చే రచియింపబడినది. క్రౌనుసైజున 100 పుటలు. మొదటి ముప్పదియైదుపుటలయందును దిక్కులు, రాత్రింబగళ్లు, గాలి, సముద్రము మొదలగు సామాన్యవిషయములును తుదిపుటలు గోదావరిజిల్లాలోని అడవులు, వృత్తులు, పంటలు, రైలుమార్గములు మొదలగునవియు వివరింపబడినవి. పెక్కుపటములు గలవు. శైలి సులభగ్రాహ్యము. వెల రు 0-5-0 అణాలు. ప్రచురణకర్తలు: సి. కుమారస్వామినాయుడు అండ్ సన్సు, చెన్నపురి.

**పెమ్మసాని తిమ్మానాయుడు: గండికోటముట్టడి:—**

రచయిత గూడపల్లి రామబ్రహ్మముగారు. కమ్మచారిత్రకపరిశోధకమండలి ప్రథమప్రచురణము. చరిత్రప్రసిద్ధినందిన కమ్మవంశములలో పెమ్మసానివారుఒకరు. ఈవంశమూలపురుషుడైన వేంకటపతినాయని-దిక్కులేని పసిబాలుని- బోనకత్తె పెమ్మసాని పెంచగా కృతజ్ఞతాపూర్వకముగ ఆమెనామము తమగృహనామముగ గ్రహించిన ఈవంశచరిత్రను గృహలక్ష్మిపాఠకులు రుచితో చదువగలరు. అందును ఈగ్రంథము -అందలి విషయములు ఎన్నుకలవంటి చారిత్రకవిషయములేయైనను - రచయితసామర్థ్యమున నవలవలె చదువనైయున్నది. వాక్యములు రసాత్మకములు. ఒకనిదర్శనము. 'చిత్రావతీస్నేహంవల్ల బలపడ్డ పినాకినీనది ద్విగుణీకృతోత్సాహశక్తులతో కొండగోడలు చీల్చుకొని గండికోటను వీచీహస్తాలతో అక్కడ కౌగిలించుకుంటుంది.' ఇట్టిశైలితో చరిత్రగ్రంథములు రచియించుచో చరిత్రగ్రంథములనిన ఏవగించుకొనువారుకూడా వానికి సుముఖులగుదురు. కైఫీయత్తులలో నిక్షిప్తమైయున్న తెలుగుచరిత్రను వెలికితీయ ప్రయతించుచున్న రామబ్రహ్మముగారి ప్రయత్నము స్తుతింపదగినది. వారి ఈప్రయత్నము జయముపొందుగాకయని కోరెదము. ఈచిన్నిగ్రంథము క్రౌనుసైజున చక్కని గ్లేజుకాగితములమీద ముద్రింపబడియున్నది.

# రాజమండ్రి గోదావరిఒడ్డున

రాజమండ్రిచెంత గోదావరికి అఖండగౌతమియని పేరు. ఉపనదులుగొనివచ్చు జలములతో పరిపుష్టి నొంది నది ఇక్కడ మిగుల వెడల్పుగను, లోతుగను ఉండును. ఇక్కడికి నాలుగుమైళ్ళ దిగువను నది పాయలుగా చీలిపోవును. కావున నదియొక్క పూర్ణ రూపమును చూచుటకు రాజమండ్రియే తగినతావు. మఱియు నిచ్చటిస్నానమే సమగ్రఫలమిచ్చునది అని పురాణములవచనము. నాసిక, త్రియంబకము మొదలగుతావులయందు గోదావరీజలమే గాని విశేషమహత్త్వము గల ఇతరఉపనదులజలము కలియలేదు. పంజర, ప్రాణహిత మొదలగు ఉపనదులజలములు గోదావరికి ధర్మపురి, భద్రాచలము మొదలగు తీర్థములచెంత గలుగును గాని అచ్చట శబరిజలము లేదు. రాజమహేంద్రవరమున అన్ని ఉపనదులతోయములు గోదావరియందు ఉపలబ్ధములు. దిగువకుపోయిన గోదావరిఖండములైనది. కావున ఇక అచ్చట సమగ్రత్వము, అఖండత్వము రాదు. ఈకారణము చేతనే తొమ్మిదివందలమైళ్ళ నిడివిగల గోదావరియందు ఈరాజమండ్రిగల ప్రదేశమునకే పుష్కరములలో లక్షలకొలది ప్రజలువత్తురు. రాజమండ్రి గోదావరిఒడ్డున స్నానము చేయతగిన స్థానములు విశేషఫలప్రదములైనవి పురాణములందు అయిదు చూపింపబడినవి. వానినిగూర్చి ఒక్కింత వివరింతును.

## కోటిగిరి

దీనినే ఇప్పుడు జనులు కోటిలింగాలు అనిఅందురు. పూర్వము ఋషులీప్రదేశమును దక్షిణకాశిగా చేయదలచి ఇచ్చట కోటిలింగప్రతిష్ఠకు పూనుకొనిరి. కోటిలింగములను ఒక్కరాత్రిలో ప్రతిష్ఠింపవలయును. కాని తెల్లవారుసరికి కోటికి ఒక్కలింగము తక్కువగానుండెను. ఇది పురాణగాథ. వేసవికాలమున నదిలోనీరు తక్కువగా ఉండునప్పుడు ఇచ్చట కొన్ని కొండలు బయలుపడును. వాని ఆకారము విచిత్రముగనుండును. పానపట్టములతో గూడినలింగములు స్పష్టముగ కనిపించును. నాస్తికులకుకూడ ఆస్తికభావము కలిగింపజాలినంత అద్భుతముగనుండును. ఈ పుష్కరదినములలో-వర్షకాల సమీపముగావున-నదికి క్రొత్తనీరువచ్చును. అగుట ఈదృశ్యమును పుష్కరయాత్రికులు చూడజాలరు. కోటిలింగాలు చెంత రెండు దేవాలయములుగలవు. అందు కోటిలింగేశ్వరాలయమొకటి.

## శేషగిరి

దీనినే జనులు ఇప్పుడు శేషాయిమెట్టఅని వ్యవహరించుచున్నారు. ఈకొండపై ఇపుడు ఇంపీరియలు బ్యాంకుగలదు. రెడ్డిరాజులకాలమున వీరభద్రాలయమొకటి ఈప్రాంతమున ఉండునదియని నమ్మబడుచున్నది. ఈబ్యాంకు ఆవరణయందు ఇప్పటికిని దేవాలయ చిహ్నములగు స్తంభములు మొదలగునవిగలవు. ఇందొకగుహగలదు. అందుండి పెద్దాపురము కోటలోనికి రహస్యమార్గముకలదని కొందరును, ఆమార్గము కాశికిపోవునని కొందరును చెప్పుదురు. వీరభద్రస్వామి పాలితముగనుండిన ఈశేషగిరిచెంత ఇప్పుడు ఎట్టివిశేషములును లేవు.

## పుష్పగిరి

ఈగిరిపై ఇపుడు జిల్లాజడ్జిబంగాళాకలదు. పుష్పగిరికి సమీపమునగల రేవునే ఇపుడు జనులు పుష్కరాలరేవు అని వ్యవహరించుచున్నారు. చిరంజీవియగు మార్కండేయమునీశ్వరుని తండ్రి మృకండుని యాశ్రమము ఈకొండపైనేయుండెనని చెప్పుదురు. మృకండుడును, ఆతనిభార్య సుశీలయు తపస్సుచేసి మార్కండేయునిబడసిన క్షేత్రమిదియేననియు, కోటిలింగములనుండి ధవళేశ్వరము ఆవతలగల హేమగిరి (వేమగిరి) వఱకుగల పంచక్రోశపరిమితమైన గోదావరీతీరమునకే మార్కండేయ క్షేత్రమను నామము సుప్రసిద్ధమయ్యెననియు గౌతమీమాహాత్మ్యమునగలదు.

### కమలగిరి

'కమలాద్రి' అని శ్రీనాథుడు వలురీతులవర్ణించి నాడు. మృత్యుంజయుడగు ఈశ్వరుడిక్కడ మార్కండేయుని కాపాడిచెలసినాడు. అయితే ఈయద్రి ఇపుడు నదీగర్భమున మునిగిపోయినది. దీనిచెంతనే మార్కండేయస్వామికి తిరిగి ఇటీవల ఆలయముకట్ట బడినది. రాజమండ్రి దేవాలయములందు విశేషజనము నాకర్షించునది ఇదియే. మార్కండేయ ఆలయపు రేవున స్నానము అపమృత్యుహారకమని చెప్పుదురు.

### శోణగిరి

దీనినే ఇపుడు ఎఱ్ఱతాళ్లదిబ్బయని వ్యవహరించుచున్నారు. పూర్వమిచ్చట గ్రామదేవతగుడి యుండెడి దని పెద్దలందురు. అది నదీపాతమై యుండనోపు. వీరేశలింగముగారి చిన్నతనమున ఈ శోణగిరి శ్మశానముగ వాడబడుచుండినదని వారి స్వీయచరిత్రలోగలదు. తరువాత ఊరుపెరుగగా అది ఇపుడు ఊరికినడుమదై యున్నది. ఎలక్ట్రిసిటీకార్పొరేషనువారి ప్రధాన కార్యాలయము ఈయద్రిపై నెలకొనియున్నది. ఇపుడీ శోణగిరిచెంత నవీననిర్మితములగు రామాలయము, ఆంజనేయాలయముగలవు. ఈశోణగిరిపై పూర్వమొక పెద్దబావి ఉండెడిదట. అది యిప్పుడు కంభమువారి సత్రము రేవున గోదావరిలో మునిగియున్నదట.

ఆనకట్టకట్టకపూర్వము నదిలోని నీటిమట్టము చాల లోతుగనుండునది. అపుడీకోటిగిరి, శేషగిరి, కమలగిరి, శోణగిరులు నదీగర్భమున నిలబడియుండి దర్శనీయములై యుండునవి. ఆనకట్టకట్టినతరువాత నది లోని నీటిమట్టము మూడునాలుగు నిలువులు లేచుటతో ఈచిన్నకొండలు కొన్ని నీటిలో మునిగిపోయినవి. శోణగిరిఅని చెప్పబడు ఎఱ్ఱరాళ్ళదిబ్బను, పుష్పగిరిని మనము ఎండకాలమునమాత్రము చూడగలము. మిగిలిన యప్పుడవి నీటమునిగిపోవును. కొన్నిగిరులు అవఅతే గోదావరి ప్రవాహమునకులోగినవి. కమలగిరి ఇట్టిది.

## డైరి

### మే

20:— నెల్లూరు. జాతీయపతాకోత్సవముజరిపినందులకు అరెస్టుకాబడిన శ్రీమతి పొనకా కనకమ్మగారు తనదేహము అస్వస్థతగానున్నదనియు, గుండె బలహీనమనియు మనవిచేసుకొనుచు జామీనుమీద విడుదలచేయవలసినదిగా సబ్ డివిజినల్ మేజస్ట్రేటునకు అర్జీవ్రాసిపంపిరి.

:— మదరాసు. శ్రీమతులు సరస్వతి, రాజమ్మాళు, గౌతమిఅమ్మాళ్ గార్లు రటనుబజారులో విదేశవస్త్ర దుకాణములు పికెటింగుచేయగా కమీషనరుకార్యాలయమునకు వారినిగొంపోయి విడుదలచేసిరి.

21:— అహమ్మదాబాదు. గుజరాతుకాంగ్రెసు 18-వ డిక్టేటరు శ్రీమతి వినోదినీ నీలకంఠకన్యగారును మరి యిద్దరుస్త్రీలును దర్శనదినము సందర్భమున బహిరంగసభను జరుపబోగా పోలీసువారు అరెస్టుచేసిరి.

:— లాహోరు. శ్రీమతులు సుశీలదేవి, లజ్జావతి, విద్యావతిగార్లకు శిక్ష పూర్తియైనందున విడుదల.

23:— మాలికండ. ఢక్కాజిల్లాలో ఒకజమీందారిణి శ్రీమతి నలినీబాలగారు అరెస్టుచేయబడి మున్షిగంజ్ కి పంపబడిరి. ఆవిడ లూహజ్ గంజ్ కాంగ్రెసు నియంత్రిగనుండెను.

:— ఏలూరు. శ్రీమతులు చుండూరు రత్నమ్మ, జవ్వాజి రాజరత్నమ్మ, మద్దుల దమయంతి, కంది నాగరత్నమ్మగార్లకు క్రిమినలులాసవరణచట్టము 17 (1) సెక్షనుక్రింద ఆరుమాసములు కఠినకైదు, రూ 200 జరిమానా, చెల్లించనిచో మరి ఒకటిన్నరమాసముల కఠినశిక్షయు. చుండూరి రత్నమ్మగారిపక్షమున ఆమెపుత్రుడు జరీమానా చెల్లించెను.

24:—ఏలూరు. శిక్షింపబడిన శ్రీమతులు చుండూరి రత్తమ్మ, మద్దుల దమయంతి, జవ్వాజి రాజరత్నమ్మ, కంది నాగరత్నమ్మగార్లను వేలూరుజైలుకుపంపిరి. రత్తమ్మగారికి ఏక్లాసును తక్కిన ముప్పురికి సీక్లాసు సిఫార్సుచేయబడెను. దమయంతి, రాజరత్నమ్మగార్ల జరిమానాలు చెల్లింపబడెను.

25:—బందరు. కనకదుర్గావతియను కనిస్టేబిలుకూతురికి వివాహమునిశ్చయింపబడి, పెండ్లికూతురుగావింపబడెను. వివాహమునకుపూర్వము రాత్రి 12 గంటలకు క్రొత్తచీరతోనే పెరటిలోనికిపోయి కర్రలను మంటవేసి దానిలో దుమికెను. సహాయమువచ్చునంతలో ఆమె మరణించెను. తనకు వివాహము ఇష్టములేనందుననే ఇట్లుచేసితినని ఆమె ఒకలేఖవ్రాసెను.

:—లండను. అట్లాంటిక్ మహాసముద్రమునకుపైగా జయప్రదముగ విమానమున ప్రయాణముసలిపినందుకు వైమానికురాలగు యయిర్ హార్టుకన్యను రాయల్ వైమానికసంఘమువారు విందునకు ఆహ్వానించిరి.

26:—కోవూరు. కావలి సబ్ డివిజనల్ మేజస్ట్రేటుగారు శ్రీమతి పానకా కనకమ్మగారికి 117 సెక్షనుక్రింద ఒకసంవత్సరము విడిఖయిదును, ఆర్డినెన్సుక్రింద ఆరుమాసములు విడిఖయిదును, మొత్తము ఒకటిన్నర సంవత్సరము శిక్ష విధించిరి.

27:—మదరాసు. ఫ్లవరుబజారునందు విదేశవస్త్రదుకాణములవద్ద శ్రీమతి సరస్వతిఅమ్మాళ్, మాణిక్యం అమ్మాళ్ పికెటింగుచేయగా అరెస్టుచేయబడిరి. కరపత్రములను పంచిపెట్టినందులకు శ్రీమతులు కోదామృతమ్మాళ్, నాగమ్మాళ్, తాయినాయికమ్మాళ్ గార్లను అరెస్టుచేసిరి. ఈరెండుజట్లను కమీషనరుఆఫీసునకు తీసికొనివెళ్లి రాత్రి 8 గంటలకు విడుదలచేసిరి.

28:—గుడివాడ. నూతక్కి గోపాలకృష్ణయ్యగారిభార్య సీతారామమ్మ, నూరపనేని గోపాలకృష్ణయ్యగారి భార్య వేంకటసుబ్బమ్మ, వారికుమార్తె 2½ సం॥ల బాలిక, త్యాగర్లమూడి బ్రహ్మంగారిభార్య కామేశ్వరమ్మ, మానూరు వెంకారెడ్డిగారిభార్య వీరు పికెటింగుచేయుచుండగా పోలీసువారు అరెస్టుచేసి సబ్ జైలునందుంచిరి.

29:—తెనాలి. శ్రీమతి వెలగలేటి దుర్గాంబగారు జాతీయపతాకమునిలిపి వందనమాచరించి ఊరేగింపుచేయుచుండగా అరెస్టుచేయబడి సబ్ జైలుకు గొంపోబడిరి. అరెస్టయినవారిలో దుర్గాంబగారికుమారిత 8సం॥ బాలికయగు నాగసుందరమ్మకూడగలదు.

:—ఏలూరు. పోస్టుఆఫీసువద్ద పికెటింగుచేసిన శ్రీమతులు అద్దమూరి సీతారత్నమ్మ, వార్నాసి సీతమ్మ, చిపటూరి రాజరత్నమ్మగార్లు అరెస్టుకాబడి పదిదినముల రిమాండుపై సబ్ జైలునందుంచబడిరి.

30:—నాగపురము. సాగర్ వాస్తవ్యులగు శ్రీమతి జమ్నాబాయి ఠాకూరుసతి నాయకత్వముక్రింద 25 మంది స్త్రీలు ధంతోలీగుండా ఊరేగి కాంగ్రెస్‌పార్కుగేటువద్దవచ్చి నిలువగా అరెస్టుచేయబడిరి.

:—బలాసోరు. సుమతీదేవి, సీతాదేవి, మరి 12 మంది స్త్రీలు పికెటింగుకై అరెస్టుచేయబడిరి.

31:—అలహాబాదు. పండిత మదనమోహనమాలవ్యాగారి కోడలికి క్రిమినలులాసవరణచట్టము 17(2) క్రింద ఒకయేడు ఖఠినఖైదు విధింపబడెను. ఏ. తరగతి.

:—ఏలూరు. శ్రీమతులు గుజ్జు నాగరత్నము, రాజమండ్రి వుద్దరాజు మాణిక్యాంబ, పాలమర్రు మాణిక్యాంబ గార్లు ముప్పురు పోస్టాఫీసువద్ద పికెటింగుచేయుచుండగా అరెస్టుగాబడిరి.

జూను

1:—ఏలూరు. నిన్న అరెస్టుకాబడి విడుదలచేయబడిన ముప్పురుస్త్రీలను మరల సైక్లోస్టయిలు కరపత్రముల పంచిపెట్టుచు పోస్టాఫీసు బహిష్కరణవారము జరుపవలెనని బయలుదేరగా పోలీసువారు వారిని పోలీసుస్టేషనుకు గొంపోయిరి.

5:—ఏలూరు. ఇదివరకు రెండుసార్లు అరెస్టుకాబడి విడుదలపొందిన శ్రీమతులు వుద్దరాజు మాణిక్యాంబ, గుజ్జు నాగరత్నమ్మ, వెంపరాల మాణిక్యాంబగార్లు మరల పెద్దబజారులో విదేశవస్త్రదుకాణముల వద్ద పికెటింగుచేయుచుండగా స్టేషనుకుగొంపోయి, 10 దినముల రిమాండుపై సబుజైలులోనుంచిరి.

6:—బొంబాయి. శ్రీమతి ప్రభావతిగారు పికెటింగు చేసినందుకు 6 నెలల కఠినశిక్ష, 150 జుల్మానా వేయబడి నందున ఆమె హైకోర్టులో అపీలు చేసెను. ఆమెను జామీనుమీద విడుదలచేసిరి.

8:—గుంటూరు. ఆంధ్రరాష్ట్రీయమహాసభ జరిపినతర్వాత యూరేగింపులో అరెస్టుచేయబడిన వేదాంతము కమలాదేవిగారిని 151 సెక్షను క్రిమినలు ప్రొసీజరు కోడుక్రింద 15 వ తేదివరకు రిమాండు చేసిరి.

9:—ఏలూరు. శృంగారకవి లక్ష్మీనరసమ్మగారు అనారోగ్యకారణమున జైలునుండివిడుదలై ఏలూరు చేరిరి.

10:—కలకత్తా. మిర్జాపూరువీధిలో యూరేగింపుసమయమున అరెస్టుచేయబడిన 6 గురుస్త్రీలలో, శ్రీమతి కమలినీసర్కారు, శ్రీమతి వీణాపాణీదేవిగారలు 4 గేసి నెలలు కఠినశిక్ష విధింపబడిరి.

:—మున్షిగంజ్. మాల్యానగర్ యూనియనుకోర్టును పికెటింగు చేసినందులకు శ్రీమతి ప్రభావతిరాయి, శ్రీమతి గిరిబాలాఘోషుగారలకు 6 నెలలు కఠినశిక్ష.

:—కామర్ ఖరోలో కాంగ్రెసుసభజరిపినందులకు శ్రీమతి సువర్ణమాయిసర్కారు గారికి 6 నెలలు కఠినశిక్ష విధింపబడెను.

11:—మైసూరు. హైదరాబాదు నవాబుకోడలగు దుర్రీశెవర్ గారు మైసూరు స్వదేశప్రదర్శనముయొక్క ప్రారంభోత్సవము జరిపిరి. ప్రదర్శనమునకు వచ్చినవారిలో ఇద్దరు టర్కీదేశపు రాజకుమార్తెలుగలరు.

13:—అలహాబాదు. యశపాలుడను విప్లవకారుని దాచియుంచినదనుకారణమున విదేండ్లుశిక్ష ననుభవించు చున్న సావిత్రీదేవియను బరిషుస్త్రీ (జఫరాలిగారిసతి) నేడు ఆయుధశాసనము 20 సెక్షను ప్రకారముగల వేరొకకేసులో విడుదల చేయబడెను. జనవరి 23-న తేదీన యశపాలుడు, యీమె అరెస్టు చేయబడినపుడు లైసెన్సులేనిరివాల్వరులు రెండు ఈమెయింటదొరికినందున ఈకేసు చేయబడెను. జూరీ ఆమె నిర్దోషియని ఏకగ్రీవముగ జెప్పిరి. అసిస్టెంటు సెషన్సుజడ్జి బిజబిహారిలాలుగారు వారితో నేకీభవించి తీర్పుచెప్పిరి.

14:—డక్కా. డక్కా మండలసభాసందర్భమున అధ్యక్షురాలగు శ్రీమతి నాగేంద్రబాలసతిగారి అరెస్టు.

:—గుంటూరు. గుంటూరుపురస్త్రీల జ్ఞానభివృద్ధికై శ్రీమహాలక్ష్మీపత్రికాపఠనమందిరమును బోడుపల్లి బాలాత్రిపురసుందరమ్మ, దేవరకొండ హనుమాయమ్మగార్లు నెలకొల్పిరి.

15:—మదరాసు. పికెటింగుచేయ వాలంటీరులను నియమించుచుండగ డిక్టేటరగు శ్రీమతి సరస్వతి పాండు రంగంగారిని అరెస్టుచేసిరి.

:—వేలూరు. దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారిభార్య కమలమ్మగారును; సమదర్శిని, జన్మభూమి సంపాదకులగు ఎస్. జి. ఆచార్యగారిసతి అన్నపూర్ణదేవిగారును, దుర్భా వేంకటాద్రిగారిభార్య వెంకటరమణమ్మగారును విడుదలచేయబడిరి.

18:—మధుర. శ్రీమతి గుమ్మడిదల దుర్గాబాయిగారి విడుదల. వీరుజైలులో 5 నెలలుగడపిరి. ఒకనెల రెమిషనువచ్చినది. బరువులో 20 పౌనులుతగ్గిరి. ఈమె జనవరి 17 వ తేది 6 నెలల కఠినశిక్షపొందెను. మధురజైలులో ఒకనాడురాత్రి ఒకకమ్మస్త్రీ తనబిడ్డను ఉరిపోసిచంప ప్రయత్నించగా దుర్గా బాయిగారు అప్రయత్నమునకడ్డుపడి ఆపిల్లవానిని బ్రతికించిరి.




**పత్రికాసంపాదకురాలు గౌరవింపబడినది:—**

హైదరాబాదునగరమున 'హమ్‌జోలి' అని ఒకఉర్దూమాసపత్రిక ప్రచురింపబడుచున్నది. ఆపత్రిక సంపాదించునది ఒకస్త్రీ. ఆమెకు హైదరాబాదు నబాబుగారు దర్శనమిచ్చి ఆసంపాదకురాలి నెంతయోగౌరవించిరి. పత్రికాభివృద్ధివిషయమై పలువిషయములు ఆమెతోచర్చించిరి. తమభార్యయగు దుల్హాన్‌పాషాబీగముగారితోచెప్పి ఈపత్రికకు వ్యాసములువ్రాయునట్లు చేయుదుమనియు, ఈపత్రికకు ఆమెను ప్రధానపోషకురాలుగ చేరునట్లు చేయుదుమనియు వారుచెప్పిరి. దేశభాషాపత్రికలపై సంస్థానాధీశ్వరులెల్లరు ఇట్టిశ్రద్ధను, అభిమానమును వహింపవలసిన యవసరమెంతేనిగలదు. దీనిని గమనించిన నబాబుగారిని దేశభాషాపత్రికావ్యాపారు లెల్లరు కొనియాడగలరు.

**ఫ్రాన్సు స్త్రీల కు వోట్లు:—**

"వింతపమన, చిరకాలమునుండియు స్వపరిపాలనము ననుభవించుచున్న పాశ్చాత్య దేశములలో నింకను స్త్రీలవోట్లవిషయమున ప్రాతికూల్యము వెలువడుచునేయున్నది. ఇంగ్లండులో స్త్రీలకు వోటింగుఅధికారమిచ్చి ఎంతకాలమోకాలేదు. ఫ్రాన్సునందు, స్త్రీలకింకను వోటింగుఅధికారము చేకూరియుండలేదు. ఫ్రెంచి సెనేటువారు స్త్రీలహక్కు-స్థిరపడకుండ ఇంతవరకు అడ్డుపడుచున్నారు. ఫ్రెంచి ప్రజాప్రతినిధిసభ వారుమాత్రము ఈ సంస్కరణమును చాలాకాలమునుండీ ఆమోదించుచునేయుండిరి. ఫ్రెంచిప్రభుత్వమువా రిందుకు సంబంధించినచట్టమునుగూర్చి మరల యోజించుచున్నారట. ఈచట్టమునకు సెనేటుసభవారు మరల అడ్డుపడెదరో, లేక కాలస్వభావమునుగుర్తించి, వోటింగుహక్కు నీమారు స్థిరపరచెదరో చూడవలయును. హిందూదేశ మింకను స్వపరిపాలనమును బడయకపోయినను స్త్రీలకు వోటింగుహక్కు-నిచ్చువిషయమున, ఎట్టియభ్యంతర మింతవరకు జూపలేదు. పురుషులతోసమానముగ స్త్రీలకు రాజకీయములగు హక్కు-లనిచ్చుటకు హిందూదేశ మెప్పుడును సంసిద్ధముగనున్నది. కాంగ్రెసుమహాసభ స్త్రీని అధ్యక్షురాలుగనెన్నుకొని, తన

కార్యక్రమమును నిర్వహించియుండెను. ప్రజాసంఘములలో స్త్రీలు సముచితరీతిని గౌరవింపబడుచున్నారు. ఇట్టిసందర్భమున స్వపరిపాలనమునకు పాశ్చాత్యదేశములు అర్హములో హిందూదేశము ఎక్కువ అర్హమో కనుగొనుటకీయొక్కనిదర్శనము సరిపోవును." అను ఆంధ్రపత్రిక సంపాదకీయవ్యాసశకలమెంతయు సమాదరణీయము. ఫ్రెంచిస్త్రీల వోటింగుహక్కువిషయమై మున్నొకసారి మేమీయాలోచనయందు ప్రస్తావించియుంటిమి.

**వితంతువివాహ సహాయకసభ: గుంటూరుశాఖ:—**

లాహోరునివాసులగు సర్ గంగారాంగారు అనాథలగు వితంతువులుపడుచున్న దుర్భరకష్టములను తొలగింప నుద్దేశించి లాహోరులో విధవావివాహ సహాయకసభ అనుపేరుతో నొకసంస్థనుస్థాపించి దాని పోషణార్థమై లక్షరూప్యములను విరాళముగనిచ్చియున్నారు. ఈ సభవారు హిందూదేశమంతటను శాఖలను వ్యాపింపజేసిరి. ఇపుడు గుంటూరునందు ఆసభకొకశాఖనిర్మింపబడినది. ఆంధ్రసంఘసంస్కర్తలలోనొకరై తెలుగునుసేవింపుచున్న పాలపర్తి రామమూర్తిగారు దీనికి కార్యదర్శులుగానున్నారు. వితంతూద్వాహము చేసికొననిచ్చగల పురుషులు, వితంతువులు తమదరఖాస్తులను వారికి పంపవచ్చును. వారీయుత్తరప్రత్యుత్తరములను రహస్యముగ నుంచగలరు. తగినసంబంధము కుదిర్చి వివాహముచేయుటకు వారు బద్ధకంకణులై యున్నారు. ఈసదవకాశము ఆంధ్రప్రజోపయోగమునకువచ్చునుగాకయని గృహలక్ష్మి ఆశీర్వదింపుచున్నది.

**వివాహసంస్కరణసంఘము: ఉప్పాడ:—**

శ్రీయుతులు అల్లక సన్యాసయ్య, దొంతంశెట్టి సోమరాజుగార్లు సంయుక్తకార్యదర్శులుగా తూర్పుగోదావరిజిల్లా ఉప్పాడకార్యస్థానముగా వివాహసంస్కరణసంఘము ది 16-2-32 తేదీని స్థాపింపబడినది. బాల్యవివాహములను నిరసించుట, రజస్వలానంతరవివాహములను ప్రోత్సహించుట, భర్తమరణానంతరము పునర్వివాహమాడ తలంపుగల స్త్రీలకు సంఘము ఆటంకముకలుగచేయరాదని ప్రబోధించుట, వివాహాదికార్యములందు వేశ్యామేళములు పూర్తిగాబహిష్కరించి ఇతరవినోదవ్యయములనుకూడ చాలవఱకు తగ్గించ హెచ్చరించుట, పెండ్లికట్నములనిరసించుట ఈసంఘమువారి ఉద్దేశములు. ఈఉద్దేశములను నెఱవేర్చుటకు ఈసంఘమువారు కార్యక్రమమును త్రొక్కియున్నారు. ప్రతిగ్రామమునందును ఈసంఘమునకు శాఖలుస్థాపించి, సభ్యులు విరివిగాచేరుటకై ఏడాదికి ఒకఅణా చందాఉంచి కరపత్రముల, ఉపన్యాసములమూలమున ప్రచారముసలుపనున్నారు. ఈ సంఘమునకు జయముకలుగునట్లు ఆంధ్రమహాశయులు పూర్ణసాహాయ్యమొనర్తురుగాకయని కోరుదుము.

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.